# పరిశోధన విధానం

## RESEARCH METHODOLOGY


డా॥ ఎస్. జయప్రకాష్, ఎం.ఏ., పిహెచ్.డి.

లెక్చరర్, తెలుగు విభాగం

మధురై కామరాజ్ విశ్వవిద్యాలయం

మధురై – 625 021





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్ - 500 001

PARISHODHANA VIDHANAM - BY S.JAYAPRAKASH

విశాలాంధ్ర ప్రచురణాలయం (1953 - 2002) స్వర్ణోత్సవ ప్రచురణ

గత ముద్రణలు : 1990, 1992, 1993, 1996, 2000

ప్రచురణ నెం. : 2350 / 2210 R

ప్రతులు : 1000

ఆరవ ముద్రణ : జూలై, 2003



టైటిల్ డిజైన్ : రమ

వెల : రూ. 50.00

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
అబిడ్స్, హైదరాబాద్ - 500 001.
E-mail : visalaandhraph@yahoo.com

**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్ బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

*ముద్రణ :* శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్ - 500 029.



మా అన్నయ్య

శ్రీ పరంధామ పిళ్లై గారికి

ఈ చిన్న పుస్తకం

అంకితం



# ఆశంస

తెలుగు భాషా సాహిత్యాలను అధ్యయనం చేయటం పూర్వం ప్రవృత్తిగా ఉండేది. వాటి అంతస్సూత్రాలను ఆవిష్కరించాలనే తపన పరిశోధనలకు దారి తీసింది. గతంలో అభిమానం, అభినివేశం ఉన్నవాళ్ళు తమ తమ అభిరుచులను పురస్కరించుకొని పరిశోధించారు. ఆంగ్ల భాషా సాహిత్యాల పరిచయం ప్రభావంగా మారిన తరవాత, విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధనలు వ్యావృత్తిగా పరిణమించాయి. పూర్వ పరిశోధకులకు ఒక నిర్దిష్ట మార్గం లేదు; గమ్యం మాత్రమే ఉండేది. ఇప్పటి వారికి గమ్యంకన్నా మార్గం ప్రధానమయింది. అభినివేశం స్థానంలో అవసరం బలపడుతున్నది. నానా విశ్వవిద్యాలయాల్లో ఇప్పుడు వందలమంది పరిశోధిస్తున్నారు. వారికి మార్గ నిర్దేశం చేసే ఆచార్యులూ ప్రాచార్యులూ తాము తమ పరిశోధనల్లో పాటించిన ధర్మాలను తమ విద్యార్థులకు ప్రవచిస్తున్నారు. అదిన్నీ ఇంగ్లీషు భాషలో; ఇంగ్లీషులోని పుస్తకాలు తాము ముందు చదివి.

దశాబ్దాలుగా పరిశోధనలు జరుగుతూ బిరుదులు లభిస్తున్నా తెలుగు భాషా సాహిత్యాలకు బోధిస్తున్న పెద్దలు తరగతిలో తమ ఎదుట లేని, ఉండ లేని అభాగ్యులకు తమ విజ్ఞానం పంచిపెట్టే తీరికా ఓపికా లేక సతమతమై పోతున్నారు. తాము తెలుసుకొన్న పరిశోధన పద్ధతులకు తమ అనుభవాలను జోడించి, పరిశోధన విధానాలను తెలుగులో గ్రంథరూపంలో వెలువరిస్తే విశ్వవిద్యాలయాల్లో లేని ఇతరాభిమానులు ఎంతో కొంత ప్రయోజనం పొందే వారు. ఆ అవకాశం వారెందుకో కల్పించాలని సంకల్పించలేదు. అసలు తెలుగు శాఖల్లో ఎవరెవరు ఏయే అంశాలమీద పరిశోధించారో, పరిశోధిస్తున్నారో తెలుసుకోడానికి, తెలియజెప్పడానికి వారికున్న బరువు బాధ్యతలు వీలుకల్పించక పోతే ఒక పరిశోధక విద్యార్థి ఆ పని చేయవలసి వచ్చింది. దాన్ని వారు హర్షిస్తున్నారో గర్హిస్తున్నారో తెలియదు. ఇప్పుడు పరిశోధన విధానాలను గురించి చిన్న మొన్న ఆంధ్రేతర రాష్ట్రంలోని మదురై - కామరాజ్ విశ్వవిద్యాలయంలో ఆంధ్రోపన్యాసకుడుగా చేరిన డాక్టర్ జయప్రకాశ్ తెలుగులో ఒక పుస్తకం ప్రచురిస్తున్నాడు. అదే ఇది. తాము చేయని పని మరో సామాన్యుడు చేసినందుకు క్షమిస్తారని ఆశిస్తాను. ఆశీర్వదిస్తారని ఆకాంక్షిస్తాను

తెలుగులో వచ్చిన, వస్తున్న సిద్ధాంత వ్యాసాలను బండ్ల కెత్తవచ్చు తమ అభిమాన కవినో, పండితుడ్నో, అంశాన్నో ఆకాశానికెత్తటంలో నిర్దాక్షిణ్యంగా తదితరాలను అణగదొక్కడం ఆచారమయింది. తులనాత్మకంగా అధ్యయనం చేయటం, గుణదోషాలను వెంటనే పరిశీలించటం, అన్నిటికన్నా ముఖ్యం. ఆయా విషయాలను గురించి ఇతరులేమి చెప్పారో ఎత్తిరాయడంలో చూపే శ్రద్ధాభక్తి తాత్పర్యాలు తమ అభిప్రాయాలేమో, తమ పరిశోధన ఫలితాలేమో విస్పష్టంగా చెప్పటంలో పాటించటం అనేవి చాలా తక్కువ. ఏదో కవిత్వం రాస్తున్నట్లు ఆవేశంతో ఆవేగంతో ఆత్మాశ్రయ ధోరణిలో రాయటం అలవాటయిపోతున్నది. ఈ ధోరణి ఇతర సామాజిక మానవీయశాస్త్ర పరిశోధకుల్లో లేదు. అందువల్ల పరిశోధన విధానాలనూ, సిద్ధాంత వ్యాస రచనా పద్ధతులనూ నిర్దేశించే తెలుగు గ్రంథం ఎంతో అవసరం. ఆ కొరతను చేతనయినంతలో తీర్చడానికి ప్రయత్నించిన డాక్టర్ జయప్రకాశ్‌ను అభినందిస్తున్నాను— మనస్పూర్తిగా.

అన్నిటినీ కాకపోయినా కొన్ని తెలుగు సిద్ధాంత గ్రంథాలను— అందులోనూ లబ్ధప్రతిష్ఠులు రాసిన ఉత్తమ గ్రంథాలను— పరిశోధన పద్ధతుల దృష్ట్యా పరిశీలించి ఒక గ్రంథకర్త కానీ, మరెవరయినాగాని, డిగ్రీ వచ్చినా రాకపోయినా మరో గ్రంథం రాస్తే మన తెలుగు పరిశోధనల స్థాయి, స్వభావం, గుణదోషాలూ తెలుస్తాయనిపిస్తుంది. సిద్ధాంత ప్రవక్తలు ఆచరణలో తామాయా పరిశోధన పద్ధతులను ఎంతవరకు పాటించారో అనుభవపూర్వకంగా తెలుసుకొనే అవకాశం లోకానికి కలుగుతుంది. పరిశోధన ఒక వృత్తిగా పరిణమించిన ఈ దశలో ఆ వృత్తి ఏయే కట్టుబాట్లకు లోబడి ఎంత నిజాయితీతో నడుస్తున్నదో తెలుసుకోవటం సమాజానికి కూడా అవసరమే. ఒకవైపు గౌరవ బిరుదుల వారూ మరోవైపు బిరుదులు లేని, ఆశించని వారూ పని చేస్తున్న పరిశోధన రంగంలో వృత్తి పరిశోధకుల శాస్త్రీయ విధానాలే భవిష్యత్తులో మార్గ నిర్దేశనం చేయాలి. ఆ పుణ్యం కూడా ఈ రచయితే కట్టుకుంటే ఎంతో సంతోషిస్తాను. ఈ రచన పరిశోధకుల, భాషాభిమానుల ఆదర గౌరవాలు సంపాదించాలని కోరుతున్నాను.

హైదరాబాదు<br>
18-7-1990

బూదరాజు రాధాకృష్ణ

# పరిశోధన ఒక మంత్రదుర్గం కాదు...

పాతాళభైరవి చిత్రంలోని మాంత్రికుడు తోట రామున్ని 'సాహసం సేయరా' అని తన స్వార్థం కోసం ప్రోత్సహిస్తాడు. ఈనాటి విశ్వవిద్యాలయాల్లోని పర్యవేక్షకులు బుద్ధి ఉన్న వాళ్ళెవరూ అట్లాంటి సాహసం చేయమని పరిశోధనోత్సాహులైన విద్యార్థుల్ని ప్రోత్సహించలేరు. ఎందుకంటే పరిశోధన అతీత శక్తుల్ని వశపరచుకునే మంత్రదుర్గం కాదు; పర్యవేక్షకుడు తన విద్యార్థి ద్వారా వాటిని వశపరచుకోవటానికి వలపన్నే దుష్ట మాంత్రికుడూ కాడు. పరిశోధక విద్యార్థి జానపద నాయకుడైన తోట రాముడు అంతకన్నా కాడు.

పరిశోధన ఒక Methodology - పద్ధతి క్రమం. పరిశోధక వ్యాస నిర్మాణాంశాలూ, పరిశోధక విషయ సంబంధంగా ఏర్పరచుకొన్న పరిశోధక భావాలూ, పరిశోధకుడి దృక్పథమూ ఈ పద్ధతి క్రమాన్ని రూపొందిస్తాయి. ఏదో ఒక సాహిత్య సంబంధమైన విషయాన్ని పరిశోధనకు తీసుకున్నప్పుడు ఈ మూడింటితో పాటు పరిశోధకుని కుండే ఇంద్రియ స్పందనా శక్తి - Sensibility కూడా ఈ పద్ధతి క్రమంలో భాగమవుతుంది.

ఈ దృష్టి అలవడడానికి విశ్వవిద్యాలయాలలోని పరిశోధనాసక్తులకు సాధన అవసరం. ఈ సాధనకు శిక్షణ సామగ్రి అవసరం. ఈ శిక్షణ సామగ్రి బోధన రూపంలో ఉండవచ్చు. అధ్యయన రూపంలో ఉండవచ్చు. అధ్యయన రూప సామగ్రి, అంటే పఠనీయ సామగ్రి బోధనకు కూడ ఉపయోగపడుతుంది.

అభివృద్ధి చెందిన భాషల్లో అంటే ఇంగ్లీషులాంటి యూరోపియన్ భాషల్లో ఈ సామగ్రి మంచి పాఠ్య పుస్తకాల రూపంలో, వ్యాసాల రూపంలో, శైలీ గ్రంథాల రూపంలో పుష్కలంగా లభ్యమవుతుంది. ఆధునిక భారతీయ భాషలు వర్ధమాన భాషలు. ఇవి ఇప్పుడిప్పుడే ఆధునిక భావాలను, ఆధునిక రచనా పద్ధతి క్రమాలను తమ భాషల్లో సంతరించుకుంటున్నాయి. విశ్వవిద్యాలయాల్లోని వివిధ శాఖల్లో పరిశోధన గత రెండు దశాబ్దాల్లో గణనీయంగా పెరిగిన ఫలితంగా వీటి ప్రభావం భారతీయ భాషల్లో వెలువడే గ్రంథాల మీద పడుతోంది. ఈ కారణంగా భారతీయ భాషల్లో పద్ధతి క్రమానికి ఒక ప్రాధాన్యం వచ్చింది.

ఇక్కడ ఒక వెలితిని ప్రస్తావించకోక తప్పదు. వివిధ విజ్ఞాన శాస్త్రాలకు సంబంధించిన పరిశోధనలన్నీ ఇంగ్లీషులోనే ఇప్పటికీ సాగుతున్నాయి. ఆధునిక

భారతీయ భాషల్లో జరిగే పరిశోధనలు వేళ్ళమీద లెక్కించవచ్చు. ఈ విషయంలో సామాజిక శాస్త్రాల్లో జరుగుతున్న కృషి కొంత మెరుగు. అంటే ప్రధానంగా మన పరిశోధనలకు ప్రేరణ ఇంగ్లీషు, ఇంగ్లీషులోని పుస్తకాలే అన్నమాట. వీటిని విశ్వవిద్యాలయాలలోని తెలుగు శాఖలవారు తప్ప ఇతర శాఖలవారెవరూ తెలుగువారై ఉండి కూడా తెలుగులోకి తేవాలనే ప్రయత్నాలు చేయలేదు. మన శాస్త్రజ్ఞులకు మన జీవితం మీదా, ఆ జీవితం కష్టనిష్ఠూరాలు మాట్లాడుకునే మన భాష మీదా ఉండే ప్రేమకు ఇది చాలా శోచనీయమైన దృష్టాంతం. ఈ విషయంలో పొరుగు భాషలవారు కాస్త నయంగా ఉన్నారని తెలుస్తోంది.

తెలుగు శాఖలు, తెలుగు శాఖల్లోని పరిశోధన - వీటిని సమీక్షిస్తే ఇంత వరకు వెలువడిన పరిశోధక వ్యాసాల్లో సంస్కృత వ్యాఖ్యాన తర్క సంప్రదాయమూ కన్పించదు. పటిష్టమైన ఆధునిక పద్ధతి క్రమమూ కన్పించదు. ఆధునిక పద్ధతి క్రమాన్ని అంతో ఇంతో పాటించిన పరిశోధక వ్యాసాలు ఏవైనా ఉన్నాయంటే అవి భాషా పరిశోధనకు సంబంధించినవి. సాహిత్య పరిశోధన విషయంలో ఈ పద్ధతి క్రమం ఇంకా ఒక రూపాన్ని దిద్దుకోవలసి ఉంది. ఈ దశాబ్దిలో ఆధునిక సాహిత్యంపై జరిగిన ఒకటి రెండు పరిశోధనలు ఒక మినహాయింపు అయితే కావచ్చు - ఈ వెలితిని కొందరు గమనించడం వల్లనే పరిశోధన విధానానికి సంబంధించిన ఒకటి రెండు పుస్తకాలను కొన్ని వ్యాసాలను తెలుగులో ఇద్దరు ముగ్గురు వెలువరించటానికి ప్రయత్నించారు. అవి ఇప్పటి ఈ పుస్తకంతో సహా సమగ్రమైనవి కావు. అయితే యువ పరిశోధకుడు, డా॥ జయప్రకాష్ రాసిన ఈ పుస్తకం 'పరిశోధన విధానం' ఇంతకు ముందు వెలువడిన రెండింటికంటే విపులమైంది. వివరణాత్మకమైంది. పరిశోధక వ్యాస రూప నిర్మాణాంశాలను విశ్లేషణాత్మకంగా చర్చించింది.

ఆంధ్రదేశంలోని తెలుగు శాఖల అధ్యాపకులు M. Phil. మెథడాలజీలో ఒకటో రెండో పేపర్లను గత పదిహేనేళ్ళుగా బోధిస్తూనే ఉన్నారు. ఆ బోధన ఏ రకంగా సాగుతుందో విశ్లేషించుకోవడానికి కావలసిన ముద్రణ సామగ్రి లేదు. వీళ్ళెవరికీ పట్టని పని రాష్ట్రేతర మదురై విశ్వవిద్యాలయంలోని జయప్రకాష్ పట్టించుకొన్నందుకు మనం మెచ్చుకోవాలి. యాదృచ్ఛికం ఏమంటే ఈ పుస్తకాని కంటే ముందు వెలువడిన రెంటినీ కూడా రాష్ట్రేతర విశ్వవిద్యాలయాలలోని అధ్యాపకులు వెలువరించటమే. మన భాషను, మన సాహిత్యాన్ని ఒక పద్ధతి క్రమంలో పరిశీలించాలని ఇంట్లోవాళ్ళ కంటే బయటివాళ్ళే ఎక్కువ మథన పడుతున్నారనడానికి ఇదొక సాక్ష్యం.

ఇట్లాంటి పుస్తకాలు రాయటంలో చాలా చిక్కులున్నాయి. ఒక చిక్కు విషయ విశ్లేషణ క్రమానికి సంబంధించింది. మరొక చిక్కు పరిభాషకు సంబంధించింది. విషయ విశ్లేషణ క్రమంలో ఉదాహరణలను పేర్కొంటే అది

అన్వయ పూర్వకమవుతుంది. ఈ పుస్తక రచయితది theoritical approach కాబట్టి దీనిలో ఉదాహరణలు దాదాపు లేవు. పరిభాషను సృష్టించు కోడంలో ఎంతో శ్రమ కనిపిస్తుంది. రచన చిత్తశుద్ధితో సాగింది.

డా॥ జయప్రకాష్ భాషా సామాజిక పరిశోధకుడు. తులనాత్మక సాహిత్య కృషి చేసినవాడు. దాన్ని పరిశీలిస్తున్నవాడు. పరిశోధకుడుగా, అధ్యాపకుడుగా తన అనుభవాలు నలుగురితో పంచుకొని తెలుగులో పరిశోధన వికాసానికి తోడ్పడాలనే తపన ఉన్నవాడు. ఇంతకంటే సంతోషించదగిన విషయం మన విశ్వవిద్యాలయాల్లో ఏముంటుంది?

ఈ పుస్తకాన్ని ముమ్ముందు ఒక ప్రామాణిక పాఠ్య గ్రంథంగా రూపొందించే ప్రయత్నం తప్పక చేయగలడనే విశ్వాసం నాకుంది. పూర్వ విద్యార్థి, రాయలసీమ గ్రామ నామ సర్వే పథకంలో సహచరుడూ అయిన డా॥ జయప్రకాష్ ఈ మొదటి ముద్రణకు అందుకే ఆహ్వానం.

హైదరాబాదు<br>
20 జూలై, 1990.

డా. కేతు విశ్వనాథరెడ్డి<br>
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం

# కృతజ్ఞతలు

పరిశోధన విధానం మీద పుస్తకం రాయాల్సిందిగా నన్ను ప్రేరేపించిన ఆప్తమిత్రులు డా॥ జి. కె. ప్రసాద్‌గారికి, కావాల్సిన పుస్తకాలను ఇచ్చి రచనలో సహాయ సహకారాలందించిన మిత్రులు డా॥ జి. వి. యస్. ఆర్. కృష్ణమూర్తి, శ్రీ జయబాలన్, యస్. జె. గార్లకు–

చిత్తుప్రతిని ఆమూలాగ్రం చదివి చక్కటి సూచనలు ఇచ్చిన మిత్రులు డా॥ టి. యస్. గిరిప్రకాష్, డా॥ పి. నరసింహారెడ్డి, డా॥ యస్. జి. డి. చంద్రశేఖర్, డా॥ కె. యస్. రమణ గార్లకు–

శిష్యవాత్సల్యంతో ఆశీస్సులందించిన డాక్టర్ బూదరాజు రాధాకృష్ణగారికి, ఆచార్య కేతు విశ్వనాథరెడ్డిగారికి–

నా కృషి ముద్రిత రూపంలో రావడానికి కారకుడయిన మా అన్నయ్యకూ–

పుస్తకం రాయడంలో నాతోపాటు శ్రమించిన శ్రీమతి డా॥ సత్యవతికి–

ముఖపత్రాన్ని అందంగా తీర్చిదిద్దిన మిత్రులు, ప్రముఖ చిత్రకారులు రమ గారికి–

ఓపిగ్గా శుద్ధ ప్రతిని తయారుచేసిపెట్టిన పరిశోధక విద్యార్థిని కుమారి మాధురికి–

పుస్తకాన్ని శ్రద్ధగా, అందంగా ముద్రించిన లక్ష్మి గణపతి ప్రింటింగ్ ప్రెస్ అధినేతలు, శ్రీమతి జె. ఎస్. గుణసుందరిగారికి, ప్రెస్ కార్మిక సోదరులకూ–

ప్రచురణ బాధ్యతలను స్వీకరించి ప్రోత్సహిస్తున్న విశాలాంధ్ర ప్రచురణ సంస్థవారికి, ముఖ్యంగా సహృదయులు శ్రీ రాజేశ్వరరావు గారికి–

మదురై<br>
29-1-92

—జయప్రకాష్

# విషయసూచిక


1. పరిశోధన (Research) 1.11

1.1. ప్రవేశిక 1
1.2. అర్థ వివరణ 2
1.3. పరిశోధనలో వైజ్ఞానిక పద్ధతి 4
1.4. పరిశోధన లక్షణాలు 5
1.5. ఉత్తమ పరిశోధన లక్షణాలు 7
1.6. పరిశోధన క్రమం 8
1.7. పరిశోధనలో వివిధ రకాలు 10
1.8. పరిశోధన ఆవశ్యకత 10
1.9. ఉపసంహారం 11

2. పరిశోధకుడు (Researcher) 12.17

2.1. ప్రవేశిక 12
2.2. అర్హతలు 12
2.3. పరిశోధకుడు ఎదుర్కొంటున్న సమస్యలు 16
2.4. ఉపసంహారం 17

3. పరిశోధన సమస్య (Research Problem) 18.25

3.1. ప్రవేశిక 18
3.2. అర్థ వివరణ 18
3.3. పరిశోధనాంశ ఆకరాలు 19
3.4. పరిశోధనాంశం ఎలా ఉండాలి? 21
3.5. పరిశోధన సమస్య ఎంపికలో కొన్ని సూచనలు 22
3.6. పరిశోధన సమస్య ప్రామాణ్య నిరూపణ 24
3.7. సిద్ధాంత వ్యాస సంగ్రహ రూపం 25
3.8. ఉపసంహారం 25

**4. పరిశోధన ప్రణాళిక (Research Design)** **26-32**

4.1. ప్రవేశిక 26
4.2. అర్థ వివరణ 26
4.3. పరిశోధన ప్రణాళికలోని ముఖ్యాంశాలు 27
4.4. ఉత్తమ పరిశోధన ప్రణాళిక 31
4.5. పరిశోధన ప్రణాళిక ప్రయోజనాలు 32
4.6. ఉపసంహారం 32

**5. ఊహాప్రతిపాదన (Hypothesis)** **33-40**

5.1. ప్రవేశిక 33
5.2. అర్థ వివరణ 33
5.3. ఊహాప్రతిపాదన - ముఖ్య లక్షణాలు 35
5.4. ఊహాప్రతిపాదన - రకాలు 36
5.5. ఊహాప్రతిపాదనను రూపొందించుకొనే విధానం 36
5.6. ఊహాప్రతిపాదన ప్రామాణ్య నిరూపణ 38
5.7. ఊహాప్రతిపాదన ప్రయోజనాలు 39
5.8. ఉపసంహారం 40

**6. పరిశోధన సామగ్రి సేకరణ (Collection of Source Material and Data)** **41-49**

6.1. ప్రవేశిక 41
6.2. పరిశోధన సామగ్రి-వివిధ ఆకరాలు 41
6.3. గ్రంథాలయాలు 44
6.4. ఉపయుక్త గ్రంథసూచి 45
6.5. సవిమర్శక ఉపయుక్త గ్రంథసూచి 46
6.6. పరిశోధన సమాచారం రాసుకొనే విధానం 46
6.7. నోట్సు రాసుకోవడంలో కొన్ని మెలకువలు 47
6.8. పరిశోధన సమాచారం - విభాగాలు 48
6.9. విషయ సేకరణలో జాగ్రత్తలు 49
6.10. ఉపసంహారం 49

**7. పరిశీలన (Observation)** **50-56**

7.1. ప్రవేశిక 50
7.2. అర్థ వివరణ 50
7.3. పరిశీలన లక్షణాలు 51

7.4. పరిశీలనలో ముఖ్యాంశాలు 53
7.5. పరిశీలన విభాగాలు 53
7.6. పరిశీలన విధానం 54
7.7. పరిశీలనలో తీసుకోవలసిన జాగ్రత్తలు 54
7.8. పరిశీలన ప్రయోజనాలు 55
7.9. పరిశీలన పరిమితులు 56
7.10. ఉపసంహారం 56

**8. ప్రశ్నావళి పద్ధతి (Questionnaire Method)** **57-63**

8.1. ప్రవేశిక 57
8.2. అర్థ వివరణ 57
8.3. ప్రశ్నావళి పద్ధతిలోని ముఖ్యాంశాలు 58
8.4. ఉత్తమ ప్రశ్నావళి లక్షణాలు 58
8.5. ప్రశ్నావళిని పంపించే పదతి 60
8.6. ప్రశ్నావళి పద్ధతి ప్రయోజనాలు 62
8.7. ప్రశ్నావళి పదతి పరిమితులు 62
8.8. ఉపసంహారం 63

**9. సందర్శన పద్ధతి (Interview)** **64-76**

9.1. ప్రవేశిక 64
9.2. అర్థ వివరణ 64
9.3. సందర్శన పద్ధతి, ఆశయాలు 65
9.4. విభాగాలు 67
9.5. సందర్శకుని గుణగణాలు 71
9.6. సందర్శన పద్ధతి విజయవంతం కావడానికి కొన్ని సూచనలు 72
9.7. సందర్శన పద్ధతి ప్రయోజనాలు 74
9.8. పరిమితులు 75
9.9. ఉపసంహారం 76

**10. సిద్ధాంత వ్యాస రచన (Thesis Writing)** **77-94**

10.1. ప్రవేశిక 77
10.2. పరిశోధన నివేదిక - రూపభేదాలు 77

10.3. సిద్ధాంత వ్యాస రూపకల్పన 79
10.4. సిద్ధాంత వ్యాస స్వరూపం (Format of the Thesis) 79
10.4.1. పూర్వభాగం 80
10.4.2. గ్రంథ భాగం 80
10.4.3. ఆధార విషయ వివరణ 80
10.5. ఉత్తమ సిద్ధాంత వ్యాస రచనకు కొన్ని మెలకువలు 86
10.6. మూడు రచనా దశలు 88
10.6.1. మొదటి దశ 88
10.6.2. రెండవ దశ 90
10.6.3. మూడవ దశ 93
10.7. ఉపసంహారం 94

**11. ఆధార విషయ వివరణ (Reference Material) 95-110**

11.1. ప్రవేశిక 95
11.2. ప్రయోజనాలు 95
11.3. సూచికలు 96
11.4. ఉల్లేఖాలు 102
11.5. ఉపయుక్త గ్రంథసూచి 102
11.6. ఉదాహృతాలు 106
11.7. అనుబంధాలు 109
11.8 ఉపసంహారం 110

**చివరగా... 111-112**
**ఉపయుక్త గ్రంథసూచి 113-114**
**పారిభాషిక పదాలు 115-120**

# 1. పరిశోధన (RESEARCH)

## 1.1. ప్రవేశిక

ఇరవైయవ శతాబ్దం పరిశోధనయుగం. ఈనాడు అన్ని రంగాల్లోనూ పరిశోధనలు ముమ్మరంగా జరుగుతున్నాయి. తత్ఫలితంగా సమాజం సర్వతోముఖాభివృద్ధిని సాధించి ప్రగతిపథంవైపు పయనిస్తూ ఉంది. ఈనాడు పరిశోధనలు ఇంత పెద్ద ఎత్తున జరగడానికి నేటి పరిశోధకుల్లో పెంపొందిన వైజ్ఞానిక దృక్పథమే ప్రధాన కారణమని చెప్పవచ్చు. మొన్నటివరకు సమాజంలో పేరుకుపోయిన మూఢ నమ్మకాలు, కట్టుబాట్లు మానవ ప్రగతికి అడ్డుగా ఉండేవి. ప్రజల్లో అన్వేషణాచింతన క్షీణించడానికి మత ప్రాబల్యం కూడా ఒక కారణంగా భావించవచ్చు. కొత్త కొత్త ఆలోచనలను, నూతన పరిష్కార మార్గాలను ఆనాటి మతాధికారులు తీవ్రంగా నిరసించేవారు. మధ్యయుగాల్లో జరిగిన ఒక వాస్తవ సంఘటనను బేకన్ ఈ విధంగా చిత్రీకరించాడు :

క్రి. శ. 1432 లో ఆనాటి పండితుల్లో ఒక పెద్ద వివాదం చెలరేగింది. గుర్రానికి ఎన్ని పళ్ళు ఉంటాయి అన్నదే వివాదానికి మూలకారణం. దేశం నలుమూలల నుండి ఆహ్వానింపబడిన మతాధికారులు, పండితులు ఒకచోట సమావేశమయ్యారు. 13 రోజులపాటు వాదోపవాదాలు, చర్చోపచర్చలు తీవ్రంగా జరిగాయి. ఎన్నో ప్రాచీన గ్రంథాలు తిరగవేశారు. అయినప్పటికి వారొక నిర్ణయానికి రాలేకపోయారు. 14వ రోజున ఒక యువకుడు పండితసభలో ప్రవేశించాడు. గుర్రం నోటిని పరిశీలించి చూశామంటే ఎన్ని పళ్ళు ఉన్నాయో తెలుస్తుంది కదా! అని వారికి చెప్పాడు. ఈ మాటలలో పండితుల్లో పెద్ద సంచలనం చెలరేగింది. అందరూ ఒక్కసారిగా అతనిపై విరుచుకుపడ్డారు. నిజం తెల్సుకోవాలంటే ఇదా పద్ధతి? ఇటువంటి వింత ఎక్కడైనా వుందా? అంటూ విస్తుపోయారు. ఆ శని దేవత ప్రభావం వల్లనే ఇతడీ విధంగా మాట్లాడుతున్నాడని అతన్ని సభ నుండి గెంటివేశారు.[1]

ప్రజల్లో మొలకెత్తిన హేతువాద దృక్పథాన్ని ఆనాటి మతాధికారులు ఏ విధంగా సమాధి చేసేవారో ఈ సంఘటన తెలియజేస్తూ వుంది.

ఈ విధమైన తీవ్ర ప్రతిబంధకాలు ఎదురైనప్పటికీ ప్రజల్లో అన్వేషణా శక్తి పూర్తిగా నశించలేదు. ప్రపంచగతిలో ఒక క్రమపద్ధతి ఉందనే విషయాన్ని కొందరు జిజ్ఞాసువులు గ్రహించారు. నిశిత పరిశీలనతో కార్యకారణ సంబంధాలను వాళ్ళు నిరూపించారు. ఈ కారణాల వల్ల ఈ కార్యం జరుగుతుందని కచ్చితంగా, దృష్టాంత పూర్వకంగా చెప్పగలిగారు. ఈ విధంగా ప్రయోగాత్మక ఆధారం లేక వ్యక్తిగత అనుభవం అంతకు ముందున్న గుడ్డి నమ్మకాలకు స్వస్తి చెప్పి వైజ్ఞానిక పరిశోధనకు నాంది పలికింది.

## 1.2. అర్థ వివరణ

పరిశోధన అంటే అన్వేషించడం, వెదకడం అనే అర్థాలున్నాయి. 'Research' అనే ఆంగ్ల పదానికి సమానార్థకంగా తెలుగులో పరిశోధన అనే పదాన్ని ప్రయోగిస్తున్నారు. 'RESEARCH' అనే పదం ఫ్రెంచి భాషా పదమైన 'RECERCHER' నుండి పుట్టింది. ఈ French పదానికి 'వెదకటం' అని అర్థం. ఒక విషయాన్ని గురించి సమగ్రంగానూ, నిశితంగానూ చేసే అన్వేషణా ప్రయత్నాన్ని ఇది సూచిస్తుంది. సత్యాన్ని తెలుసుకోవాలనే బలమైన ఆకాంక్షే పరిశోధనగా పరిణమిస్తుంది. పరిశోధన అంటే ఒక అంశాన్ని వైజ్ఞానిక దృక్పథంతో క్రమ పద్ధతిలో అన్వేషించి సత్యస్థితిని బహిర్గతం చేసి నూతన సిద్ధాంతాలను ప్రతిపాదించడం అని చెప్పవచ్చు.

అస్పష్టం, అగోచరం, అగ్రాహ్యం, అయోమయం అయిన ఒక అంశాన్ని వైజ్ఞానిక దృక్పథంతో పరిశీలించి ఆ అంశం నిజ స్థితిని ప్రకటించడమే పరిశోధన ప్రధాన లక్షణం. పరిశోధన అవ్యక్తంగా వున్న అంశాలను సువ్యక్తం చేస్తుంది. పరిశోధన నూతన విషయాలను ఆవిష్కరిస్తుంది. జ్ఞానాన్ని పెంపొందిస్తుంది. పరిశోధన అనేది ఒక ప్రయాణం. అజ్ఞానం నుండి జ్ఞానానికి చేసే ప్రయాణం. వాస్తవాన్ని తెలుసుకోవడానికి చేస్తున్న ఏ ప్రయత్నమైనా పరిశోధనగా భావించవచ్చునని పై విషయాలనుబట్టి తెలుస్తోంది.

తెలియని విషయం ఎదురైనపుడు దాన్ని గురించి తెలుసుకోవాలనే కుతూహలం కలగడం మానవ సహజం. ఆ విషయం గురించి తెలుసుకోవాలనే తపన పరిశోధకుడిలో ప్రారంభమౌతుంది. ఇతరులెవరూ తన సందేహాలను తీర్చలేక పోయినప్పుడు తానే స్వయంగా ఆ సమస్య పరిష్కారానికి పూనుకొంటాడు. ఒక క్రమపద్ధతిలో పరిశీలన సాగించి సమస్యకు పరిష్కారాన్ని కనుగొంటాడు. ఆ విధంగా వస్తు నిజ స్థితిని ఆవిష్కరిస్తాడు. సందేహాలను నివృత్తి చేస్తాడు. తెలియని అంశాలను స్వయంగా పరిశీలించి తెలుసుకోవాలనే జిజ్ఞాస ప్రతి పరిశోధకుడికి వుండాలి. అలాంటి జిజ్ఞాస ఉన్నప్పుడే అతడు విజ్ఞాని అవుతాడు.

పరిశోధన అంటే—

"A careful investigation or enquiry specially through search for new facts in any branch of knowledge" అని Advanced Learners Dictionary of current English లో అర్థం ఇచ్చారు.

వివిధ ఆకారాల ద్వారా పరిశోధన సమస్యను కూలంకషంగా పరిశీలించి పరిష్కార మార్గాన్ని కనుగొనడం పరిశోధన. పరిశోధనను ఒక క్రమ పద్ధతిలో కొనసాగించాలి. వైజ్ఞానిక దృక్పథంతో నూతన ఆలోచనా విధానాలతో ఆధునిక సాంకేతిక నైపుణ్యంతో సమస్యలను పరిష్కరించే విధానాన్ని మనం పరిశోధన అనవచ్చు.

C. C. CRAWFORD పరిశోధనను నిర్వచిస్తూ-

"Research is simply a systematic refind technique of thinking employing specialized tools, instruments and procedures in order to obtain a more adequate solution of a problem than would be possible under ordinary means. It starts with a problem, collects data or facts analyzes there critically and reaches decisions based on the actual evidence. It involves original work instead of more exercise of personal opinion. It evolves from a genuine desire to know rather than a desire to prove something. It is quantitative seeking to know not only what but how much and measurment is therefore a central feature of it"[2]
అని అన్నాడు.

నూతన సత్యాలను ఆవిష్కరించడం, నూతన సిద్ధాంతాలను ప్రతిపాదించడం పరిశోధన ప్రధాన లక్ష్యాలుగా భావించవచ్చు. క్రొత్తగా కనిపెట్టిన నూతనాంశాలను వెల్లడి చెయ్యడంవల్ల పాత సిద్ధాంతాలు మార్పులు చెందడం, నూతన సిద్ధాంతాలు రూపొందడం, కొన్ని సూత్రాలు, పద్ధతులు అదనంగా చేరడం జరగాలి. అంటే అలాంటి గొప్ప మార్పులను తీసుకురాగల సిద్ధాంతాలను వెలువరించడమే పరిశోధన అవుతుంది కానీ, ఉన్నది ఉన్నట్లు చెప్పడం పరిశోధన కాదు. అంతేకాకుండా పరిశోధకుడు ప్రతిపాదిస్తున్న ఈ నూతన సిద్ధాంతాలు అంతకు పూర్వం ఎవరిచేతా, ఎక్కడా ప్రకటించి వుండకూడదు. ఏదైనా ఒక

అంశానికి సంబంధించి గతంలో పరిశోధనలు ఎంతవరకు జరిగాయో పరిశీలించి వాటిని కొనసాగించడమే నిజమైన పరిశోధన. పూర్వం పేర్కొన్న అంశాలనే మళ్ళీ చెప్పడం కాని, ఆ అంశాలను వివరించడం కాని పరిశోధన అనిపించుకోదు. పరిశోధన ఫలితాలు విజ్ఞాన ప్రపంచాన్ని విస్తృతం చేయాలి. నూతన అంశాలు కనిపెట్టాలనే దృష్టితో చేస్తున్న ప్రయత్నమే (Process of discovering something new) పరిశోధన అని భావించవచ్చు.

పరిశోధకుడు తాను సేకరించిన విషయాలను క్రమ పద్ధతిలో గుదిగుచ్చి నంత మాత్రాన పరిశోధన పూర్తికాదు. సేకరించిన వస్తు సామగ్రిని వైజ్ఞానిక దృష్టితో విశ్లేషించాలి. సిద్ధాంతాలను స్థిరపర్చుకోవాలి. వాస్తవాలను బహిర్గతం చెయ్యాలి. పరిశోధనలో "వెలువడే ఫలితాలు" వుంటాయి తప్ప పరిశోధకుడు తాను "ఆశించిన ఫలితాలు" వుంటాయని అనుకోకూడదు. తాను సేకరించిన వస్తు సామగ్రిని వైజ్ఞానిక పద్ధతులతో విశ్లేషించినపుడు వెలువడిన ఫలితాలను యథాతథంగా చెప్పాలి గాని తన స్వంత అభిప్రాయాలను జోడించి చెప్పకూడదు. పరిశోధనలో కల్పనలకు, ఊహలకు తావు లేదు. అలాగే పరిశోధకుడి ఇష్టాయిష్టాలకు ప్రమేయం లేదు. పక్షపాత రహిత దృష్టితో పరిశోధనలు సాగించాలి. ప్రతి చిన్న అంశాన్ని హేతుబద్ధంగా, తార్కికంగా ఆలోచించి నిజానిజాలను సాక్ష్యాధారాలతో నిరూపించాలి. అప్పుడే పరిశోధన విజయవంతమౌతుంది.

John W. Best అనే American శాస్త్రవేత్త పరిశోధనకు నిర్వచనం చెపుతూ ఇలా అన్నాడు :

"Research may be defined as the systematic and objective analysis and recording of controlled observations that may lead to the development of generalizations, principles or theories, resulting in predection and possible ultimate control of events".[3]

ఈ విధమైన నిర్వచనాలు ఎన్నో ఉన్నాయి. ఈ నిర్వచనాల్లోని సారాంశం ఆధారంగా పరిశోధన లక్షణాలను పరిశీలిస్తే పరిశోధన గురించి ఒక మౌలిక అవగాహన మనకు ఏర్పడే అవకాశం ఉంది.

## 1.3. పరిశోధనలో వైజ్ఞానిక పద్ధతి (Scientific Method)

ఈ ఇరవయ్యో శతాబ్దంలో మానవుడు సాధిస్తున్న అద్భుత విజయాల వెనక చోదకశక్తి అతని వైజ్ఞానిక దృక్పథమే అని ఇంతకుముందే అనుకున్నాం. సత్య

నిరూపణకు మానవుడు ఎన్నో పద్ధతులను అవలంబిస్తూ వచ్చాడు. కాలక్రమంలో పరీక్షలకూ ప్రయోగాలకూ రుజువై నిలిచే వైజ్ఞానిక పద్ధతి అతనికి సరైనదిగా తోచింది. దానిని అవలంబించి అన్ని రంగాల్లోనూ అతను ఎంతో ప్రగతి సాధించాడు. వాస్తవాన్ని గ్రహించడానికి విజ్ఞాన శాఖల్లో ఏ పద్ధతి అనుసరిస్తారో పరిశోధనలో కూడా ఇప్పుడు అలాంటి పద్ధతే అవలంబించడం వల్ల పరిశోధన అనేది వైజ్ఞానిక పద్ధతిగా పరిగణింపబడుతోంది. ఈ పద్ధతిలో పరిశోధకుడు వైజ్ఞానిక దృక్పథాన్ని కల్గి ఉంటాడు. అతని దృష్టి తర్కం మీద, వస్తుగతంమీద ఆధారపడి వుంటుంది. ఇందులో పరిశోధన చేసే వ్యక్తుల స్వంత అభిప్రాయాలకు, ఇష్టాయిష్టాలకు ఎటువంటి ప్రమేయం ఉండదు.

**The Scientific Method a rigorous impersonal mode of procedure dictated by the demands of logic and objective procedure** అని అంటారు కార్లోస్.[4]

వైజ్ఞానిక పద్ధతిలో ఈ క్రింది లక్షణాలు ప్రధానంగా కన్పిస్తాయి:

1. వైజ్ఞానిక పద్ధతి ప్రయోగాత్మక ప్రమాణాలపై ఆధారపడి ఉంటుంది.
2. సంబంధిత భావనలను (concepts) ఇది గ్రహిస్తుంది.
3. కంటికి కనిపించే ప్రత్యక్ష అంశాలను మాత్రమే విశ్వసిస్తుంది.
4. వస్తు సామగ్రిని విశ్లేషించినపుడు ఏ సిద్ధాంతాలు ఉత్పన్నమౌతాయో వాటిని మాత్రమే స్వీకరిస్తుంది. ఊహా ప్రతిపాదనలను యధాతధంగా అంగీకరించదు.
5. పరిశోధనలో అవలంబించనున్న / అవలంబించిన పద్ధతిని ప్రారంభంలోనే వెల్లడి చేస్తుంది. విమర్శలకు, పరీక్షలకు పరిశోధన ఫలితాలు నిలబడగలిగేటట్లు ఉంటాయి.
6. శాస్త్రీయ సిద్ధాంతాలను రూపొందించడమే పరిశోధన ప్రధాన ఉద్దేశం.

## 1.4. పరిశోధన లక్షణాలు[5]

1.4.1. పరిశోధన ప్రధాన ఉద్దేశం సమస్యలను పరిష్కరించడం, కార్యకారణ సంబంధాలను ఆవిష్కరించడం.

1.4.2. పరిశోధన అనేది మూల సిద్ధాంతాలను లేదా సూత్రాలను రూపొందించ

గలగాలి. తర్వాతి పరిశోధకులకూ; సమస్యల పరిష్కారానికి ఇవి ఉపకరిస్తాయి.

1.4.3. పరిశోధన అనేది పరిశీలనానుభవం లేదా ప్రయోగాత్మక ప్రమాణాలపై ఆధారపడి వుంటుంది. సత్య నిరూపణలో మూఢనమ్మకాలకు, కల్పనలకు, ఊహాపోహలకు తావు లేదు. పరిశీలన వల్ల తెలియదగిన అంశాలను మాత్రమే స్వీకరించాలి.

1.4.4. కచ్చితమైన పరిశీలన, వివరణ పరిశోధనలో చాలా ముఖ్యం. అతిశయోక్తులు, అవాస్తవిక వర్ణనలు ఉండకూడదు.

1.4.5. వివిధ ఆకారాల ద్వారా వస్తు సామగ్రిని సేకరించడం పరిశోధనలో ముఖ్యమైన అంశం. సేకరించిన విషయ సామగ్రి ఆధారంగా నూతన విషయాలను ఆవిష్కరించాలి. విజ్ఞాన సర్వస్వాలు, జీవిత చరిత్రలు, వివిధ పత్రికలు మొదలైనవి చదివి విషయాలను సంగ్రహించి అందంగా రాసినప్పటికీ అది పరిశోధన అనిపించుకోదు.

1.4.6. పరిశోధన అనేది నియమబద్ధంగాను క్రమబద్ధంగాను ఉంటుంది. జాగ్రత్తగా రూపొందించుకొన్న ఒక ప్రణాళిక ననుసరించి పరిశోధన సాగుతుంది కాని "గుడ్డెద్దు చేలోపడ్డట్టు" ఉండదు.

1.4.7 పరిశోధనలో నైపుణ్యం, పూర్వశిక్షణ చాలా ముఖ్యం. పరిశోధకుడికి పరిశోధనాంశంపై పూర్తి అవగాహన ఉంటాలి. ఆ అంశానికి సంబంధించిన పూర్వ పరిశోధనలు సమాలోచించాలి. తత్సంబంధిత సాహిత్యమంతా జాగ్రత్తగా సేకరించాలి. సేకరించిన అంశాలను విశ్లేషించగల నేర్పు ఉండాలి.

1.4.8. పరిశోధన హేతుబద్ధమై తర్కబద్ధమై ఉండాలి. వస్తు సామగ్రిని, మూల సిద్ధాంతాలను పరీక్షకు పెట్టాలి. పరిశోధకుడు తన స్వంత యిష్టాయిష్టాలను ఎంత మాత్రము చూపించకూడదు. ఊహా ప్రతిపాదనలను ధ్రువపరచడంకన్నా దాన్ని పరీక్షలకు గురిచేయడం మంచిది.

1.4.9. అపరిష్కృత సమస్యలకు పరిష్కారాన్ని చూపిస్తుంది పరిశోధన. అజ్ఞానాన్ని పారద్రోలడం ఉత్తమ పరిశోధన లక్షణం.

1.4.10. పరిశోధన ప్రశాంతంగా ఉరుకులు, పరుగులు లేకుండా చేయాలి. సాధారణంగా పరిశోధన ఆకర్షణీయంగా ఉండదు. ఎడతెగని సందేహాలూ సమాధానాలూ ప్రశ్నలూ పరిశోధనా క్రమంలో ఎదురవుతూనే ఉంటాయి. అంటే పరిశోధన అనేది పూలబాట కాదు, ముళ్ళబాట. ఒక్కొసారి బాటే ఉండకపోవచ్చు. బాటను కూడా పరిశోధనాక్రమంలో ఏర్పరచుకోవాల్సిన అవసరం రావచ్చు.

1.4.11. పరిశోధనలో జాగ్రత్తగా సిద్ధాంతవ్యాసం రూపొందించాలి. ముఖ్యమైన సాంకేతిక పదాలను నిర్వచించాలి. పరిశోధన పరిమితులను తెలియజెయ్యాలి. పరిశోధన క్రమాన్ని వివరంగా చెప్పాలి. సాక్ష్యాధారాలను మరిచిపోకుండా పొందుపర్చాలి. ఫలితాలను యథాతథంగా ప్రకటించాలి. సిద్ధాంత వ్యాసంలోని గణాంక వివరాలు ఇతర పరిశోధకులకు వారి పరీక్షలకు అందుబాటులో ఉండేటట్లు చూడాలి.

1.4.12. పరిశోధన ఒక్కొసారి ధైర్య సాహసాలను కోరుతుంది. తీవ్ర ప్రతిబంధకాలు ఎదురైనప్పటికీ పరిశోధన సాగించి నూతనాంశాలను ఆవిష్కరించిన పరిశోధకులు విజ్ఞాన చరిత్రలో ఎందరో వున్నారు.

## 1.5. ఉత్తమ పరిశోధన లక్షణాలు

James Herald Fox ఉత్తమ పరిశోధనకు ఈ క్రింది లక్షణాలను నిర్దేశించాడు:[6]

1.5.1. పరిశోధన ఉద్దేశ్యం స్పష్టంగా నిర్వచించాలి.

1.5.2. పరిశోధన క్రమాన్ని సూక్ష్మాంశాలతో సహా వివరంగా తెలియజెయ్యాలి. ఇతర పరిశోధకులు పరిశోధనను కొనసాగించడానికి ఇవి తోడ్పడతాయి. పరిశోధకుడు తాను పరిశోధనలో ఎంతవరకు ముందుకు వెళ్ళగలిగాడో తెలియజెయ్యడంవల్ల తర్వాత పరిశోధకులు అతడు వదలిపెట్టినచోటు నుండి పరిశోధన ప్రారంభించవచ్చు.

1.5.3. పరిశోధన ప్రణాళికను మిక్కిలి జాగరూకతతో రూపొందించుకోవాలి.

1.5.4. పరిశోధన ప్రణాళికలో ఏర్పడిన లోపాలను పరిశోధకుడు మనస్ఫూర్తిగా అంగీకరించడమేకాక దానివల్ల ఏర్పడిన పరిణామాలను కూడ తెలియజేయాలి.

1.5.5. వస్తుసామగ్రి తగినంతగా సేకరించినప్పుడు మాత్రమే విషయ విశ్లేషణ చేసి సిద్ధాంతాలను రూపొందించటానికి సాధ్యమవుతుంది. విషయ విశ్లేష ణలో సముచిత పద్ధతిని అనుసరించాలి.

1.5.6. పరిశోధకుడు తాను సేకరించిన ఆకరాలను ఆధారంగా చేసుకొని పరిశీ లించినపుడు వచ్చిన నిర్ణయాలను మాత్రమే తెలియజేయాలి. తాను చేస్తున్న సిద్ధాంతాలు తాను సేకరించిన వస్తుసామగ్రి ఆధారంగా మాత్రమే చేస్తున్నానని చెప్పాలి. తన స్వంత అభిప్రాయాలను ఏ మాత్రమూ రుద్దకూడదు.

1.5.7. పరిశోధకుడు పరిశోధన విధానంలో సుశిక్షితుడై ఉండాలి. అప్పుడే పరిశోధనలో చక్కటి ఫలితాలను ఎదురు చూడవచ్చు.

# 1.6. పరిశోధన క్రమం (Research Process)

పరిశోధన విజయవంతం కావాలంటే ఒక నియమిత క్రమాన్ని పాటించాలి. అంటే పరిశోధనకు ఉపక్రమించినపుడూ, పరిశోధనలో నిమగ్నమైనపుడూ చేయ వలసిన పనులను ఒకదాని వెంట మరొకటి సార్థకంగా సమన్వయ పూర్వకంగా చేయడమని అర్థం. దానివల్ల స్పష్టత పెరుగుతుంది. పరిశోధన రుజుమార్గంలో నడవటానికి అవకాశాలు మెరుగవుతాయి. అనవసరమైన గందరగోళాన్ని అస్తవ్యస్త తను పరిహరించటం సులభమవుతుంది. క్రమ పద్ధతిని విస్మరించినప్పుడు పరిశోధన ఫలితాలు సక్రమంగా ఉండవు. పరిశోధకుడు తాను అనుకొన్న నిర్ణీతకాలంలో పరిశోధనను ముగించలేని పరిస్థితి కూడా ఏర్పడవచ్చు. ఏ రకమైన పరిశోధనకైనా ఈ క్రింది అంశాలు తప్పనిసరిగా ఉండాలి :

1. పరిశోధనాంశ నిర్వచనం
2. సమగ్ర సాహిత్య పరిశీలన
3. ఊహాప్రతిపాదన
4. పరిశోధన ప్రణాళిక
5. విషయ సేకరణ
6. వస్తు సామగ్రి విశ్లేషణ
7. ఊహాప్రతిపాదనను పరిరక్షించడం
8. వర్గీకరణ, సమన్వయీకరణ
9. సిద్ధాంతవ్యాస సమర్పణ, ఫలితాల ప్రకటన.

ఈ క్రింది రేఖాచిత్రం పరిశోధన వరుసక్రమాన్ని సూచిస్తోంది. పరిశోధనలో ఇటువంటి వరుసక్రమాన్ని పాటించడంవల్ల పరిశోధకుడు నియమితకాలంలో చక్కని ఫలితాలను పొందగలడు.

## పరిశోధన క్రమం[7] (Research Process)



## 1.7. పరిశోధనలో వివిధ రకాలు

పరిశోధనలో ఎన్నిరకాలున్నాయో చెప్పడం కష్టం. ఇప్పటి వరకు వచ్చిన పరిశోధనలను వర్గీకరించి దాని ఆధారంగా పరిశోధన రకాలను చెప్పడం మరింత కష్టం. ఎందుకంటే ప్రతి పరిశోధన తనకు తాను ఒక ప్రత్యేక విలక్షణత్వాన్ని కలిగి ఉంది. కాని పైన పేర్కొన్న పరిమితుల్ని దృష్టిలో ఉంచుకుంటూనే స్థూలంగా పరిశోధనలను రెండు విధాలుగా విభజింపవచ్చు.

1. ప్రయోగాత్మక పరిశోధన
2. విశ్లేషణాత్మక పరిశోధన

ప్రయోగశాలలో (Laboratory) ప్రయోగాలను (experiments) సాగించి ఫలితాలను ప్రకటించడమే ప్రయోగాత్మక పరిశోధన. విజ్ఞానశాస్త్ర (Sciences) శాఖల్లో జరిగే పరిశోధనలు ప్రయోగాత్మక పరిశోధనలు.

విశ్లేషణాత్మక పరిశోధన సామాజికశాస్త్ర, చారిత్రక, ఆర్థిక, భాషా సాహిత్యం మొదలైన విభాగాలకు సంబంధించిందిగా చెప్పవచ్చు. సేకరించిన అంశాలను జాగ్రత్తగా విశ్లేషించడం, సమన్వయపరచడం, సిద్ధాంతాలు రూపొందించడం ఈ తరగతి పరిశోధనల్లో గమనించవచ్చు.

## 1.8. పరిశోధన ఆవశ్యకత

"నిరంతరాన్వేషణే మానవ ప్రగతికి కారణమౌతుంది. ఒక విషయాన్ని గుడ్డిగా నమ్మడంకన్నా కొంత అనుమానం కలిగి వుండటం మంచిది. అనుమానం అన్వేషణకు దారితీస్తుంది. అన్వేషణ నూతన విషయాలను ఆవిష్కరిస్తుంది" అని హడ్సన్ మేక్సిన్ పరిశోధన ప్రాముఖ్యాన్ని వివరించాడు.

పరిశోధనలవల్ల ప్రయోజనం అనంతం. ఉదాహరణకు 17 వ శతాబ్దంలో వచ్చిన పారిశ్రామిక విప్లవం తర్వాత మూడు శతాబ్దాలలో ప్రపంచం ఎంతో మారిపోయింది. ఈ మూడు శతాబ్దాలను పరిశోధన యుగమనే చెప్పవచ్చు. అంతకు ముందు కొన్ని వందల సంవత్సరాలకన్న ఈ మూడు శతాబ్దాల్లోనే ప్రపంచం వైజ్ఞానికంగా ఎంతో అభివృద్ధిని సాధించింది.

ఉరుములు, మెరుపులకు, విద్యుత్తుకు సంబంధం ఉన్నదనే నూతన సిద్ధాంతాన్ని స్థాపించిన బెంజమిన్ ఫ్రాంక్లిన్‌ని "పరిశోధన వల్ల ప్రయోజనం ఏమిటి?" అని ఎవరో అడిగారట. దానికతడు అప్పుడే పుట్టినబిడ్డ వలన ఉపయోగం ఏమిటి? అని సమాధాన మిచ్చాడట. నూతన సిద్ధాంతమనేది నిజానికి అప్పుడే ఉదయించిన శిశువు. కాలక్రమేణ బలాన్ని పుంజుకొని విజ్ఞానాన్ని ప్రకాశింప జేస్తుంది.

## 1.9. ఉపసంహారం

ఈనాడు ప్రభుత్వ ప్రణాళికలన్నీ పరిశోధనలను ఆధారంగా చేసుకొని అమలుపర్చబడుతున్నాయి. పారిశ్రామిక, వాణిజ్య రంగాల్లో నూతన పథకాలు ప్రవేశపెట్టడానికి పరిశోధనలు అవసరమౌతున్నాయి. ప్రతి శాఖలోను Research and development అనే విభాగం ప్రారంభింపబడి ఉంది. పరిశోధనలు సామాజిక సమస్యల పరిష్కారానికి, దేశాభ్యుదయానికి, మానవ కళ్యాణానికి ఉపయోగపడుతున్నాయని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

REFERENCES :


1. C. E. K. Mees, Scientific Thought and Social Reconstruction, American Scientist 22 pp. 13-14 Quoted by John W. Best Research In Education pp. 3-4.
2. C. C. Crawford Quoted by Vasili Vasanthakumar' Telugu Parisodhana (Vol. 1) pp. 9-16.
3. John W. Best, p. 18.
4. Carlos L. Lastrucci, The Scientific Method : Basic principles of the Scientific Method, p. 17.
   As Quoted by C. R. Kothari p. 14.
5. John W. Best I bid pp. 18-20.
6. Quoted by C. R. Kothari p. 30.
7. Quoted by C. R. Kothari p. 16.

# 2. పరిశోధకుడు (RESEARCHER)

## 2.1. ప్రవేశిక

పరిశోధనలు విజయవంతం కావాలంటే ఉత్తమ పరిశోధకుల అవసరం ఎంతైనా ఉంది. వారి నిరంతర పరిశోధన కృషి ఫలితాలు మానవ విజ్ఞాన వికాసాలకు, సమాజాభ్యుదయానికి కారణాలవుతున్నాయి. అంటే సమాజ సర్వతో ముఖాభివృద్ధిలో పరిశోధకుడు గురుతర బాధ్యతను వహిస్తున్నాడన్న మాట.

## 2.2. అర్హతలు

పరిశోధనారంగంలో ఉన్నత ప్రమాణాలు స్థాపించాలంటే పరిశోధకునికి కొన్ని విశిష్ట లక్షణాలుండాలి. అంటే ఆషామాషిగా అనుకున్న ప్రతివాళ్ళూ పరిశోధన చేయటం వీలుకాదని అర్థం. వీలున్నా ఆ పరిశోధన ఉన్నతస్థాయిలో ఉండదు. ఉత్తమ ఫలితాలను ఇవ్వదు. ప్రతి వృత్తికి దానికి సంబంధించిన నైపుణ్యం అవసరమైనట్లే పరిశోధకునికి సునిశిత పరిశీలనాదృష్టి, దీక్షలాంటి ప్రత్యేకమైన లక్షణాలుండాలి. అవి ఏమిటో తెలుసుకుందాం :

### 2.2.1. జిజ్ఞాస

ఏవైనా కొత్త విషయాలు తటస్థించినపుడు వాటిని గురించి తెలుసుకోవాలనే కుతూహలం పరిశోధకునికి ఉండాలి. ప్రతి చిన్న విషయాన్ని ఏమిటి? ఎందుకు? ఎలా? అని ప్రశ్నించి తెలుసుకోవాలి. తాను విన్నవి, కన్నవి సత్య సమ్మతాలు కానప్పుడు వెంటనే వాస్తవం గ్రహించడానికి ప్రయత్నించాలి. ఇతరులు చెప్పినవి గుడ్డిగా నమ్మకుండా ప్రతి చిన్న విషయాన్ని నిశితంగా పరిశీలించి నిజానిజాలను స్వయంగా నిర్ధారించుకోవడం మంచిది. ఉత్తమ పరిశోధకుడికి ఈ గుణం తప్పనిసరిగా ఉండాలి.

### 2.2.2. సత్య దృష్టి

సత్యాన్ని బహిర్గత మొనర్చడం పరిశోధకుడి లక్ష్యం. తనకు లభించిన సాక్ష్యాధారాలు ఏమి చెబుతాయో అవే చెప్పాలిగాని ముందుగానే కల్పించుకున్న

సిద్ధాంతాన్ని నిరూపించడానికిగాని, స్థాపించడానికిగాని సాక్ష్యాధారాలను అన్వేషించడం ఎంతమాత్రమూ కూడదు. తాను సేకరించిన విషయ సామగ్రి సహాయంతో ఏమి చెప్పడానికి వీలవుతుందో దాన్ని మాత్రమే చెప్పాలి. సత్యాన్ని ప్రకటించడంలో ఎటువంటి సంశయం ఉండకూడదు. సత్య ప్రకటన వల్ల కొందరి అప్రీతికి, మనస్తాపానికి గురికావచ్చు. ప్రజల నుండి ఎన్నో దూషణలను ఎదుర్కోవలసి రావచ్చు. అయినప్పటికీ నిర్భీతితో సత్యాన్ని మాత్రమే వెల్లడి చేయాలి.

## 2.2.3. పరిశోధనాంశంపై ఆసక్తి

పరిశోధకుడికి మొదట తాను ఎన్నుకున్న పరిశోధనాంశంపై ఆసక్తి ఉండాలి. ఆసక్తి ఆ విషయానికి సంబంధించిన అన్ని అంశాలు దీక్షగా చదివేటట్లు చేస్తుంది. ఇతరుల ప్రోద్బలంతో తనకు ఆసక్తిలేని అంశాన్ని పరిశోధనకు తీసుకోకూడదు. పరిశోధకుడు తన అభిరుచికి అనుగుణమైన విషయాన్ని పరిశోధనాంశంగా గ్రహించడం మంచిది.

## 2.2.4. విషయ పరిజ్ఞానం

పరిశోధకుడు తాను ఎన్నుకున్న పరిశోధనాంశంలో నిష్ణాతుడై ఉండాలి. ఆ విషయానికి సంబంధించిన పూర్వాపరాలను బాగా ఆకళింపు చేసుకొని ఉండాలి. ఏ శాస్త్రరంగంలోనైనా కొత్తగా ప్రవేశించిన వ్యక్తి నూతనాంశాలను ఆవిష్కరించలేడు. పరిశోధకుడు తాను చేయబోయే పరిశోధనాంశానికి సంబంధించిన ప్రాథమిక వివరాలన్నీ క్షుణ్ణంగా తెలుసుకొని ఉండాలి. అలా చేయనప్పుడు పరిశోధనకు కేటాయించిన సమయం పరిశోధనాంశానికి సంబంధించిన ప్రాథమిక విషయాలను తెలుసుకోవడానికే వ్యర్థమయ్యే ప్రమాదముంది.

## 2.2.5. వైజ్ఞానిక దృక్పథం

పరిశోధకుడికి ముఖ్యంగా వైజ్ఞానిక దృష్టి ఉండాలి. ప్రతి చిన్న విషయాన్ని తార్కికంగా హేతుబద్ధంగా ఆలోచించాలి. ప్రయోగాత్మక ప్రమాణాలను, స్వీయ అనుభవాలను ప్రధానంగా గ్రహించి పరిశోధనలు కావించాలి. నూతనాంశాలను ఆవిష్కరించాలనే పరిశోధకుడు ఎప్పుడూ ఒక క్రమ పద్ధతిలో ఆలోచిస్తూ ఉండాలి. పరిశోధనాంశాన్ని ఎన్నుకున్న తర్వాత దాని పూర్వాపరాలు, పరిశోధన ప్రణాళిక, విషయ సేకరణ, ఊహాప్రతిపాదన, సిద్ధాంత వ్యాసరచనా ప్రణాళిక - మొదలైన అంశాలు క్రమ పద్ధతిలో అధ్యయనం చెయ్యాలి. సేకరించిన విషయ సామగ్రిని వైజ్ఞానిక దృక్పథంతో, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో విశ్లేషించాలి. పరిశోధకుడు ఆధునిక విజ్ఞాన పద్ధతులు, రీతులు తెలుసుకోవడమే కాకుండా దానిలో శిక్షణ కూడా పొంది ఉండాలి. ప్రయోగాత్మక పరిశోధనల్లో అయితే ఆధునిక పరికరాల ప్రయోగ విధానం, నూతన సాంకేతిక పరిజ్ఞానం తప్పనిసరి.

సాహిత్యంలో ప్రస్తుతం వస్తున్న ఆధునిక విమర్శన రీతుల్ని, సాహిత్య సిద్ధాంతాల్ని ఆకళింపు చేసుకొని తన సిద్ధాంత వ్యాసంలో వాటిని ఉపయోగించు కోవాలి. భాషా చారిత్రక విజ్ఞాన పరిశోధకుడు ముఖ్యంగా క్షేత్ర పర్యటనకు వెళ్ళే టప్పుడు ఎంతో జాగరూకత వహించాలి. తాను తీసుకెళ్ళాల్సిన వస్తువులు, ప్రశ్నించాల్సిన విషయాలు ఇవన్నీ మొదటే తయారు చేసుకోవాలి. ముఖ్యంగా ఆదిమ వాసులతో మెలగుతున్నప్పుడు వారి అలవాట్లు, ఆచార వ్యవహారాలు ఇవన్నీ మొదటే కొంత తెలుసుకొని ఉండడం మంచిది. తులనాత్మక పరిశీలనలో వివిధ భాషలతో చక్కటి పరిచయం ఉన్నప్పుడే అతను ఉత్తమ సిద్ధాంత వ్యాసాన్ని చేయగలుగుతాడు. ఈ విధంగా పరిశోధకుడు ఆయా శాస్త్రాలకు సంబంధించిన వివిధ పరిశోధన రీతుల్ని తెలుసుకొని శాస్త్రీయంగా విశ్లేషించాలి. అప్పుడే అది ఉత్తమ పరిశోధనగా రూపొందుతుంది.

## 2.2.6. వివిధ విజ్ఞానశాస్త్రాల పరిచయం

పరిశోధకుడు తాను ఏ అంశంలో పరిశోధన చేస్తున్నాడో ఆ అంశంలో మాత్రమే నిష్ణాతుడై ఉంటే చాలదు. ఆ పరిశోధన అంత సత్ఫలితాన్ని ఇవ్వకపోవచ్చు. పరిశోధనాంశానికి సంబంధించిన వివిధ శాస్త్రాల్లో కూడా కొంత పరిచయం ఉండడం చాలా అవసరం. ఇది పరిశోధకుడి దృష్టిని విశాలం చేయడమే కాక కొత్త విషయాలను తెలుసుకోగల అవకాశాన్ని కూడ ఇవ్వగలుగుతుంది. కాబట్టి పరిశోధనాంశంతో పాటు దానికి సంబంధించిన శాస్త్ర విషయాలను కూడా పరిశోధకుడు చదవాలి.

## 2.2.7. లాభాపేక్ష లేకుండడం

ఏదైనా లాభాన్ని ఆశించో, పదవిని ఆశించో పరిశోధనలో ప్రవేశించడం తప్పు. అలా ఆశించి చేసే పరిశోధన సత్ఫలితాన్నివ్వదు. పీసా విశ్వవిద్యాలయంలో గలీలియో వైద్యశాస్త్రం చదువుతుండేవాడు. మెల్లమెల్లగా అతడు గణితంవైపు ఆకర్షితుడై కొంత కాలానికి వైద్య విద్యను పూర్తిగా వదిలేశాడు. ఆ కాలంలో Professor of Medicine కు సంవత్సరానికి 9,000/- రూ॥ల సమానమైన జీతం ఉంటే Professor of Mathematics కు 300/- రూ॥ల జీతం మాత్రమే ఉండేది. అయినప్పటికీ ధనాపేక్ష లేకుండా గలీలియో గణిత విజ్ఞానంలోనే తన జీవితాన్ని వెచ్చించాడు. పరిశోధకాగ్రగణ్యుడయ్యాడు.

పరిశోధనకు అంకితమైనవాళ్ళు ఉన్నత పదవుల్ని ఆశించరు. మరి కొందరు కోరివచ్చిన పదవుల్ని త్యజిస్తారు కూడా. నోబెల్ బహుమతి గ్రహీత సర్ సి. వి. రామన్ చాలాకాలం తనకు వచ్చిన గొప్ప పదవుల్ని తన పరిశోధనలకు భంగకరమౌతాయని తిరస్కరించాడు.

## 2.2.8. భాషా సౌలభ్యం

సిద్ధాంత వ్యాసంలోని భాష పాఠకుల్ని విస్మయపరిచేటట్లు ఉండకూడదు. తేలికగా వెంటనే అర్థమయ్యేటట్లుగా ఉండాలి. పరిశోధకుడు తన సిద్ధాంతాన్ని సులభశైలిలో తేలికైన పదాలతో, దీర్ఘ సమాసాలు లేకుండా చక్కగా రాయాలి. స్పష్టత చాలా ముఖ్యం. అలా లేనప్పుడు విషయం ఎంత బాగున్నప్పటికి భాష మూలంగా అసలుకే ముప్పు వస్తుంది. సిద్ధాంత వ్యాసాన్ని చక్కగా చదివించేలాగ భాష సరళంగా ఉండడం చాలా అవసరం. ఆలంకారికశైలి, పదగుంఫనశైలి సిద్ధాంత వ్యాసాల్లో పనికిరాదు. విషయాన్ని విశదం చేసే సరళశైలిలో మాత్రమే పరిశోధకుడు రచన చేయాలి.

## 2.2.9. చిత్తశుద్ధి

పరిశోధకుడిలో ఈ గుణం తప్పనిసరిగా ఉండాలి. తన సిద్ధాంత వ్యాసానికి తానే విమర్శకుడిగా వ్యవహరించాలి. ఇతరుల విమర్శలను సహృదయంతో స్వీకరించాలి. చిత్తశుద్ధితో వాటిని పాటించాలి. తనకన్నీ తెలుసునని గర్వించడం తప్పు. తను ఎంత చదువుకున్నప్పటికి ఇతరుల అభిప్రాయాలను స్వీకరించడానికి సంకోచించకూడదు. పరిశోధన ప్రపంచంలో ఏ ఒక్కడు తనకు తానే ఒక సర్వజ్ఞుడు కాలేడు. 'నేటి విజ్ఞానాభివృద్ధి గత పరిశోధకుల కృషి ఫలితమే' అన్న సత్యాన్ని మర్చిపోకూడదు.

రూపొందిస్తున్న సిద్ధాంతాలు తన యిష్టాయిష్టాలపై కాకుండా వస్తుగతమైనవిగా ఉండేటట్లు పరిశోధకుడు జాగ్రత్త వహించాలి. నిష్పక్షపాత దృష్టితో పరిశోధన కొనసాగించాలి. నిజమైన పరిశోధకుడు తన కెదురైన సమస్యల నుండి ఏదో ఒకలాగా తప్పించుకోవడానికి ప్రయత్నించడు. చిత్తశుద్ధితో సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నిస్తాడు.

## 2.2.10. వ్యక్తిగత సామర్థ్యం

ఒక పుస్తకాన్ని సాధారణంగా చదవడం వేరు. పరిశోధన దృష్టితో చదవడం వేరు. పరిశోధకుడు తనకు ఏది అవసరమో దాన్ని మాత్రమే స్వీకరించాలి. అనవసర విషయాలతో కాలయాపన చేయకూడదు. తక్కువ సమయంలో ఎక్కువ విషయాలను సేకరించగల నేర్పును కలిగి ఉండాలి. పరిశోధకుల దృష్టి నిరంతరం తన పరిశోధనాంశంపైనే ఉండాలి. పరిశోధకుడు పాండిత్య ప్రకర్ష కలిగి ఉండడమే కాకుండా, ఆత్మస్థైర్యం, సహనం లాంటి గుణాలనూ కలిగి ఉండాలి. తొందరపాటు పనికిరాదు. పరిశోధనలో ఎన్నో ఆటంకాలు, ఇబ్బందులు ఎదురౌతాయి. తనక్కావాల్సిన పుస్తకాలు, పరికరాలు దొరకడంలో ఆలస్యం ఏర్పడవచ్చు. ఎన్ని అవాంతరా లేర్పడినప్పటికి పట్టు

వదలక పరిశోధన యజ్ఞాన్ని పూర్తిచేయగలిగే దృఢ స్వభావం, దీక్ష పరిశోధకుడికి ఉండడం చాలా అవసరం.

## 2.3. పరిశోధకుడు ఎదుర్కొంటున్న సమస్యలు

భారతదేశంలో పరిశోధకులు ముఖ్యంగా ప్రయోగాత్మక పరిశోధన రంగంలో ఉన్నవారు ఎన్నో సమస్యలను ఎదుర్కొంటున్నారు. వాటిలో ముఖ్యమైనవి కొన్ని-

### 2.3.1. శాస్త్రీయ శిక్షణ

పరిశోధక విద్యార్థులకు పరిశోధన విధానంలో శాస్త్రీయ శిక్షణ లేకపోవడం కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. చిన్నప్పటి నుండి విద్యార్థుల్లో వైజ్ఞానిక దృక్పథం పెంపొందించే కృషి జరగాలి. పరిశోధన విధానం ఒక పాఠ్యాంశంగా ప్రతి విద్యార్థి అధ్యయనం చెయ్యాలి. ఇప్పుడిప్పుడే M.Phil. కోర్సులు పరిశోధన విధానం ఒక పాఠ్యాంశంగా బోధిస్తున్నాయి. వాళ్ళకి నిపుణులచేత ఉపన్యాసాలిప్పించాలి. ఆధునిక వైజ్ఞానిక పద్ధతులు తెలియజెయ్యాలి. పరిశోధన విధానంలో శాస్త్రీయ శిక్షణ లేనప్పుడు వాళ్ళు రూపొందించే సిద్ధాంతాలు వాస్తవానికి దూరంగా ఉండే ప్రమాదముంది. మన విశ్వవిద్యాలయాల్లో స్నాతకోత్తర స్థాయిలో పరిశోధన విధానం ఒక పాఠ్యాంశంగా ప్రవేశపెట్టినప్పుడు ఉత్తమ పరిశోధనలు వెలుగులోకి వస్తాయి.

### 2.3.2. సమాచార వినిమయం

విశ్వవిద్యాలయాల మధ్య పరస్పర సమాచార వినిమయం లేకపోవడంవల్ల పరిశోధకుడు ఎన్నో ఇబ్బందులకు గురవుతున్నాడు. ఒక పరిశోధనాంశాన్ని ఎన్నుకొని పరిశోధన చేస్తున్నప్పుడు అదే అంశంపై మరో విశ్వవిద్యాలయంలో పరిశోధన జరుగుతుండడం, ఒక్కొసారి అప్పటికే సిద్ధాంత వ్యాసాలు వెలువడి ఉండడం మొదలైన సంఘటనలు తరుచుగా జరుగుతున్నాయి. విశ్వవిద్యాలయాల మధ్య పరస్పర సహకారం, అవగాహన ఉన్నప్పుడు ఒకే అంశంమీద ఇద్దరు ముగ్గురు పరిశోధనలు చేయడంలాంటి పొరబాట్లు జరగవు. పరిశోధన ఫలితాలు అందరికీ తెలియజేయడంవల్ల విజ్ఞాన ప్రగతి త్వరితగతిని సాగుతుంది.

### 2.3.3. గ్రంథాలయాల సహకారం

పరిశోధకుడు తనకు కావలసిన విషయ సామగ్రి సేకరించడానికి గ్రంథాలయాల మీద ఆధారపడాలి. అయితే పరిశోధకునికి గ్రంథాలయాన్ని వినియోగించుకోవడం తెలియాలి. పుస్తకాలు, పత్రికలు, నివేదికలు అన్నీ ఒకేచోట లభ్యం

కాకపోవడంవల్ల పరిశోధకుడు తనకు కావలసిన పుస్తకం కోసం ఎంతో కాలాన్ని వ్యర్థం చేసుకోవలసి వస్తుంది. ఈ సందర్భంలో గ్రంథాలయాల సహకారం కూడా ఎంతో అవసరమవుతుంది.

### 2.3.4. వివిధ లిఖిత, ముద్రిత సమాచారం

ప్రభుత్వ, ఆర్థిక, వాణిజ్య రంగాలకు సంబంధించిన గణాంక వివరాలు, అముద్రిత జనాభా లెక్కలు, శాసనాల వివరాలు, ప్రభుత్వ నివేదికలు, ప్రకటనలు మొదలైనవన్నీ పరిశోధకులకు అందుబాటులో ఉండాలి.

### 2.3.5. ఆర్థిక సహాయం

పరిశోధక విద్యార్థులకు ఆర్థిక సహాయం తప్పనిసరిగా ఉండాలి. అప్పుడే వారు నిశ్చింతగా పరిశోధనలో నిమగ్నం కాగలుగుతారు. వివిధ గ్రంథాలయా లను దర్శించగలుగుతారు. క్షేత్ర పర్యటన కావించి వస్తుసామగ్రిని సేకరించ డంలో కూడా విశ్వవిద్యాలయాలు పరిశోధకులకు తగిన ఆర్థిక సహాయం చేయాలి.

## 2.4. ఉపసంహారం

ఒక దేశం అభివృద్ధి ఆ దేశపు శాస్త్రజ్ఞుల మీద ఆధారపడి ఉంటుంది. యువ పరిశోధకులు తమ బాధ్యతను గుర్తించి చిత్తశుద్ధితో పరిశోధనలు కొనసాగించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

# 3. పరిశోధన సమస్య
(RESEARCH PROBLEM)

## 3.1. ప్రవేశిక

పరిశోధన క్రమంలో తొలి ఘట్టం పరిశోధన సమస్యను (లేదా పరిశోధనాంశాన్ని) ఎన్నుకోవడం. పరిశోధకుడు తన అభిరుచులకు అనుగుణంగా, తన శక్తిసామర్థ్యాలు బేరీజు వేసుకొని స్వయంగా పరిశోధనాంశాన్ని నిర్ణయించుకోవాలి. మిత్రులు చెప్పారనో, పర్యవేక్షకులు సూచించారనో ఒక అంశాన్ని ఇష్టం లేక పోయినా స్వీకరించకూడదు. పరిశోధనాంశాన్ని ఎన్నుకోవడంలో జాగ్రత్త వహించకపోతే పరిశోధకుడు ముందు ముందు ఎన్నో ఇబ్బందులను ఎదుర్కోవలసి ఉంటుంది. తమకు ఏ అంశంలో అభిరుచి ఉందో నిర్ధారించుకోలేని కొందరు "నేను దేనిమీద పరిశోధన చేయాలి? నాకొక పరిశోధనాంశం చెప్పండి" అంటూ పర్యవేక్షకులను అడుగుతుంటారు. ఒక విషయంలో పరిశోధన చేయదల్చుకొన్నవారు ఆ విషయానికి సంబంధించిన అన్ని వివరాలు బాగా ఆకళింపు చేసుకొన్న తర్వాత సమస్యను తామే స్వయంగా ఎన్నుకోవడం ఉచితంగా ఉంటుంది.

## 3.2. అర్థ వివరణ

సమస్య అని అర్థమిచ్చే ఆంగ్లపదం 'Problem' గ్రీకు భాషా పదమైన 'Proballein' నుండి వచ్చింది. మన ముందున్న సమస్య నివృత్తి కావాల్సిన సందేహం, అస్పష్టంగా ఉన్న విషయం, సమాధాన మాశించే ఒక చిక్కుముడి, పరిశోధనకు తీసుకొన్న ఒక అంశం అనే అర్థాలు ఈ పదాని కున్నాయి.

కాబట్టి పరిశోధన సమస్య అంటే పరిశోధనకు తీసుకొన్న అంశం, పరిష్కారం కావలసిన పరిశోధన సమస్య అని ఈ సందర్భంలో చెప్పవచ్చు.

**Wood Worth** అనే శాస్త్రజ్ఞుడు మనస్తత్వ శాస్త్రరీత్యా ఈ పదాన్ని (Problem) నిర్వచించడానికి ప్రయత్నించాడు. "సమస్య అంటే దేనికి మనం పూర్వగతమైన ఆలోచనల ద్వారా అప్పటికప్పుడు సంతృప్తికరమైన సమాధానం పొందలేమో, మనకు బాగా అలవాటైన విధానాల ద్వారా తేలికగా దేనికి పరిష్కారం లభించదో అదే."[1]

Dewey అనే శాస్త్రజ్ఞుడు Problem అంటే ఏమిటో ఈ విధంగా నిర్వచించాడు: "అయోమయాన్ని విజ్ఞానవంతం చేయగలిగేది, సంకోచాలను నెట్టివేసేసి, అడ్డంకులను ఎదిరించగలిగేది, వస్తువుల లేదా విషయాల మధ్య ప్రస్తుతమున్న స్థితికి అవి మారుతున్నప్పుడు ఉండాల్సిన స్థితికిగల అంతరాన్ని సమన్వయం చేసేది - సమస్య."[2]

## 3.3. పరిశోధనాంశ ఆకరాలు

పరిశోధనల మూలంగా పరిష్కారం కావల్సిన సమస్యలను గుర్తించాలంటే పరిశోధనాంశ నిర్ణయంలో ఈ క్రింది పేర్కొన్న వివిధ ఆకరాలు పరిశోధకుడికి మిక్కిలి ఉపకరిస్తాయి.

### 3.3.1. పాఠాలు - ఉపన్యాసాలు

తరగతిలో అధ్యాపకుల ఉపన్యాసాలు వినడంవల్ల, శాస్త్ర చర్చల్లో పాల్గొనడంవల్ల అంతవరకు పరిష్కారం కాకుండా ఉన్న కొన్ని సమస్యలను గుర్తించవచ్చు. ఆధునిక సాహిత్యంమీద ఉపన్యాసం ఇస్తున్నప్పుడు ఒకడు ఆవిర్భావ వికాసాలు, విప్లవ ధోరణులు, ఛందోరీతి మొదలైన వాటికి సంబంధించిన కొన్ని సందేహాలను లేవనెత్తుతాడు. అవి మరొకడికి వివరంగా పరిశోధించి తెలుసుకోవాల్సిన అంశంగా తోచవచ్చు. కొన్ని చర్చా గోష్ఠులు పరిశోధన చేయాల్సిన సమస్యలను, అసంపూర్ణ పరిశోధనలను ఎత్తిచూపి పరిశోధన సమస్యను ఎన్నుకొనడానికి ఒక నేపథ్యాన్ని ఏర్పరుస్తున్నాయి.

### 3.3.2. సిద్ధాంత వ్యాసాలు

ఒక శాస్త్రానికి సంబంధించి వివిధ విశ్వవిద్యాలయాలలో లెక్కలేనన్ని సిద్ధాంత గ్రంథాలు వెలువడుతున్నాయి. పరిశోధకుడు పరిశోధనాంశ అన్వేషణలో పై సిద్ధాంత గ్రంథం సంగ్రహ విశేషాలను తప్పకుండా చదవాలి. అంతకు పూర్వం మరొకరు చేసిన పరిశోధన విషయాన్ని తిరిగి తీసుకోకుండా ఉండడానికి, పూర్వపరిశోధకులు అనుసరించిన పద్ధతిని యధాతధంగా తాననుసరించకుండా ఉండటానికి ఇది ఉపయోగపడుతుంది. ఒకరు ఎటువంటి సమస్యను ఎన్నుకొన్నారు? ఆ సమస్యను ఏ విధంగా పరిష్కరించారు? మొదలైన వివరాలు తెలుసుకోవచ్చు.

### 3.3.3. పుస్తకాలు

ఒక సమస్యకు సంబంధించి విశేషాలు, వాదోపవాదాలు పుస్తకాలలో చోటు చేసుకొని ఉంటాయి. గ్రంథ అధ్యయనంవల్ల పరిశోధకుడు తాను చేయదగిన పరిశోధనాంశాన్ని గుర్తించగలుగుతాడు. కాబట్టి పరిశోధన ఆకరాలుగా పుస్తకాలను ప్రధానంగా పరిగణించాలి.

### 3.3.4. పత్రికలు

ప్రజల అభిరుచి, ఆలోచన విధానం, నేటి రచనాపద్ధతి మొదలైనవన్నీ పత్రికల మూలంగా తెలియ పరుస్తున్నాయి. కొత్త కొత్త సమస్యలను, నూతనాంశాలను ఇవి పాఠకుల దృష్టికి తీసుకు వస్తున్నాయి. పరిశోధకుడు తేనెటీగలా తిరిగి తను పరిశోధించవలసిన విషయాన్ని గ్రహించాలి.

### 3.3.5. ప్రత్యేక సంచికలు

వివిధ సాహితీ సంస్థలు, పరిశోధక సంఘాలు వెలువరించే పరిశోధక పత్రికలు, ప్రత్యేక సంచికలు, వార్షిక సంచికలు, సంస్మరణ సంచికలు, రజతోత్సవ స్వర్ణోత్సవ సంచికలు, పండుగ ప్రత్యేక సంచికలు మొదలైన వాటిని కూడ పరిశోధకుడు బాగా పరిశీలించాలి. తెలుగులో ఎన్నో సాహిత్య పత్రికలు వెలువడ్డాయి. వెలువడుతున్నాయి. భారతి, కృష్ణాపత్రిక, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, అభ్యుదయ, తెలుగు పరిశోధన మొదలైన పత్రికల్లో ఎన్నో ప్రామాణిక పరిశోధక వ్యాసాలు వెలువడ్డాయి. వీటిలో ప్రసిద్ధ పండితులు, శాస్త్రజ్ఞులు, కవుల పరిశోధన వ్యాసాలు ఉన్నాయి. పరిశోధకుడు వీటిని చదవడం మూలంగా తనకు అభిమాన విషయం ఏదో తెలుసుకోగలుగుతాడు.

### 3.3.6. సభలూ, సమావేశాలూ

అభిమాని అంశాన్ని ఎన్నుకోవడంలో పరిశోధకుడికి సభలు, సమావేశాలూ ఉపకరిస్తాయి. All India Oriental Conference. Indian Science Congress D.L.A., All India Linguists Association, Place Names Society of India, Epigraphical Society మొదలైన సంఘాలు వార్షిక సమావేశాలు, సభలు జరుపుతాయి. ఈ సభల్లో వివిధ విశ్వవిద్యాలయాలనుండి ప్రసిద్ధ ఆచార్యులేకాక ఇతర సంస్థల్లో పనిచేసే శాస్త్రజ్ఞులు కూడ పాల్గొంటూ ఉంటారు. ఈ సమావేశాల్లో పరిష్కారమైన సమస్యలు, పరిష్కారం కావాల్సిన సమస్యలు, కొత్త సమస్యలు మొదలైనవి చర్చల్లోకి వస్తాయి. ఇవన్నీ పరిశోధకుడికి ఉపకరిస్తాయి.

### 3.3.7. అన్వేషణ

పరిశోధన సమస్యను గుర్తించడంలో ఇబ్బంది ఏర్పడినప్పుడు , ఆఖరి మెట్టుగా పరిశోధకుడు తన కభిరుచిగల విషయాన్ని ఒకటికి రెండు పర్యాయాలు బాగా అధ్యయనం చేయాలి. ఒక విషయాన్ని లోతుగా పరిశీలించినపుడు తప్పకుండా సమస్యను గుర్తించ వీలవుతుంది. ఏ విషయంలో అధిక శ్రద్ధ చూపాలి? ఏ సమస్యను పరిశోధించాలి ? గ్రహించాల్సిన, గ్రహించదగిన సమస్య ఏది ? ఇవన్నీ చదవగా చదవగా తెలిసివస్తుంది.

పరిశోధనాంశం మొదట్లో ఏదో ఒక సాధారణ విషయంలా కనిపిస్తుంది. కాని దానికి సంబంధించిన పుస్తకాలు, పరిశోధక వ్యాసాలు మొదలైనవి చదివిన పిదప, తీవ్రంగా ఆలోచించి పరిశీలించి దానిపై చర్చలు, వాదోపవాదాలు చేస్తున్న కొద్దీ విషయ విస్తృతి క్రమక్రమంగా సంకోచించి పెద్ద చట్రం నుండి చిన్న చట్రానికి మారుతూ వచ్చి ఆఖరున విషయం బిందువు లాగ పరిశోధకుడి మనోఫలకంలో స్పష్టంగా నిలిచిపోతుంది.

ఆధునిక ఆంధ్ర సాహిత్యం, కవిత్రయ భారతం మొదలైన పరిశోధనాంశాలు విషయ విస్తృతి కలిగి ఉన్నాయి. వీటిని పరిశోధించి నిర్ణయాలు చెప్పడం కష్టమైన పని. కొన్ని కొన్ని సమస్యలకు సాక్ష్యాధారాలు దొరకడం అరుదు. పరిశోధకుడు తన పరిశోధన యాత్రను ఎన్నుకొన్న మార్గం ఇంతకు పూర్వం చాలామంది నడిచి నలిగిన బాట అయి ఉండకూడదు. అలాగని ఎవరూ ప్రయాణించని కొత్త మార్గమూ కాకూడదు. పరిశోధన ప్రపంచంలో అడుగు పెడుతున్న వారికి ఈ రెండు మార్గాలు కష్టసాధ్యాలే. అలాగని నలుగురు నడచిన బాటలో విలక్షణతను ప్రదర్శించటమూ, బాటే లేనిచోట ఒక మార్గాన్ని నిర్మించటమూ అసంభవమనీ కాదు.

## 3.4. పరిశోధనాంశం ఎలా ఉండాలి?

సామాన్యంగా పరిశోధకుల దృష్టి డిగ్రీ తీసుకోవడమే ప్రధానంగా ఉండి తమకు తోచిన ఏదో ఒక పరిశోధన సమస్యను తీసుకొంటున్నారు. అలా కాకుండా సమస్య ఏమిటి? దాన్ని పరిష్కరించడంలో ఉన్న ఉద్దేశమేమిటి? అని పరిశోధకుడు బాగా ఆలోచించి పరిశోధన సమస్యను ఎన్నుకోవాలి.

ఈ క్రింది అంశాలలో ఏదో ఒకటి పరిశోధనకు ప్రేరణ కావచ్చు.

3.4.1. తన వ్యక్తిగతమైన అభిరుచి (personal interest) లేక ఆసక్తి (curiosity) కి తగిన అంశాన్ని పరిశోధకుడు ఎన్నుకోవచ్చు.

3.4.2. గత పరిశోధనల్లో ఏవైనా లోపాలు గమనించినపుడు, వాటి వివరణలో చర్చల్లో అస్పష్టత ఉన్నపుడు సరైన రుజువులతో ఆధునిక శాస్త్రీయ పద్ధతులతో సత్యప్రకటన చేయవచ్చు.

3.4.3. సామాజిక అవసరాలను (Social Needs) నెరవేర్చే అంశాలను పరిశోధనకు ఎన్నుకోవచ్చు. (వయోజన విద్య, స్త్రీల సమస్యలు, బడుగువర్గాల సమస్యలు మొదలైనవి).

3.4.4. గ్రహించిన అంశం ఏదో ఒక ప్రయోజన లక్ష్యాన్ని (utillitarian purpose) నెరవేర్చేదిగా ఉండొచ్చు. (వృత్తిపరమైన సాధక బాధకాలు).

## 3.5. పరిశోధన సమస్య ఎంపికలో కొన్ని సూచనలు

పరిశోధనాంశాన్ని ఎన్నుకోవటంలో కింద పేర్కొన్న కొన్ని సూచనలు సహకరిస్తాయి.

### 3.5.1. విషయసామగ్రి

పరిశోధనాంశానికి సంబంధించిన విషయసామగ్రి లభ్యమవుతున్నదీ లేనిదీ పరిశోధకుడు మొదట్లోనే తెలుసుకోవాలి. ఒక అంశాన్ని ఎన్నుకొన్న తర్వాత దానికి సంబంధించిన విషయసామగ్రి లభించకపోతే పరిశోధన అభాసుపాలవుతుంది. ఉదా॥కు ఒక ప్రాంతానికి సంబంధించిన స్త్రీల పాటలు గాని, గ్రామిక గేయాలు గాని, లాలి పాటలు గాని పరిశోధనాంశంగా గ్రహించినపుడు పరిశోధకుడు కొంత ప్రాథమిక పరిశీలన చేసి విషయసామగ్రి సేకరించాలి.

### 3.5.2. క్షేత్ర పర్యటన

కొన్ని పరిశోధనల్లో క్షేత్ర పర్యటన ఆధారంగా విషయసామగ్రి సేకరించాల్సి ఉంటుంది. జానపద విజ్ఞానం, భాషా విజ్ఞానం మొదలైన రంగాలకు సంబంధించిన పరిశోధనల్లో క్షేత్ర పర్యటన తప్పనిసరి అవుతుంది. పరిశోధకుడు ధైర్యసాహసాలతో కష్టనష్టాలను సహించి నేర్పుతో సమాచారాన్ని సేకరించాలి. శారీరక దారుఢ్యం, మానసిక స్థైర్యం రెండూ ఉన్నప్పుడే పరిశోధకుడు వివిధ ప్రాంతాలు పర్యటించి తనకు కావల్సిన సమాచారాన్ని సేకరించ గలుగుతాడు.

సమాచార సేకరణలో వివిధ ప్రాంతాలను సందర్శించడానికి తగిన ఆర్థిక వసతి తనకున్నదీ లేనిదీ పరిశోధకుడు మొదట్లోనే బేరీజు వేసుకోవాలి. ఆర్థిక సదుపాయం లేనపుడు పరిశోధకుడు విషయసామగ్రి సేకరణ సంపూర్ణంగా చేయలేకపోతాడు. అందువల్ల అతని పరిశోధన సత్ఫలితాన్నివ్వదు.

### 3.5.3. కాలపరిమితి

విశ్వవిద్యాలయంలో సిద్ధాంత వ్యాసం సమర్పించడానికి నిర్దేశించిన కాల పరిమితి ఉంటుంది. డాక్టరేట్ పట్టం మొదలైన వాటికి మూడు సంవత్సరాల నుండి అయిదు సం॥ల వరకు కాలపరిమితి ఉంది. ఎమ్. ఫిల్. పూర్తిచేసిన వారు రెండు సంవత్సరాల కాలపరిమితిలోనే పరిశోధన పూర్తి చేసుకోవచ్చు. తనకున్న వ్యవధిని దృష్టిలో ఉంచుకొని నిర్ణీత కాలంలో పరిశోధన పూర్తి చేయడానికి అనుకూలమైన పరిశోధనాంశాన్ని గ్రహించడం మంచిది. ఎన్నుకొన్న అంశాన్ని నిర్ణీత కాలంలో పూర్తి చేయగలననే నమ్మకం పరిశోధకునికి తప్పనిసరిగా ఉండాలి.

### 3.5.4. విషయ పరిమితి

పరిశోధనకు తీసుకున్న అంశం ఒక పరిమిత పరిధికి లోబడి ఉండాలి. పరిధి విస్తృతమైనపుడు పరిశోధన ఫలితాలు (Conclusions) సూటిగా ఉండవు.

సమాచార సేకరణ, విషయ విశ్లేషణ, వ్యాసరచన అన్నీ క్లిష్టంగా తయారవుతాయి. కాబట్టి పరిశోధకుడు సంయమనంతో పరిశోధన విషయాన్ని తన శక్తిమేరకు పరిమితం చేసుకోవాలి.

ఒకరికి పురాణ సాహిత్యమంటే అభిరుచి ఉన్నదనుకోండి. అది విస్తృత పరిశోధన విషయమవుతుంది. తెలుగులో చాలా పురాణగ్రంథాలు వచ్చాయి కదా! అన్నిటినీ పరిశీలించి విశ్లేషించడం అసాధ్యం. అందులో ఏదో ఒక పురాణం గ్రహించడం మంచిది. సిద్ధాంత వ్యాస రచనకు ఇది చక్కగా సరిపోతుంది. అలాగే ఒకవ్యక్తి జీవిత చరిత్రను, అతని సమగ్ర రచనలను కలిపి పరిశోధనాంశంగా తీసుకోకూడదు. ఒక మహాకవి సాహితీ ప్రపంచాన్ని సమ్యక్ వివేచన చేయటం సాధ్యంకాదు. ఒక్కొసారి అసంభవమవుతుంది కూడా. విశ్వనాథవారి సమగ్ర సాహితీ సృష్టిని ఒకే పరిశోధనాంశంగా తీసుకుంటే ఆ అంశానికెవరూ న్యాయం చేకూర్చలేరు. ఆ మహాకవి రచనల్లో ఏదో ఒక అంశాన్ని మాత్రం తీసుకొని పరిశోధిస్తే చాలు.

విషయం పరిమితంగా ఉన్నపుడు పరిశోధన సత్ఫలితాన్నివ్వడమేకాక నిర్ణీత కాలంలో ముగుస్తుంది. పరిశోధనలో ఏవైనా కొత్త విషయాలు చెప్పడానికి వీలవుతుంది. విషయం విస్తృతమైనపుడు పరిశోధకుడు చేసే సిద్ధాంతం సూటిగా నిర్దిష్టంగా ఉండదు.

### 3.5.5. పుటల పరిమితి

కొన్ని విశ్వవిద్యాలయాల్లో పరిశోధకుడు సమర్పించవలసిన సిద్ధాంత వ్యాసంలో పుటలకి నిర్దేశ పరిమితి ఉంది. మదరాసు, మదురై విశ్వవిద్యాలయాల్లో పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం 250 పుటలకు మించరాదని ఉంది. పుటల పరిమితి లేనప్పటికి పరిశోధకుడు తన సిద్ధాంత వ్యాసాన్ని సంగ్రహంగా రూపొందించడం మంచిది. పరిశోధనాంశం ఎన్నుకునేటప్పుడు పుటల పరిమితిని కూడ గుర్తుంచుకోవాలి.

### 3.5.6. పునరుక్తం

పరిశోధకుడు ఎన్నుకొన్న పరిశోధనాంశం పునరుక్తమైనదిగా ఉండకూడదు. ఆ అంశంపై అంతకుముందు ఎవరూ పరిశోధన చేయలేదనే విషయాన్ని ఖచ్చితంగా తెల్సుకోవాలి. పునరుక్తమైన అంశంలో పరిశోధకుడు కొత్తగా చేయదగిన సిద్ధాంతాలు ఉండకపోవచ్చు. పూర్వ పరిశోధనల్లో అసంబద్ధత ఉన్నట్లు గుర్తించినపుడు మాత్రమే ఆ అంశాన్ని పరిశోధనకు తీసుకోవచ్చు. పూర్వ పరిశోధకులు సాక్ష్యాధారాలు ఏమీ లేకుండా చేసిన నిర్ణయాలను పునఃపరిశీలించి వాస్తవాన్ని నిరూపించడం, నూతన సిద్ధాంతాలను ప్రతిపాదించడం పరిశోధకుడి బాధ్యత.

### 3.5.7. సామాజిక ప్రయోజనం

పరిశోధన ప్రధానోద్దేశ్యం సామాజిక ప్రగతి అయి ఉండాలి. మానవ కళ్యాణానికి, సమాజ సర్వతోముఖాభివృద్ధికి పరిశోధనలు తోడ్పడాలి. జాతీయ సమస్యను పరిష్కరించగలగాలి. ప్రజలలో సమరసభావాన్ని నెలకొల్పాలి. పరిశోధకుడు ఈ అంశాలను దృష్టిలో పెట్టుకొని పరిశోధన విషయాన్ని ఎన్నుకోవాలి. వివాదాలను రేకెత్తించే విషయాలను పరిహరించడం మంచిది. దురభిమానానికి ఎట్టి పరిస్థితుల్లోనూ చోటివ్వకూడదు.

### 3.5.8. పర్యవేక్షకుడు

పరిశోధకుడు తాను ఎన్నుకొన్న అంశాన్ని పర్యవేక్షకుడితో చర్చించాలి. అందులోని సాధక బాధకాలను తెల్సుకోవాలి. పర్యవేక్షకుడితో పరిశోధనాంశ విషయమై సంప్రదించిన తరువాత అతని అంగీకారంతో పరిశోధన ప్రారంభించాలి.

## 3.6. పరిశోధన సమస్య ప్రామాణ్య నిరూపణ

ఎన్నుకొన్న పరిశోధన సమస్య విలువలను నిర్ణయించడానికి పరిశోధకునికి కింద పేర్కొన్న ప్రశ్నలు ఉపకరిస్తాయి.[3]

3.6.1. ఈ పరిశోధనాంశంలో నాకు ఆసక్తి, అభిరుచి ఉందా? ఈ అభిరుచి నా విజ్ఞాన తృష్ణ నుంచి పుట్టిందేనా?

3.6.2. పరిశోధన ఫలితాలు సామాజిక అభివృద్ధికి తోడ్పడగలవా?

3.6.3. నేటి ప్రపంచంలోని లోటును నా పరిశోధన పూడ్చగలదా? ఇది అసంపూర్ణంగా ఉన్న సమస్యలకు పరిష్కారం ఇవ్వగలిగిన పరిశోధనాంశమేనా? అంతరాలు ఏమైనా ఉన్నాయా? సమన్వయ పరచడం అవసరమా?

3.6.4. ఈ సమస్యను పునఃపరిశీలన చేయాల్సిన అవసరం ఉందా? నిశితంగా విశ్లేషించాల్సిన అవసరం ఉందా?

3.6.5. ప్రస్తుత పరిశోధన రంగాలకు చెందిన మేధాశక్తి పరిధులకు మించి దీనిలో పరిశోధన చేయడానికి అవకాశముందా?

3.6.6. చేస్తున్న పరిశోధన, దాని ఫలితాలు ప్రస్తుత అవసరాలకు వెనువెంటనే ఉపకరిస్తాయా?

3.6.7. భాషా సాహిత్యాల మధ్య అంతరాలను ఇది పూడ్చివేయగలుగుతుందా? దీనివలన అటు భాషాభివృద్ధిగాని ఇటు సమాజాభివృద్ధిగాని జరుగుతుందా?

3.6.8. భావి పరిశోధకులకు ఇది మార్గదర్శిగా నిలుస్తుందా?

పై ప్రశ్నలన్నింటికీ 'అవును' అని సమాధానం లభించినపుడే తాను ఎన్నుకొన్న పరిశోధనాంశం సరైనది అని పరిశోధకుడు నిర్ధారించుకోవచ్చు.

## 3.7. సిద్ధాంత వ్యాస సంగ్రహ రూపం

పరిశోధన సమస్యను ఎన్నుకొన్న పిదప, దానిని అవగాహన చేసికొని దానిపై 'సిద్ధాంత వ్యాస సంగ్రహ రూపం' రాయడం పరిశోధకుడు చేయాల్సిన పనుల్లో ముఖ్యమైనది. పరిశోధనాంశం విలువ తెలుసుకోడానికి, అది ఒక పరిధికి లోబడి ఉన్నదా లేదా అని గమనించటానికీ, ఆ సమస్య పరిష్కారానికి ఏవైనా మార్గాలున్నాయో లేవో గుర్తించటానికి ఉపకరిస్తుంది. పరిశోధనాంశ పరిధి విస్తృతమైనప్పుడు పరిశోధనకు సరిపోయేంతగా దాని పరిమితిని కుదించి ఒక చట్రంలో అమర్చడానికి ఈ పద్ధతి ఉపయోగపడుతుంది.

సిద్ధాంత వ్యాస సంగ్రహం రాసి చూడడం, ముఖ్యంగా అధ్యాయాల విభజన, శీర్షికల ఉపశీర్షికల వర్గీకరణ మొదలైనవి చేయడంవల్ల కూడ చక్కటి పరిశోధ నాంశం రూపొందించడానికి అవకాశం ఉంది.

## 3.8. ఉపసంహారం

చక్కటి పరిశోధన సమస్యను ఎన్నుకోవడం అనేది పరిశోధకుని ప్రతిభా, సామర్థ్యాలనుబట్టే ఉంటుంది. సరైన పరిశోధనాంశాన్ని ఎన్నుకోవడం పరిశోధనలో అతి ముఖ్యమైన ఘట్టమన్నది గుర్తుంచుకోవాలి. ఇది పరిశోధనలో అతని తొలి విజయంగా కూడ భావించవచ్చు.

REFERENCES :

1. "A situation for which we have no ready and successful response by instinct or by previously acquired habit. We must find out what to do" - Woodworth in John C. Almack's "*Research and Thesis Writing*" Houghton Mifflin Company, Boston, 1930, p 31.

2. Ibid.

3. W. G. Cochran and G. M. Cox, "*Experimental Designs*" Wiley, Newyork. 1950, pp. 22-36.

# 4. పరిశోధన ప్రణాళిక
# (RESEARCH DESIGN)

## 4.1. ప్రవేశిక

పరిశోధనాంశాన్ని ఎన్నుకొన్న తర్వాత పరిశోధకుడు పరిశోధన ప్రణాళికను రూపొందించుకోవాలి. పరిశోధనలో ఎన్నో దశలున్నాయి. దేనిని ముందు ప్రారంభించాలి? తర్వాత దేనిని కొనసాగించాలి? ఏయే అంశాలను సేకరించాలి, ఏయే అంశాలను పరిహరించాలి?— ఈ విధంగా పరిశోధనలో ఒక మార్గాన్ని నిర్దేశిస్తుంది పరిశోధన ప్రణాళిక. నిర్దిష్ట కాలంలో పరిశోధన పూర్తికావడానికి ఇది దోహదం చేస్తుంది. కాబట్టి పరిశోధకుడు పరిశోధన ప్రణాళికను అనుసరించి తన పరిశోధన వ్యాసంగాన్ని కొనసాగించాలి.

"ఒక భవనాన్ని నిర్మించే వాస్తు శాస్త్రజ్ఞుడు భవనం నమూనా ఒకటి ముందుగానే రూపొందించుకొంటాడు. భవనం నిర్మాణంలో చేయవలసిన పనుల వివరాలను అతడు నమూనా ఏర్పరచుకొనేటప్పుడే గుర్తుంచుకొంటాడు. ఏ ఉద్దేశంతో తాను భవనాన్ని నిర్మిస్తున్నాడనే విషయాన్ని మనసులో ఉంచుకొని, ఎన్ని గదు లుండాలి? భవనం పొడవు, వెడల్పు మొదలైన కొలతలు ఏ విధంగా ఉండాలి? గదుల్ని ఏ విధంగా నిర్మించాలి? భవన నిర్మాణానికి ఏయే వస్తువులు ఉపయోగించాలి? మొదలైన విషయాలన్నిటిని పద్ధతి ప్రకారం సిద్ధం చేసుకొని భవన నిర్మాణానికి పూనుకొంటాడు. భవనం నిర్మించడానికి మునుపే అతడు ఆ భవనం నమూనా పటాన్ని రూపొందించుకొంటాడు. పొరబాట్లు, లోటుపాట్లు ఏర్పడినప్పుడు వాటిని సరిదిద్దుకుంటూ ఆఖరుకు తాను సిద్ధం చేసుకొన్న పథకం ప్రకారం భవన నిర్మాణం పూర్తి చేస్తాడు. పరిశోధన ప్రణాళిక కూడ అచ్చం ఈ నమూనా లాంటిదే".[1] శాస్త్రీయ పద్ధతుల్లో పరిశోధన సాగించే పరిశోధకుడు తప్పనిసరిగా ఒక పరిశోధన ప్రణాళికను రూపొందించుకోవాలి.

## 4.2. అర్థ వివరణ

"పరిశోధన ప్రణాళిక అనేది పరిశోధనను అమలుపరచడానికి దోహదం చేసే సహేతుకమైన, క్రమబద్ధమైన ఒక పథకం. అది పరిశోధనలో మార్గాన్ని నిర్దేశిస్తుంది"[2] అని పాలిన్ వి. యంగ్ పరిశోధన ప్రణాళికను నిర్వచించాడు.

మనకున్న సమయం, శక్తిసామర్థ్యాలు, ఆర్థిక సదుపాయం, లభ్యమవుతున్న విషయ సామగ్రి మొదలైనవి ఆధారంగా చేసుకొని ఎంతవరకు ఇవి కార్యాచరణలో

ఉపకరిస్తాయో వివరించే పథకాన్నే పరిశోధన ప్రణాళిక అనవచ్చు.

పరిశోధకుడు తాను ఎన్నుకొన్న అంశాన్ని బాగా పర్యాలోచించి పరిశోధించ వలసిన సమస్యను పరిష్కరించి, నూతన సిద్ధాంతాలను ప్రతిపాదించటానికి కావల సిన ఆధారాలను, పద్ధతులను నిర్ణయించటానికి ఆధార భూతమయినది పరిశోధన ప్రణాళిక.[3]

విషయ సామగ్రి సేకరణలో, వర్గీకరణలో అనుసరించవలసిన పద్ధతులు, విశ్లేషణలో తీసుకోవలసిన జాగ్రత్తలు, ఊహా ప్రతిపాదన, సాక్ష్యాధారాల నిరూపణ, సిద్ధాంతాల ప్రతిపాదన — ఈ విధంగా పరిశోధనలో వివిధ దశలు పరిశోధన ప్రణాళికలోనే అంతర్గతమై ఉంటాయి.

పరిశోధకుడు మొదట్లో వేసుకొన్న ప్రణాళిక మార్పులకు, చేర్పులకు లోను కావడం సహజం. పరిశోధన కార్యక్రమం సాగుతున్న కొద్దీ పరిశోధకుడిలో నూతన దృక్పథం ఏర్పడుతుంది. కొత్త కొత్త ఆధారాలు లభిస్తాయి. విభిన్నాంశాలలో ఉన్న పరస్పర సంబంధాలు వెలుగులోకి వస్తాయి. అప్పుడు తప్పనిసరిగా పరిస్థితు లకు తగినట్లు ప్రణాళికను మార్చుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. పరిశోధకుడు ఆయా సందర్భాలకు తగినట్లు ప్రణాళికను సవరించుకొంటూ పరిశోధనను సాగిం చాలి. పరిశోధన ప్రణాళిక మార్పులకు చేర్పులకు లోనుకావడం అనేది అనివార్యం అని దీన్నిబట్టి తెలుస్తోంది.[4] మొదట్లో చిత్తు ప్రతిగా వున్న పరిశోధన ప్రణాళిక ఎన్నో ఆటంకాలను, సవాళ్ళను ఎదుర్కొని, పెక్కు మార్పులకు లోనయి, క్రియా శీలకమైన ప్రణాళికగా మారుతుంది.

## 4.3. పరిశోధన ప్రణాళికలోని ముఖ్యాంశాలు

పరిశోధన సాధారణంగా రెండు విధాలుగా ఉంటుంది. అవి :

1. ప్రయోగాత్మక పరిశోధన 2. విశ్లేషణాత్మక పరిశోధన.

ప్రయోగాత్మక పరిశోధన వైజ్ఞానిక, సాంకేతిక రంగాలకు; విశ్లేషణాత్మక పరిశోధన సాహిత్య, చారిత్రక, సామాజిక రంగాలకు ఉద్దేశింపబడింది. పరిశోధ నాంశానికి తగినట్లు పరిశోధన ప్రణాళిక మారుతున్నప్పటికీ, సాధారణ విషయాలలో రెండూ ఒకే రీతిగానే అమరి ఉంటాయి. పరిశోధన ప్రణాళికలో ఈ క్రింది అంశా లను ఒకదాని తర్వాత ఒకటిని వరుస క్రమంలో గుర్తుంచుకోవాలి.[5]

### 4.3.1. పరిశోధనాంశ శీర్షిక (Title of the investigation)

శీర్షిక సంగ్రహంగాను, సూటిగాను ఉండాలి. శీర్షికను చదివిన వెంటనే పరిశోధనాంశాన్ని గురించి స్పష్టమైన అభిప్రాయం ఏర్పడాలి.

### 4.3.2. పరిశోధన ఆవశ్యకత (Purpose of the Study)

పరిశోధన ఎందుకు ఉపక్రమింపబడుతుందో, దాని ఆవశ్యకత ఏమిటో

సంక్షిప్తంగా చెప్పాలి. పరిశోధనాంశ ప్రాముఖ్యతను రెండు మూడు వాక్యాల్లో తెలియజేయాలి.

### 4.3.3. పూర్వ పరిశోధనల విమర్శనాత్మక పరిగణన (Critical appraisal of Previous Studies)

పరిశోధనాంశ శీర్షికకు సంబంధించి ఇంతకు పూర్వం జరిగిన పరిశోధనలను సమగ్రంగా అవగాహన చేసికొని, నిశితంగా పరిశీలించి వాటిమీద విమర్శనాత్మక పరిగణన ఏర్పరచుకోవాలి. దీని వలన పునరుక్తిని, పూర్వ పరిశోధనల్లోని లోటు పాటుల్ని పరిహరించవచ్చు.

### 4.3.4. పరిశోధన సమస్య నిర్ధారణ (Statement of the Problem)

ఇతరులు చేసిన పరిశోధనల్ని నిశిత పరిశీలన చేయడం వల్ల పరిశోధకునికి తాను ఎన్నుకొన్న పరిశోధన సమస్యను సుస్పష్టంగా నిర్ధారించుకొనే అవకాశం కలుగుతుంది. పరిశోధన సమస్యను సిద్ధాంత రూపంలోనో, ప్రశ్న రూపంలోనో పేర్కొనవచ్చు.

### 4.3.5. పరిశోధన వ్యాప్తి (Scope of Investigation)

పరిశోధకుని పరిశోధన వ్యాసంగం కాలం, డబ్బు, విషయ సేకరణకు అనుకూలించే పుస్తకాలు, క్షేత్రకృషి మొదలైన అంశాల మీద ఆధారపడి ఉంటుంది. వీటి సాధక బాధకాలను గుర్తించి పరిశోధకుడు తాను ఎన్నుకొన్న పరిశోధనాంశం వ్యాప్తిని (విస్తృతిని) నిర్ణయించుకోవాలి.

### 4.3.6. పరిశోధన ఆశయాలు (Objectives of the Study)

పరిశోధకుడు తాను ఎందుకు పరిశోధనకు ఉపక్రమిస్తున్నాడో ఆ లక్ష్యాన్ని (aim) పేర్కొని దానికి సంబంధించిన ఆశయాలను (objectives) వరుసగా పేర్కొనాలి. ఈ ఆశయాలు పరిశోధనాంశ పరిధికి పరిమితమై ఉండాలి.

### 4.3.7. సాంకేతిక పదాల నిర్వచనం (Conception of the different terms used in the Investigation)

పరిశోధకుడు తాను పరిశోధన వ్యాసంలో ఉపయోగించిన సాంకేతిక పదాల్ని ఎలాంటి సందిగ్ధం లేకుండ స్పష్టంగా నిర్వచించాలి. ఆ పదాలను తన పరిశోధనలో సర్వత్రా ఏకరీతిని ప్రయోగించాలి.

### 4.3.8. పరివర్తనాంశాలు (Variables)

పరిశోధనకు తీసుకొన్న సామగ్రిలో కొన్ని పరివర్తన లేదా ప్రత్యంతర అంశాలుంటాయి. మరికొన్ని స్థిర అంశాలు ఉంటాయి. ఇటువంటి పరివరన

అంశాల్ని గుర్తించి దానికి తగినట్లు పరిశోధనను కొనసాగించాలి.

### 4.3.9. పరిశోధనలో అవలంబిస్తున్న విధానం (Research Methodology)

పరిశోధనలో ముఖ్యంగా రెండు విధాలున్నాయి :

a) శాస్త్రీయ పద్ధతి లేదా ప్రయోగాత్మక పద్ధతి (Applied Research (or) Experimental Research)

b) వాఙ్మయ పద్ధతి లేదా విశ్లేషణాత్మక పద్ధతి (Pure Research (or) Analytical Research)

వీటిలో ఏ పద్ధతిని పరిశోధకుడు అవలంబించాల్సి ఉంటుందో నిర్ణయించుకోవాలి.

### 4.3.10. ఊహా ప్రతిపాదన (Hypothesis)

తన పరిశోధనాంశానికి సంబంధించి ఇతర పరిశోధన గ్రంథాల్ని చదవడం ద్వారానూ, తనకు తానే పరిశోధనాంశం మీద కలిగిన అవగాహన ద్వారాను పరిశోధకునిలో పరిశోధన సమస్య గురించిన ఒక విధమైన అస్పష్టమైన ఊహ రూపొందుతుంది. ఇది అస్పష్టంగా ఉన్నా పరిశోధన ప్రపంచంలో పయనించడానికి ఇదే మార్గదర్శిగా ఉంటుంది. దీన్నే ఊహా ప్రతిపాదన (Hypothesis) అంటారు..

### 4.3.11. విషయ సేకరణ (Data Collection)

ఊహా ప్రతిపాదనకు తగినట్లు విషయ సేకరణకు పూనుకోవాలి. తనకు కావలసిన ఆకరాలను ఎలా సేకరించాలో నిర్ణయించుకోవాలి. గ్రంథస్థ ఆధారాలు, క్షేత్ర పరిశీలన (Field work), ప్రశ్నావళి (Questionnair) ముఖాముఖి (Interview) మొదలైన పద్ధతుల ద్వారా విషయ సేకరణ చేయవచ్చు. సేకరిస్తున్న విషయ సామగ్రి తాను అన్వేషించే అంశాలకు అన్వయించేటట్లుగాను, వాస్తవ నిరూపణకు దోహదం చేసేటట్లుగాను ఉండాలి. పరిశోధనాంశంపైనే దృష్టిని కేంద్రీకరించి విషయ సేకరణకు పూనుకోవాలి.

### 4.3.12. విషయ సామగ్రి విశ్లేషణ (Data Analysis)

విషయ సామగ్రిని విశ్లేషించడానికి ఒక ప్రామాణిక పద్ధతిని ముందుగానే నిర్ణయించుకోవాలి. ఈ విశ్లేషణా పద్ధతిని విషయ సేకరణ సమయంలో పరిశోధకుడు తనకు కలిగిన అవగాహన మేరకు కొంత సవరించుకోవలసి ఉంటుంది. అయినప్పటికి విషయ సామగ్రి విశ్లేషణకు ఒక మౌలికమైన ప్రామాణిక విధానం తప్పనిసరి.

### 4.3.13. ఫలితాల పట్టిక (Tabulations of the Results)

ఫలితాలను ఒక పట్టిక రూపంలో ఇవ్వడం శాస్త్రీయ విధానంలో ఒక భాగంగా భావించవచ్చు. పరిశోధకుడు విషయ సామగ్రిని విశ్లేషించి, ఫలితాలను

వివిధ శీర్షికల కింద పట్టిక పెట్టాలి. ఈ పట్టికలు పరిశోధన విధానాన్ని, దాని గమ్యాన్ని కొట్టవచ్చినట్లు చూపెడతాయి.

### 4.3.14. ఫలితాల సమన్వయీకరణ (Interpretation of the Results)

a) పరిశోధకుడు తనకు లభించిన ఫలితాలను ఇంతకు పూర్వం జరిగిన పరిశోధనల ఫలితాలతో పోల్చి చూడాలి. వాటితో తన ఫలితాలు అన్వయించకపోతే కారణమేమిటో అన్వేషించాలి.

b) తనకు లభించిన ఫలితాల్లో లోపాలు లేవని నిర్ధారణ అయిన తర్వాత ఒక సామాన్య సూత్రాన్ని (Generalization) ప్రతిపాదించవచ్చు.

c) ఫలితాల పరిశీలన కొన్నిసార్లు అనుకోని వినూత్న భావాల్ని లేదా అవగాహనల్ని పరిశోధకునిలో పుట్టిస్తాయి.

### 4.3.15. ఫలితాల ధ్రువీకరణ (Verification of the Results)

పరిశోధనలో తాను పాటించిన పద్ధతిని పునఃపరిశీలన చేసి తనకు లభించిన ఫలితాలు సరైనవా? తాను ప్రతిపాదించిన సామాన్య సూత్రం సమంజసమేనా? అని ప్రయోగాత్మకంగా ధ్రువీకరించాలి.

### 4.3.16. ఉపసంహారం (Conclusion)

పునఃపరిశీలన తర్వాత తనకు లభ్యమైన ఫలితాలను ఆధారం చేసుకొని మూల సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా సమీక్షించవచ్చు.

### 4.3.17. భావి పరిశోధనలకు సూచనలు (Suggestions for further Research)

పరిశోధన అంటే అన్వేషణ. పరిశోధనవల్ల సత్యావిష్కరణ జరుగుతుంది. ఇది పరిశోధన రంగంలోని జడత్వాన్ని తొలగించి, వికాసానికి, పరిణామానికి దారితీస్తుంది. కనుక పరిశోధనకు అంతం అంటూ లేదు. ఒక పరిశోధన మరికొన్ని పరిశోధనలకు ఆరంభం అవుతుంది. పరిశోధనను ఒక మానసిక స్థితిగా పొందిన పరిశోధకుడు సత్యాన్ని ఆవిష్కరిస్తూ, మరికొన్ని సమస్యా ద్వారాల్ని తెరచి పెట్టాలి. తర్వాతి పరిశోధనలకు సూచనలు ఇవ్వాలి.

### 4.3.18. ఉపయుక్త రచనల పట్టిక (Bibliography)

ఉపసంహారం తర్వాత ఉపయుక్త గ్రంథ పట్టిక ఉంటుంది. పరిశోధకుడు తన పరిశోధనకు ఉపయోగించిన రచనల్ని పట్టిక చేసి ఇవ్వాలి.

ఇది అకారాదిగా కూర్చవలసి ఉంటుంది. దీన్ని గ్రంథ రూపంగా ఉండే ఆకరాలు, వ్యాసరూపంగా ఉండే ఆకరాలు అని రెండుగా విభజింపవచ్చు. ప్రత్యేక

ఆధారాలు, పరోక్ష ఆధారాలని కూడ విభజించవచ్చు. ఈ పట్టిక పాఠకులకు, తర్వాతి పరిశోధకులకు ఉపకరిస్తుంది.

### 4.3.19. సిద్ధాంత వ్యాస సార సంగ్రహం (Synopsis of the Thesis)

పరిశోధన గురించిన చరిత్రను, దాని ఫలితాల్ని పరిశోధకుడు క్లుప్తంగా నివేదించాలి. ఇందులో 1. పరిశోధనాంశం గూర్చిన వివరణ 2. పరిశోధన పద్ధతి 3. పరిశోధన ఫలితాలు, ప్రధాన సిద్ధాంతం మొదలయినవి సంక్షిప్తంగా తెలిపి, ఇకముందు కొనసాగించవలసిన పరిశోధనలను సూచించి సత్యావిష్కరణకు స్వాగతం పలకాలి.

### 4.3.20. ఆర్థిక వ్యయం (Expenditure)

ఈ పరిశోధనకు ఆర్థికపరంగా ఎంత ఖర్చు అవుతుందో దాన్ని పట్టిక పెట్టి తెలపాలి. ఆర్థిక పరిమితివల్ల పరిశోధనకు జరిగిన లాభనష్టాలను కూడ చర్చించాలి.

### 4.3.21. కాల వ్యవధి (Period of Research)

పరిశోధనకున్న కాలపరిమితిని దృష్టిలో పెట్టుకొని పరిశోధకుడు పరిశోధనను సాగించాలి విషయ సామగ్రి సేకరణకు, సిద్ధాంత వ్యాసరచనకు ఎంత కాలం పట్టవచ్చునో బేరీజు వేసుకొని పరిశోధనలోని వివిధ దశలను ఆయా కాలపరిమితుల్లో పూర్తి చేయడానికి ప్రయత్నించాలి.

## 4.4. ఉత్తమ పరిశోధన ప్రణాళిక

పరిశోధన ప్రణాళిక ఈ క్రింది ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానాలు ఇవ్వగలిగి ఉండాలి. అప్పుడే దానిని ఉత్తమ పరిశోధన ప్రణాళికగా భావించవచ్చు.[6]

1. పరిశోధన దేనిని ఉద్దేశించింది?
2. పరిశోధన ఎందుకు ఉపక్రమింపబడుతోంది?
3. ఎటువంటి విషయ సామగ్రి కావాలి?
4. కావలసిన ఆధారాలు ఎక్కడ లభ్యమవుతాయి?
5. పరిశోధన విస్తృతి లేక పరిధులు ఏవి?
6. పరిశోధన పూర్తికావడానికి ఎంతకాలం పట్టవచ్చు?
7. పరిశోధనకు ఎంత విషయ సామగ్రి అవసరమవుతుంది?
8. విషయ సామగ్రి సేకరణలో అనుసరించవలసిన పద్ధతులు ఏవి?
9. విషయ సామగ్రిని ఏ విధంగా విశ్లేషించాలి?
10. సుమారుగా ఎంత డబ్బు అవసరమవుతుంది?

11. పరిశోధనలో ఎలాంటి విధానం అనుసరింపబడుతుంది?
12. పరిశోధన ప్రత్యేకత ఏమి?

## 4.5. పరిశోధన ప్రణాళిక ప్రయోజనాలు

1. పరిశోధన ప్రణాళిక పరిశోధకుడి ఆలోచనా స్రవంతిని ఒక పద్ధతిలో ఉంచుతుంది.
2. ఈ పద్ధతిని పాటించడంవల్ల పరిశోధనలో కచ్చితమైన ఫలితాలు వెలువడతాయి.
3. నిర్ణీత కాలంలో పరిశోధన పూర్తి కావడానికి ఇది తోడ్పడుతుంది.
4. పరిశోధన వ్యయాన్ని అరికట్టుతుంది.
5. పరిశోధన ఎదురయ్యే సందేహాలను, తికమకలను తగ్గిస్తుంది.
6. అనవసర విషయాలను సేకరించి, కాలాన్ని వ్యర్థం చేయకుండా ఉండడానికి తోడ్పడుతుంది.

## 4.6. ఉపసంహారం

పరిశోధన ప్రణాళిక ఎంత జాగ్రత్తగా ఆలోచించి రూపొందిస్తే పరిశోధన కూడ అంత ఉత్తమంగా రూపొందుతుంది. కాబట్టి పరిశోధకుడు నిశిత పరిశీలనతో, అభినివేశంతో, అనుభవంతో పరిశోధన ప్రణాళికను రూపొందించుకోవాలి. సక్రమంగా లేని ప్రణాళిక మొత్తం పరిశోధన కార్యక్రమాన్నే తప్పుత్రోవకు తీసుకువెళుతుంది. పరిశోధన ప్రణాళిక లేకుండా పరిశోధన సాగించడం అనేది సముద్రంలో దిక్సూచి లేకుండ ప్రయాణం చేయడంవంటిది. కాబట్టి పరిశోధన ప్రణాళిక రూపొందించుకోవడంలో పరిశోధకుడు ఎంతో జాగ్రత్త తీసుకోవాలి.

REFERENCES :


1. T. S. Wilkinson, P. L. Bhandarkar, *Methodology and Techniques of Social Research*, P. 103.
2. Pauline V. Young, *Scientific Social Surveys and Research*, P. 131.
3. Jonathan Anderson, *et. al. Thesis and Assignment Writting*, P. 19.
4. Such man, *'The Principles of Research Design'. An Introduction to Social Research*, John T. Doby *et. al.* P. 254.
   Quoted by Pauline V. Young. op. cit., P. 131.
5. Pauline V. Young PP. 13-21.
6. B. A. V. Sharma *et. al*, *Research Methods in Social Science*, P. 71.

# 5. ఊహాప్రతిపాదన

(HYPOTHESIS)

## 5.1. ప్రవేశిక

ఏదైనా ఒక కార్యాన్ని ఊహాప్రతిపాదనతో ప్రారంభించి ఆ మార్గంలో ముందుకు సాగినపుడు ఆ కార్యం తప్పకుండ విజయవంతమవుతుంది. శాస్త్రీయ పరిశోధనల్లో ఊహాప్రతిపాదనను అతి ముఖ్యమైన అంశంగా శాస్త్రజ్ఞులు పరిగణిస్తున్నారు. వేటిని సేకరించాలి? వేటిని పరిహరించాలి? సేకరించిన విషయ సామగ్రిని ఏ విధంగా క్రోడీకరించాలి? వాటి మధ్యవున్న పరస్పర సంబంధాలను ఏ విధంగా సమన్వయపరచాలి? మొదలైన వివిధ పరిశోధన దశలకు మార్గదర్శకంగా అమరి వుంటుంది ఊహాప్రతిపాదన.

ఊహాప్రతిపాదనను రూపొందించుకొని విషయ సామగ్రిని సేకరించడం ప్రారంభించినపుడు, పరిశోధనాంశానికి సంబంధించిన వివిధ ఆకరాలను ఒక క్రమపద్ధతిలో అమర్చుకొని విస్తృతంగా ఉన్న విషయ సామగ్రికి ఒక పరిధిని ఏర్పరచుకోడానికి వీలవుతుంది. విషయ సామగ్రిలో ఉన్న లోటుపాట్లను దృష్టిలో పెట్టుకొని పరిశోధనాంశ పరిధిని రూపొందించుకోవడానికి కూడా ఇది తోడ్పడుతుంది. ఊహాప్రతిపాదనతో పరిశోధన ప్రారంభించడానికి, ఊహాప్రతిపాదన లేకుండా పరిశోధన ప్రారంభించడానికి గల భేదం ఇదేనని లాండ్‌బర్గ్ అనే శాస్త్రజ్ఞుడు అభిప్రాయపడుతున్నారు.[1]

## 5.2. అర్థ వివరణ

Hypothesis అనే ఆంగ్ల పదానికి "ఊహాప్రతిపాదన", "ఊహాకల్పన", "పూర్వకల్పన", "పరికల్పన" అనే పదాలను తెలుగులో పర్యాయపదాలుగా వాడుతున్నాం.

పరిశోధకుడు పరిశోధన సమస్యను పరిశీలించి, విశదీకరించటానికి మొదట్లో తనకు తానే ఏర్పరచుకొన్న అవగాహన లేక పరిష్కారమే ఊహాప్రతిపాదన అని T. S. Wilkinson అభిప్రాయపడ్డారు.[2]

పరిశోధనాంశాన్ని ఎన్నుకొన్న పరిశోధకుడు పరిశోధన సామగ్రిని వివిధ పద్ధతుల్లో సేకరిస్తాడు. సేకరించిన వివిధాంశాలను వర్గీకరించడంలో ఎన్నో వాస్తవాలను గుర్తిస్తాడు. వాటిని ఒకదాని కొకటి సమన్వయపరచి వాటి మధ్య ఉన్న సంబంధాలను తెలుసుకోవటానికి ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నంలో తాత్కాలికంగా (ఊహ ఆధారంగా) భావనాలోకంలో ఏర్పరచుకొన్న పరిష్కారమే 'ఊహాప్రతిపాదన' అని చెప్పవచ్చు. ఈ విధంగా పరిశోధకుడు తాత్కాలికంగా నిర్ణయించుకొన్న సమాధానాలు పరిశోధన సమస్య పరిష్కారానికి మార్గాలుగా రూపొందుతాయి.

తాను అనుకొన్న ఒక సిద్ధాంతాన్ని స్థాపించడంకోసంగాని, ఒక అంశాన్ని నిరూపించడంకోసంగాని, లేక త్రోసిపుచ్చడంకోసంగాని పరిశోధకుడు కొన్ని వాస్తవాలను సేకరిస్తాడు. అటువంటి లక్ష్యంతో కూడిన దృష్టి లేక ముందుగా ఊహించుకొన్న పథకం 'ఊహాప్రతిపాదన' అని చెప్పబడుతుంది.[3]

తెలిసిన, లభించిన విషయ సామగ్రిని స్థూల దృష్టితో పరిశీలించి ఏర్ప రచుకొన్న తాత్కాలిక పరిష్కారమే ఊహాప్రతిపాదన అని పై వివరణల వలన తెలుస్తుంది.

ఏర్పడిన సమస్యకు తాత్కాలికమైన వివరణగాని, లేక పరిష్కారంగాని ఏర్పరచుకోకుండా పరిశోధనలో మనం ఒక్క అడుగుకూడా ముందుకు వెళ్ళ లేము. పరిశోధనాంశంలో పరిశోధకుడు ప్రారంభంలోనే ఒక స్థూల అవగాహన ఏర్పరచుకొంటాడు. ఆ విధంగా ఏర్పరచుకొన్న వివరణాత్మక సిద్ధాంతాల సమూహాన్నే 'ఊహాప్రతిపాదన' అనవచ్చు. సమస్య పూర్వాపరాలు అవగతమైన తరువాత దాని పరిష్కారానికి సహాయపడేందుకు ఏర్పరచుకొన్న అభిప్రాయాలే ఊహాప్రతిపాదన అవుతుంది.

పై నిర్వచనాల వలన ముందుగా ఏర్పరచుకొన్న వివరణలే, ఊహలే 'ఊహాప్రతిపాదన' అని వ్యక్తమవుతుంది. ఊహా ప్రతిపాదనను ఆధారంగా చేసి కొని పరిశోధకుడు పరిశోధనను కొనసాగిస్తాడు. అది సక్రమంగా లేనప్పుడు వేరొక ఊహాప్రతిపాదనను రూపొందించుకొంటాడు.

విజ్ఞాన సహాయ సంపత్తితో సత్యాన్ని ఆవిష్కరించడమే పరిశోధకుడి ప్రధాన లక్ష్యంగా భావించాలి. కాబట్టి పరిశోధకుడు జాగ్రత్తగా పునఃపరిశీలన చేసి సరైన ఊహా ప్రతిపాదనను రూపొందించుకోవటానికి ప్రయత్నించాలి. ఒకసారి ఊహాప్రతిపాదనను నిర్మించుకొన్న తర్వాత అది ఎలాంటి మార్పులకు లోనుకాకుండ అలాగే ఉంటుంది - ఉండాలి అని అనుకోవడం మంచిదికాదు. మనం నిర్మించుకొన్న ఊహాప్రతిపాదన వివిధ పరీక్షలకు తట్టుకొని, వివిధాంశాల మధ్య ఉన్న కార్యకారణ సంబంధాలను అర్థం చేసుకొని పరిశోధనాంశంలోని మూల

సిద్ధాంతాలను స్థాపించడానికి సహకరించాలి. వివిధ పరీక్షలను తట్టుకొని ఊహా ప్రతిపాదన నిలబడగలిగితే అది 'మూల సిద్ధాంతం' అవుతుంది.

ఊహాప్రతిపాదన అనేది నిరూపింపబడవచ్చు లేక వ్యతిరేకింపబడవచ్చు. నిరూపింపబడాలి అని ప్రతీక్షించకూడదు. అదేవిధంగా ఊహాప్రతిపాదన పరీక్షలకు తట్టుకొని సరైన సమాధానం పొందలేనపుడు ఉచితమైన మరొక ఊహా ప్రతిపాదనను ఆలోచించి రూపొందించుకోవాలి. అందుకనే ఊహాప్రతిపాదనను నిర్వచించిన శాస్త్రజ్ఞులు దీన్ని తాత్కాలికమైనదిగాను, ఊహాప్రతిపాదిత మైనదిగాను భావించారు.

## 5.3. ఊహాప్రతిపాదన ముఖ్యలక్షణాలు[4]

5.3.1. ఊహాప్రతిపాదన స్పష్టంగానూ, సూటిగానూ ఉండాలి. అలా లేనపుడు దాన్ని ఆధారంగా చేసుకొన్న మన అనుమానాలు కూడ విశ్వసనీయమైనవిగా పరిగణింపబడవు.

5.3.2. ఊహాప్రతిపాదన పరీక్షలకు నిలబడేదిగా ఉండాలి. పరిశోధకుడు రూపొందించుకొన్న ఊహాప్రతిపాదన శాస్త్రీయ పరిశోధనలు చేయడానికి అర్హమై ఉండాలి. పరీక్షలకు నిలబడలేని ఊహాప్రతిపాదనల కారణంగా మొత్తం పరిశోధనా కార్యక్రమం అస్తవ్యస్తమవుతుంది. కాబట్టి పరిశోధకుడు ప్రారంభంలోనే కొంత ప్రాథమిక పరిశీలన కావించి తగిన ఊహాప్రతిపాదనను రూపొందించుకోవడం మంచిది.

5.3.3. పరివర్తనాంశాల (Variables) మధ్యనున్న సంబంధాన్ని ఊహా ప్రతిపాదన చెప్పగలగాలి.

5.3.4. ఊహాప్రతిపాదన ఒక లక్ష్య పరిమితికి లోబడి ఒక నిర్దిష్టాంశాన్ని సూచిస్తూ ఉండాలి. ఎప్పుడైతే ఊహాప్రతిపాదన పరిమిత వ్యాప్తి కలిగి ఉంటుందో అప్పుడే అది అధిక పరీక్షలను ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉంటుంది.

5.3.5. ఊహాప్రతిపాదన సాధ్యమయినంతవరకు సామాన్య పదజాలంతో స్పష్టంగా అందరికీ అర్థమయ్యేలాగ ఉండాలి. ఊహాప్రతిపాదన సామాన్యంగా ఉన్నప్పటికీ దాని ప్రాధాన్యతకు ఎటువంటి లోపమూ ఉండదు.

5.3.6. ఊహాప్రతిపాదన శాస్త్ర నిగూఢ యథార్థాంశాలను కలిగి ఉండాలి. అందరిచేతా అంగీకరింపబడిన వాస్తవ విషయాలతో అది రూపొందింపబడి, విజ్ఞులచే ఆమోదయోగ్యమైనదిగా పరిగణింపబడాలి.

5.3.7. నిర్ణీత కాలం లోపలే ఊహాప్రతిపాదనను పరీక్షించాలి. ఎంత గొప్ప ఊహాప్రతిపాదన అయినా నిర్ణీతకాలం దాటింతర్వాత పరిశోధకుడు దాన్ని ఉపయోగించకూడదు.

5.3.8. ప్రత్యేక వివరణ కావలసిన కొన్ని అంశాలను ఊహాప్రతిపాదన తప్పని సరిగా విశదీకరించాలి. ఊహాప్రతిపాదన తోడ్పాటుతో, సార్వత్రిక వాస్తవాల అవగాహనతో పరిశోధకుడు పరిశోధన సమస్య పరిష్కార సూత్రాలను తెలుసుకోగలుగుతాడు.

# 5.4. ఊహాప్రతిపాదన-రకాలు

ఊహాప్రతిపాదనలో సాధారణంగా ఈ క్రింది రకాలను చూడవచ్చు.

## 5.4.1. శూన్య ఊహాప్రతిపాదన (Null Hypothesis)

విభిన్నాంశాల మధ్య ప్రముఖంగా ఎటువంటి భేదం లేదని చెబుతుంది ఈ రకపు ఊహాప్రతిపాదన. అనుభవజ్ఞులైన శాస్త్రజ్ఞులు ఈ విధమైన ఊహాప్రతిపాదనను రూపొందించుకోవడాన్ని ఆమోదిస్తారు. విషయ సేకరణలో పక్షపాత దృష్టిని పరిహరించడమే ఈ రకమైన ఊహాప్రతిపాదన ప్రధాన ఉద్దేశం.

## 5.4.2. భవిష్యదంశ సూచక ఊహాప్రతిపాదన (Predication Form)

ప్రయోగాలద్వారా ఏయే అంశాలు అభివ్యక్తమవుతాయని పరిశోధకుడు ఎదురు చూస్తున్నాడో ఆ అంశాలను ఆధారంగా చేసుకొని ఊహాప్రతిపాదనను రూపొందించుకొన్నప్పుడు అది భవిష్యదంశ సూచక ఊహాప్రతిపాదన అవుతుంది.

## 5.4.3. ప్రకటనాత్మక ఊహాప్రతిపాదన (Declarative Form)

విభిన్నాంశాల మధ్యగల సంబంధాలు ఇలా ఉంటాయని ఖచ్చితంగా తెలియ చేయడమే ప్రకటనాత్మక ఊహాప్రతిపాదన అవుతుంది.

## 5.4.4. ప్రశ్నాత్మక ఊహాప్రతిపాదన

ఊహాప్రతిపాదన ప్రశ్న రూపంలో ఉనప్పుడు అది ప్రశ్నాత్మక ఊహాప్రతిపాదన అవుతుంది.

# 5.5. ఊహాప్రతిపాదనను రూపొందించుకొనే విధానం

పరిశోధన సమస్యను ఎన్నుకోవడంలో ఎంతటి పరిశ్రమ అవసరమో సరైన ఊహాప్రతిపాదనను రూపొందించుకోవడంలో కూడా అంతటి పరిశ్రమ

అవసరమవుతుంది. కొంత విషయ సామగ్రి సేకరణ, సంబంధిత అంశాల అధ్యయనం, ప్రాథమిక పరిశీలన మొదలైనవి చేయడం వల్ల పరిశోధకుడు ఏర్పరచు కొన్న ఊహాప్రతిపాదన మరింత క్రియాశీలకమై ఉత్తమ ఫలితాలను ఇవ్వగలుగు తుంది. పరిశోధకుడు నూతన సిద్ధాంతాన్ని రూపొందించగల ఊహాప్రతిపాదనను ఏర్పరచుకోవడమేకాక, దాన్ని పరీక్షించి తెలుసుకోగల జ్ఞానాన్ని కూడా సముపార్జిం చినవాడై ఉండాలి. పూర్వాభిప్రాయాలను, సొంత ఇష్టా ఇష్టాలను అధిగమించి పరిశోధన కార్యక్రమాన్ని కొనసాగించాలి. బుద్ధికుశలతతో సరైన ఊహాప్రతిపాదన రూపొందించుకొన కలగడమేకాక విమర్శనాశక్తితో ప్రయోజన శూన్య ఊహాప్రతి పాదనలను త్రోసిపుచ్చగల నైపుణ్యం కూడా కలిగివుండాలి.

సరైన ఊహాప్రతిపాదన రూపొందించుకోవడంలో పరిశోధకుడు ఈ క్రింది అంశాలను గుర్తుంచుకోవాలి :

### 5.5.1. పరిపూర్ణ విజ్ఞానం

పరిశోధకుడికి తాను ఎన్నుకొన్న పరిశోధనాంశానికి సంబంధించిన పూర్వాప రాలు బాగా తెలిసి ఉండాలి. సంబంధిత గ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి, ఆ అంశాన్ని సాధికారంగా వివరించగల నైపుణ్యం సంపాదించాలి.

### 5.5.2. సంస్కృతీ సంప్రదాయాలు

ప్రజల జీవన విధానంమీద వారి సంస్కృతి సాంప్రదాయాల ప్రభావం ఉండడం సహజం. సమస్యలకు పరిష్కారం అన్వేషించేముందు సంబంధిత ప్రజల ఆచార వ్యవహారాలు, కుటుంబ వ్యవస్థ, నమ్మకాలు, జీవన విధానం మొదలైన అంశాలను పరిశోధకుడు విస్మరించకూడదు.

### 5.5.3. శాస్త్రీయ సిద్ధాంతాలు

వైజ్ఞానిక సాంకేతిక రంగాలలో వెలువడిన కొన్ని నూతన సిద్ధాంతాలను సామాజిక శాస్త్ర, సాహిత్య రంగాలకుకూడ అన్వయించుకొని సమస్యలను పరిష్క రించుకొనవచ్చు. వైజ్ఞానిక సూత్రాల తోడ్పాటుతో పరిశోధకుడు సరైన ఊహా ప్రతిపాదన ఏర్పరచుకోవాలి.

### 5.5.4. స్వానుభవం

నిజానికి సరైన ఊహాప్రతిపాదన పరిశోధకునకు స్వానుభవం నుండే వెలువడుతుంది. పరిశోధకుడు నిత్య జీవితంలో ఎన్నో అనుభవాలను పొందుతూ ఉంటాడు. ఆ అనుభవాల విజ్ఞానంతో పరిశోధకుడు మంచి ఊహాప్రతిపాదన ఏర్పరచుకోవచ్చు.

### 5.5.5. సామ్యం

ఒక సమస్యను పోలిన సమస్య మరొకటి ఉన్నప్పుడు మొదటి సమస్యకు

ఎటువంటి ఊహాప్రతిపాదన అనుసరింపబడిందో రెండవ సమస్యకు కూడా అదే ఊహాప్రతిపాదనను అనుసరించవచ్చు. పూర్వ పరిశోధకులు ఏర్పరచుకొన్న ఊహాప్రతిపాదనను తెలుసుకోవడం వల్ల కూడా పరిశోధకుడు సరైన ఊహాప్రతిపాదనను ఏర్పరచుకోవచ్చు.

### 5.5.6. వైజ్ఞానిక దృక్పథం

పరిశోధకుడు తరతరాలుగా వస్తున్న గుడ్డినమ్మకాలకు స్వస్తిచెప్పి వైజ్ఞానిక దృక్పథంతో సమస్యను పరిశీలించాలి. ప్రతి చిన్న విషయాన్ని హేతుబద్ధంగా ఆలోచించి కార్యకారణ సంబంధాన్ని అన్వేషించాలి. ఈ విధంగా పరిశోధకుడు వైజ్ఞానిక దృక్పథం కలిగివున్నపుడు సరైన ఊహాప్రతిపాదన రూపొందించవచ్చు.

## 5.6. ఊహాప్రతిపాదన ప్రామాణ్య నిరూపణ

ఏ విషయాన్నైనా పరీక్షించి చూడకుండ ఉచితమైనదనే నిర్ణయానికి రావడాన్ని విజ్ఞాన శాస్త్రం అంగీకరించదు. తాత్కాలికమైన ఊహాలద్వారా రూపొందింపబడినదే ఊహాప్రతిపాదన. కాబట్టి దానినే వాస్తవంగా భావించకూడదు. పరిశోధన ప్రయాణంలో ఏర్పరచుకొన్న ఊహాప్రతిపాదన మార్పులకు చేర్పులకు లోనుకావచ్చు. ఊహాప్రతిపాదనను విభిన్న రీతులలో పరీక్షించి దానిని క్రియాశీలకమైనదిగాను, ప్రయోజనకరమైనదిగాను ఉండేటట్లు కట్టుదిట్టంగా రూపొందించాలి. అందులోని పదాలు సూటిగాను, స్పష్టంగాను ఉండేటట్లు చూసుకోవాలి.[6]

ఊహాప్రతిపాదనను వాస్తవమని భావించి దానినే నిరూపించాలి అనే ఉద్దేశంతో పరిశోధకుడు పరిశోధనను ప్రారంభించకూడదు. పరిశోధన ప్రయాణంలో అవి నిరాకరింపబడవచ్చు. అప్పుడే అది శాస్త్రీయ పరిశోధన అవుతుంది. "నీ పరిశోధన సరియైనదని ఇతరులు చెప్పినప్పటికీ తప్పు అని నిరూపించటానికి ప్రయత్నించమని నేను చెబుతాను"[7] అని Pasteur చెప్పిన మాటలను ఇక్కడ గుర్తుంచుకోవాలి. ఊహాప్రతిపాదనను పరీక్షించి తెలుసుకోవడానికి ముందు దాన్ని గురించి Robert Bales వెలిబుచ్చిన ఈ క్రింది ప్రశ్నలను పరిశోధకుడు గుర్తుంచుకోవాలి.[8]

5.6.1. ప్రయోగార్హమైనదిగా, కచ్చితమైన పదజాలంతో కూడినదిగా ఉన్నదా? సాధారణ పరిస్థితుల్లో భావాలనుకాని, పరివర్తనాంశాలనుగాని వేరుపరచటానికి వీలవుతుందా?

5.6.2. పరివర్తనాంశాల మధ్యగల సంబంధం ప్రయోగపద్ధతి పరిశోధనల ద్వారా నిర్ధారింపబడినదా? లేక నిరాకరించబడినదా?

5.7.6. వాస్తవాలను గుర్తించగల నైపుణ్యాన్ని ప్రసాదిస్తుంది. పరిశోధకుని సామాన్య దృష్టికి అందని అంశాలను గుర్తుచేస్తుంది.

5.7.7. గమ్యాన్ని స్పష్టంగా, ఖచ్చితంగా నిర్దేశిస్తుంది. దీని ఆధారంగా పరిశోధకుడు విషయసామగ్రి సేకరణ చేయగలుగుతాడు.

5.7.8. సంబంధిత విషయాలను ఒకచోట చేర్చి వాటిని ఒక ప్రత్యేక అంశంగా రూపొందించటానికి తోడ్పడుతుంది.

5.7.9. పరిశోధన సమస్యను మరింత స్పష్టంగా అర్థం చేసుకోవడానికి దోహదం చేస్తుంది. సమస్య పరిష్కారానికి ఉపకరించే సాధారణ పద్ధతులను తెలియజేస్తుంది.

5.7.10. తను రూపొందించుకొన్న ఊహాప్రతిపాదన ఆధారంగా విషయ సామగ్రిని విశ్లేషించుకోవచ్చు. దీని ఆధారంగా సంతృప్తికరమైన పరిశోధన ఫలితాలను రేఖామాత్రంగా చెప్పవచ్చు.

## 5.8. ఉపసంహారం

వైజ్ఞానిక పద్ధతిలో పరిశోధనను సాగించాలనుకొన్న పరిశోధకుడు తప్పనిసరిగా ఊహాప్రతిపాదనను రూపొందించుకోవాలి. ఊహాప్రతిపాదన తోడ్పాటుతో పరిశోధకుడు తన పరిశోధన కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగించగలుగుతాడు.

REFERENCES :


1. G. A. Land Berg, "*Social Research*" p. 119. Quoted by T. S. Wilkinson, P. L. Bhandarkar op. Cit. p. 77.
2. T. S. Wilkinson, P. L. Bhandarkar, *Methodology and Techniques of Social Research*, p. 77.
3. M. H. Gopal, *An Introduction to Research Procedure in Social Sciences*, p. 115.
4. C. R. Kothari, *Research Methodology*, p. 255.
5. Kulbir Singh Sidhu, *Methodology of Research in Education* p. 67.
6. P. V. Young, *Scientific Social Surveys and Research* p. 106.
7. Ibid, p. 105.
8. Ibid, p. 107.
9. K. S. Sidhu, *Methodology of Research in Education* pp. 62-63.

# 6. పరిశోధన సామగ్రి సేకరణ

## (COLLECTION OF SOURCE MATERIAL AND DATA)

## 6.1. ప్రవేశిక

పరిశోధన కార్యక్రమంలో విషయ సామగ్రి సేకరణ ముఖ్యమైన అంశం. శారీరక శ్రమ, మానసిక శ్రమ రెండూ ఇక్కడ అవసరమే. పరిశోధన విజయవంతం కావాలంటే పరిశోధకుడు శ్రమకోర్చి తనకు కావాల్సిన సమాచారాన్ని సేకరించాలి. వేమన పద్యాల్ని గురించి పరిశోధన చేయాల్సి ఉన్నప్పుడు మొదట వేమన పద్యాలను సేకరించి అవి వేమనవేనా అన్న విషయాన్ని ధ్రువపరచుకోవాలి. తర్వాత వాటిని వర్గీకరించి వేమన తాత్త్విక దృక్పథాన్ని గుర్తించి ఆయన సిద్ధాంతాలను వెల్లడి చేయాలి. అలా కాకుండా వేమనపై వచ్చిన వ్యాసాలను నాలుగైదింటిని దగ్గర పెట్టుకొని దానిలో కొంత దీనిలో కొంత తీసి 'థీసిస్'ను తయారు చేస్తుంటారు కొందరు. ముందే వెలువడిన కొన్ని వ్యాసాలను దగ్గర పెట్టుకొని ఒక కొత్త వ్యాసాన్ని తయారు చేసే 'విద్వాంసులు' మరి కొందరు. వీరికి విషయ సామగ్రితో పనే లేదు. నిజమైన పరిశోధకుడు తానే స్వయంగా విషయ సామగ్రి కోసం అన్వేషణ సాగిస్తాడు. నిరంతరం పరిశోధనపై దృష్టిని కేంద్రీకరించి తనకు కావాల్సిన విషయాలను సేకరించడానికి ప్రయత్నిస్తాడు. పరిశోధకుని పరిశోధన ఫలితాలు అతడు సేకరించిన విషయ సామగ్రి మీద ఆధారపడి ఉంటాము.

## 6.2. పరిశోధన సామగ్రి-వివిధ ఆకరాలు

విషయ సామగ్రికోసం మనం అన్వేషించే వివిధ అంశాలే మూల ఆకరాలు. అది ఒక గ్రంథమో! శాసనమో! దస్తావేజో! పత్రికో! ఉత్తరమో! కావొచ్చు. లేదా అది మరే ఇతర రూపంలోనో ఉండొచ్చు. వీటినుండి ఆకరాలు లేక ఆధారాలను గ్రహించడంవల్ల ఇవి మూల ఆకరాలవుతున్నాయి.

పరిశోధకుడు సిద్ధాంత వ్యాస ప్రారంభంలో మూల ఆకరాలు ఏవి? అవేవి వివరంగా చెప్పాలి. ఉదాహరణకు స్థల నామ పరిశోధకుడు ఆ ప్రాంతా

నికి సబంంధించిన చరిత్ర, శాసనాలు, ఊర్ల పేర్ల పట్టికలు, జనాభా లెక్కలు, క్షేత్ర పర్యటన వివరాలు - ఈ విధంగా తాను సేకరించిన వివిధ ఆకరాలను వివరించాల్సి ఉంటుంది. గ్రంథ పరిశోధకుడు మూల గ్రంథాలను, సహాయక గ్రంథాలను పేర్కొనాలి. క్షేత్ర పరిశోధనల్లో జానపద గేయాలనో లేక ఆ ప్రాంత వ్యవసాయ పదాలనో సేకరించినప్పుడు అవి ప్రధాన ఆకరాలవుతాయి. ప్రశ్నావళి, సందర్శనం పద్ధతి, వ్యక్తిగత చరిత్రలు మొదలైనవన్నీ ప్రధాన ఆకరాలుగా పేర్కొంటాం. ప్రధాన ఆకరాలతో సంబంధముండి మనకు తోడ్పడేవి ద్వితీయ ఆకరాలవుతాయి. కొంతవరకు మార్గదర్శకాలుగా ఉన్న సామాన్యమైన వాటిని తృతీయ ఆకరాలని చెప్పవచ్చు.

### 6.2.1. ప్రధాన ఆకరాలు
(Primary Sources)

ప్రత్యక్ష ఆధారాలను, ఆధారభూతమైన విషయాలను ప్రధాన ఆకరాలని అంటారు. తామే నేరుగా అన్వేషించి చూసిన, ప్రయోగపూర్వకంగా గ్రహించిన పత్యక్ష ఆధారాలే ప్రధాన ఆకరాలవుతాయి.

"కవిత్రయ భారతంలో దుర్యోధనుడు" అనే పరిశోధనకు కవిత్రయ విరచిత మహాభారతం ప్రధాన ఆకరమవుతుంది. శాస్త్ర పరిశోధనల్లో తామే ప్రయోగశాలల్లో ప్రయోగాల ద్వారా కనుగొన్న అంశాలు ప్రధాన ఆకరాలవుతాయి. సామాజిక విజ్ఞానం, భాషా పరిజ్ఞానం, జానపద విజ్ఞానం మొదలైన పరిశోధనల్లో క్షేత్ర పర్యటన ద్వారా సేకరించిన విషయాలు ప్రధాన ఆకరాలవుతాయి. సందర్శన పద్ధతి, ప్రశ్నావళులు, డైరీలు, ప్రత్యక్షంగా చూసిన సంఘటనలు, జీవిత చరిత్రలు మొదలైనవన్నీ దీనిలో చేరుతాయి. పార్లమెంటు కార్యకలాపాలు, న్యాయస్థానం తీర్పులు, ప్రభుత్వ ప్రకటనలు, ముసాయిదాలు, శాసనాలు, ప్రభుత్వ గణాంక వివరాలు మొదలైన వాటిని కూడ ప్రధాన ఆకరాలుగా పరిగణించవచ్చు.

### 6.2.2. ద్వితీయ ఆకరాలు
(Secondary Sources)

ప్రధాన ఆకరాల ఆధారంగా రాసిన విషయ సంగ్రహాలు, అనువాదాలు, వ్యాసాలు, విజ్ఞాన సర్వస్వాలు, ఉపన్యాసాలు మొదలైనవన్నీ ద్వితీయాకరాలలో చేరుతాయి. Ph.D., M.Phil సిద్ధాంత వ్యాసాలు, ఒక ప్రత్యేక విషయం గురించి రాసిన పుస్తకాలు (Monographs) పరిశోధనాంశానికి సంబంధించిన తదితర గ్రంథాలను ద్వితీయాకరాలుగా భావించవచ్చు.

విషయ సామగ్రి

గ్రంథస్థ ఆకరాలు

క్షేత్రపర్యటన ఆకరాలు

పరిశీలన

ప్రశ్నావళి

సందర్శన పద్ధతి

గ్రంథ సూచి

పత్రికలు

విషయ సంగ్రహాలు

ప్రభుత్వ గణాంక వివరాలు

సమాచార గ్రంథాలు సంవత్సరాదులు

విజ్ఞాన సర్వస్వాలు

నిఘంటువులు

ఇతరాలు

### 6.2.3. తృతీయ ఆకరాలు (Tertiary Sources)

పాఠ్య పుస్తకాలు, పత్రికలు, సామాన్య వ్యాసాలు, ప్రత్యక్షంగా సంబంధం లేని ఇతర గ్రంథాలు మొదలైనవన్నీ ఇందులో చేరతాయి.

వివిధ ఆకరాల ద్వారా సేకరించిన విషయ సామగ్రిని రేఖాచిత్రాలలో చూపిన విధంగా విభజించవచ్చు.[1]

## 6.3. గ్రంథాలయాలు

గ్రంథాలయం ఒక విజ్ఞాన భాండాగారం. అంతులేని విజ్ఞాన సంపదల కిది రత్నాకరం. పరిశోధకుడికి గ్రంథాలయాలకు సంబంధించిన అన్ని వివరాలు తెలిసి ఉండాలి. పరిశోధనాంశానికి సంబంధించిన పుస్తకాలను ఎలా గుర్తించాలో, వాటినెలా ఉపయోగించుకోవాలో తప్పనిసరిగా తెలిసి ఉండాలి. ఈ నైపుణ్యం లేనప్పుడు పరిశోధకుడు అడవిలో దారితప్పిన వేటగాడవుతాడు.

పరిశోధకుడు ఈ క్రింది అంశాలలో నైపుణ్యం కలిగివున్నపుడు అతడు గ్రంథాలయాలను సమర్థవంతంగా ఉపయోగించుకోగలుగుతాడు :

1. ఆకారాలను నేరుగా తెలుసుకునే నైపుణ్యం.
2. వివిధ ఆకరాలను పరిశీలించగల నైపుణ్యం.
3. కావల్సిన విషయాలను ఎన్నుకునే నైపుణ్యం.
4. సేకరించిన విషయాలను వర్గీకరించే నైపుణ్యం.
5. వ్యాఖ్యానించడంలో నైపుణ్యం.

గ్రంథాలయాల్లో సమాచారాల్ని సేకరించాలంటే పరిశోధకుడు ఈ క్రింది వాటిపై ఆధారపడాలి :

1. ఆకారాది పట్టికలు (Card Catalogue)
2. విషయ సూచికలు (Index)
3. సంప్రదింపు గ్రంథాలు (Reference Books)

### 6.3.1. అకారాది పట్టికలు

వీటిని కార్డుల రూపంలో అకారాది వరుసలో అమర్చి ఉంటారు. సాధారణంగా ఈ కార్డులు 3×5 అంగుళాల సైజులో ఉంటాయి. రచయితల పేర్లను బట్టి, పుస్తకాల పేర్లను బట్టి, విషయాలను బట్టి ఈ కార్డులను మూడు విధాలుగా పేర్చుతారు. పరిశోధకుడు గ్రంథాలయంలో తనకు కావాల్సిన ఏ పుస్తకాన్నైనా ఈ కార్డుల సహాయంతో వెంటనే గుర్తించవచ్చు.

### 6.3.2. విషయ సూచికలు

పత్రికల్లో వచ్చే వ్యాసాల పట్టికలు అకారాది క్రమంలో కార్డుల రూపంలో

అమర్చి ఉంటారు. వీటినే విషయ సూచికలు అంటారు. ఇవి కూడా పుస్తకం పేరునుబట్టి, రచయిత పేరునుబట్టి, విషయాన్నిబట్టి మూడురకాలుగా విభజింపబడి ఉంటాయి.

### 6.3.3. సంప్రదింపు గ్రంథాలు

విజ్ఞాన సర్వస్వాలు, సమాచార సూచికలు, జిల్లా చరిత్రలు మొదలైనవి వీటిలో చేరుతాయి. వీటిలో ఒక విషయానికి సంబంధించిన సమాచారం సంగ్రహంగా వివరింపబడి ఉంటుంది. నిఘంటువులు, వివిధ పదకోశాలు కూడా పరిశోధకుడికి ఎంతగానో ఉపయోగపడ్తాయి. ఒక పదం వ్యుత్పత్తి, తదితర భాషల్లో పోలిక పదాలు, ఉచ్చారణ విధానం, అర్థ విపరిణామం మొదలైనవన్నీ వీటిద్వారా తెలుసుకోవచ్చు.

## 6.4. ఉపయుక్త గ్రంథసూచి

పరిశోధకుడు పరిశోధనను కొనసాగిస్తూనే గ్రంథసూచిని తయారుచేసుకోవాలి. మూడంగుళాల వెడల్పు ఐదంగుళాల పొడవున్న కార్డులే పరిశోధకుడికి అనుగుణంగా ఉంటాయి. విషయసేకరణ చేస్తున్నప్పుడు ఒక్కొక్క పుస్తకాన్ని గురించి పూర్తి వివరాలు ప్రత్యేకంగా ఒక్కొక్క కార్డులో రాసుకోవాలి. విడి కాగితాల్లోగాని, నోటుపుస్తకాల్లోగాని రాయడం మంచిదికాదు. శాస్త్రీయ పరిశోధన పద్ధతికిది విరుద్ధం. కార్డుల్లో రాయడంవల్ల తరువాత వాటిని అకారాది క్రమంలో అమర్చడానికి అనుకూలంగా ఉంటుంది. కొత్తగా పుస్తకాల పేర్లను చేర్చడానికి, చేర్చిన కొన్ని పేర్లను పరిహరించడానికి కూడా ఈ కార్డుల పద్ధతే అనుకూలంగా ఉంటుంది. పుస్తకాల పేర్లను రాసే పద్ధతికి, పత్రికల్లో వచ్చిన వ్యాసాలను రాసే పద్ధతికి ఈ రెంటికీ గల భేదాలు తెల్సి ఉండాలి. అలాగే ముద్రిత, అముద్రిత సిద్ధాంత వ్యాసాలను రాయడంలో కూడా కొంత భేదం ఉంది. పరిశోధకుడు తన పరిశోధనకు ఉపయోగించిన అన్ని పుస్తకాలను వదలకుండా ఉపయుక్త గ్రంథ పట్టికలో చేర్చాలి. (చూ. అధ్యాయం 11) ఉపయుక్త గ్రంథ పట్టికలలో ఈ క్రింది వివరాలను పొందుపరచాలి :

6.4.1. గ్రంథకర్త పేరు మొదట ఉండాలి. కొన్ని సందర్భాల్లో సంపాదకుడి పేరుగాని, సంకలనకర్త పేరుగాని ఉండొచ్చు. గ్రంథకర్త పేరు రాసేటప్పుడు మొదట అసలు పేరు తర్వాత ఇంటిపేరు రాయాలి. పుస్తకంలో ఏ విధంగా రాసి ఉందో ఆ విధంగానే రాయాలి. మార్చిరాయకూడదు.

గ్రంథకర్త సంపాదకుడైనప్పుడు (సం.) అనీ, సంకలనకర్త అయి

నప్పుడు (సంక.) అనీ, అనువాదకర్త అయినప్పుడు (అను.) అని రాయవలసి ఉంటుంది.

6.4.2. తర్వాత పుస్తకం పేరును పుస్తకంలో ఉన్నట్లుగానే రాయాలి. గ్రంథం పేరు కింద గీత గీయాలి. లేక వాటిని ఇటాలిక్స్‌లో రాయాలి. వ్యాసమైనప్పుడు దాన్ని కొటేషన్ (Quotation) గుర్తులలో సూచించాలి.

6.4.3. తర్వాత ఆ పుస్తకం ప్రచురణ వివరాలు తెలియజేయాలి. ప్రకటింపబడిన చోటు, సం॥ము గుర్తించాలి. పత్రికలు చాలా సంచికలు వచ్చినప్పుడు ఏ సంచిక అనేది కచ్చితంగా ఆ సంచిక నెంబరు రాయాలి. దినపత్రిక అయితే దినం, మాసం, సం॥ము మొదలైనవి గుర్తించాలి. పుస్తకాన్ని ప్రకటించిన వారి పేరు రాయడం అరుదుగానే ఉంటుంది. కానీ పుస్తకం వెలువడిన ఊరి పేరు, సం॥ము తప్పకుండ గుర్తించాలి. తేది అంటే సాధారణంగా నెల, సం॥ము లేక సంవత్సరాన్ని మాత్రమే సూచిస్తుంది. విరామ చిహ్నాలు గుర్తించడంలో ప్రత్యేక శ్రద్ధ చూపాలి. సంగ్రహాక్షరాల తర్వాత తప్పకుండ విరామ చిహ్నము ఉంటుంది.

## 6.5. సవిమర్శక ఉపయుక్త గ్రంథసూచి (Critical Bibliography)

ఉపయుక్త గ్రంథ పట్టిక కార్డులోనే ఆ పుస్తకానికి సంబంధించిన సంక్షిప్త సమాచారం పొందుపరచబడినప్పుడు అది సవిమర్శక ఉపయుక్త గ్రంథ పట్టిక అవుతుంది. దీనికి పెద్ద సైజు కార్డులు ఉపయోగించాలి. ఈ విధమైన పట్టికలో ఈ క్రింది అంశాలు పొందుపర్చాలి :

6.5.1. గ్రంథకర్త ఆ పుస్తకంలో చర్చించిన అంశం.
6.5.2. పరిశోధనలో అవలంబించిన విధానం.
6.5.3. ఆకరాలు.
6.5.4. విషయ సామగ్రిలో, సిద్ధాంత నిరూపణలో మౌలికత.
6.5.5. పరిశోధన ముఖ్య ఫలితాలు.
6.5.6. వెలువడిన సిద్ధాంతాలు, ఆ పుస్తకం గురించిన ముఖ్యాంశాలు.

## 6.6. పరిశోధన సమాచారం రాసుకొనే విధానం

పరిశోధకుడు పుస్తకాలను పరిశోధన దృష్టితో చదవాలి. చదువుతున్నప్పుడు తన పరిశోధనకు ఉపకరించే అంశాలను రాసుకోవాలి. పుస్తకాలను చదివి తన పరిశోధనకు సంబంధించిన నోట్సు రాసుకోవడంలో వైజ్ఞానిక పద్ధతి పాటించాలి.

ఈ విధంగా ముఖ్యమైన సమాచారం ఎత్తి రాసుకోవడంలో పూర్వం నోటుపుస్తకాలను ఉపయోగించేవారు. లేకపోతే విడి కాగితాలను వాడేవారు. కాని ఇది మంచి పద్ధతికాదు. ఒక్కో విషయానికి ఒక్కో కార్డు ఉపయోగించడం సరైన పద్ధతి. ఎంత విషయ సామగ్రి లేక ఎన్ని అంశాలు సేకరించామో పరిమాణం తెలుస్తుంది. అనవసర విషయాలను పరిహరించడానికి లేక అవసర విషయాలను మధ్యలో చేర్చడానికి ఈ పద్ధతి ఉపయోగపడుతుంది. కార్డుల్లో ఉండడంవల్ల వాటిని వరుసలో పెట్టడానికి, మార్చిపెట్టడానికి, విషయాన్ననుసరించి వర్గీకరించడానికి వీలౌతుంది. ఈ పద్ధతివల్ల సిద్ధాంత వ్యాసం ఒక మామూలు వ్యాసంలాగ కాకుండా కార్యకారణాల్ని నిరూపించే ఒక సిద్ధాంతంలాగా రూపొందుతుంది.

## 6.7. నోట్సు రాసుకోవడంలో కొన్ని మెలకువలు

నోట్సు రాసుకోవడంలో ఎంతో జాగ్రత్త కనబర్చాలి. ఇలా జాగ్రత్త కనబర్చకపోతే ఎంతో కష్టపడి పుస్తకం చదివి నోట్సు రాసుకున్న తర్వాత కొంత కాలానికి అది పరిశోధకుడికి అర్థం కాకుండా అస్పష్టంగా ఉండిపోతుంది. ఎందుకు రాసుకున్నామో? ఎక్కడ నుండి తీసుకున్నామో? దాని ఉపయోగమేమిటో మర్చిపోయే ప్రమాదముంది. నోట్సు రాసుకొనేటప్పుడు పరిశోధకుడు ఈ క్రింది అంశాలను దృష్టిలో ఉంచుకోవాలి :

6.7.1. నోట్సు రాసుకొనే ముందు విషయసామగ్రిని పర్యాలోచించాలి.

6.7.2. ముఖ్యమైన అంశాలను గుర్తించి రాసుకోవడంలో అనుభవం సంపాదించాలి.

6.7.3. 10×15 సెం.మీ. కార్డులే ఉపయోగించాలి.

6.7.4. ఒక కార్డులో ఒక అంశం మాత్రమే రాయాలి.

6.7.5. కార్డులను ప్రత్యేక శీర్షికల క్రింద అమర్చాలి.

6.7.6. వెంటనే తెలుసుకొనేటందుకు వీలుగా విషయ శీర్షికను కార్డు పైభాగంలో రాయాలి.

6.7.7. ఉపయుక్త గ్రంథ వివరాలను కార్డు క్రింద ఇవ్వాలి.

6.7.8. విషయాన్ని బాగా అవగాహన చేసుకొని స్పష్టమైన వాక్యాలతో నోట్సు రాసుకోవాలి.

6.7.9. సారాంశానికి, కొటేషన్‌కు, భావార్థానికి స్పష్టమైన భేదం చూపాలి.

6.7.10. కార్డుల్లో ఒకేసారి స్పష్టంగా నోట్సు రాసుకోవాలి. మరోసారి వాటిని కాపీ చేసే ఉద్దేశంతో రాయకూడదు. సమయం వ్యర్థం కావడమే కాక పొరబాట్లు జరగవచ్చు. తిరిగి రాయడంలో సందేహాలేర్పడవచ్చు.

6.7.11. రాసుకొన్న కార్డులను జాగ్రత్తగా ఫైల్లో పెట్టాలి. లేకపోతే అవి తారుమారు కావొచ్చు. లేదా ఎక్కడో జారిపోవచ్చును. పరిశోధకుడు ఫైలుమీద తన పేరు, అడ్రసు మొదలైన వివరాలు అన్నీ పొందు పర్చాలి.

6.7.12. ఖాళీ కార్డులను ఎప్పుడూ దగ్గర ఉంచుకోవాలి. ఏవైనా క్రొత్త ఆలోచ నలు వచ్చినపుడు వెంటనే కార్డులో రాసుకోవచ్చు.

6.7.13. కార్డుల క్రింద పెన్సిల్‌తో లేదా మరో రంగు సిరాతో పరిశోధకుడు తన అభిప్రాయాలను, సందేహాలను రాసుకోవాలి.

6.7.14. నోట్సు రాసిన కార్డులను తరచు చదువుతూ ఉండాలి. అప్పుడే వాటి ఉపయోగం తెలుస్తుంది.

## 6.8. పరిశోధన సమాచారం-విభాగాలు

పరిశోధకుడు సేకరించిన సమాచారాన్ని నాలుగు భాగాలుగా విభజింప వచ్చు :

### 6.8.1. ఉదాహృతం

(Quotation)

గ్రంథకర్త చెప్పిన విషయాలను యథాతథంగా అలాగే చెప్పడం.

### 6.8.2. భావార్థం

(Paraphrase)

పరిశోధకుడు గ్రంథకర్త ఆలోచనలను, ఉద్దేశాలను తన మాటల్లో చెప్పడం.

### 6.8.3. సారాంశం

(Summary)

ఒక విషయాన్ని చదివి అందులోని ముఖ్యాంశాలను మాత్రం సంక్షిప్తంగా చెప్పడం.

### 6.8.4. మూల్య నిర్ధారణ

(Evaluation)

పరిశోధకుడు తన దృక్పథంతో విషయాలను విశ్లేషించి వాని విలువలను నిర్ణయించడం.

## 6.9. విషయసేకరణలో జాగ్రత్తలు

పరిశోధకుడు విషయ సేకరణ చేస్తున్నప్పుడు ఈ క్రింది విషయాలను గుర్తుంచుకోవాలి :

6.9.1. పరిశోధనాంశానికి సంబంధించిన సాహిత్యం చదువుతున్నప్పుడు తన పరిశోధన ఉద్దేశం, లక్ష్యాలు సదా మనసులో మెదులుతూ ఉండాలి.

6.9.2. పరిశోధనకు ఉపకరించిన ప్రతి పుస్తకాన్ని ప్రతి వ్యాసాన్ని ఉపయుక్త గ్రంథ పట్టికలో చేర్చాలి.

6.9.3. ఉపయుక్త గ్రంథ పట్టికను తయారుచేయడంలో జాగ్రత్త వహించాలి.

6.9.4. కావాల్సిన విషయాన్ని సేకరించడానికి కొంతకాలాన్ని వెచ్చించాలి.

6.9.5. అందుబాటులోవున్న అన్ని గ్రంథాలయాలను దర్శించాలి. అవసరమైనప్పుడు ఫోటోస్టాట్ కాపీలు తీసుకోవడం మంచిది.

6.9.6. విషయ సేకరణలో ఆధునిక విజ్ఞాన పద్ధతులను పాటించాలి.

6.9.7. వ్యాస సారాంశం మొదట చదవాలి.

6.9.8. నోట్సు రాసుకోవడంలో సంక్షిప్తత పాటించాలి.

6.9.9. విషయాన్ని విశ్లేషించి పరిశోధనలో అదెంతవరకు ఉపకరిస్తుందో చూడాలి.

6.9.10. పరిశోధనకు తోడ్పడే ఉదాహృతాలను మాత్రమే స్వీకరించాలి.

## 6.10. ఉపసంహారం

ఇంతవరకు చెప్పినవి చాలావరకు గ్రంథస్థ పరిశోధనకు సరిపోతాయి. క్షేత్ర పరిశోధనలో పరిశీలన, ప్రశ్నావళి, సందర్శన పద్ధతి, వ్యక్తిగత చరిత్రలు మొదలైనవి చేరుతాయి. ముందు ప్రకరణాల్లో వాటిని గురించి చూద్దాం.

REFERENCE :


1. B. C. Tandon, *Research Methodology in Social Sciences*, P. 67.

# 7. పరిశీలన

## (OBSERVATION)

## 7.1. ప్రవేశిక

పరిశోధన ప్రపంచంలో 'పరిశీలన' చాలా ముఖ్యమైన అంశం. పరిశీలన వల్లనే సాంఘిక సమస్యలు గుర్తించటం వాటికి పరిష్కారాలు కనుగొనటం జరిగింది. ఆనాటి సంఘంలో వితంతువుల దీనస్థితిని కళ్ళారా చూసిన వీరేశ లింగంగారు వారి అభ్యుదయానికి తన జీవితాన్ని ధారపోశారు. సతీ సహగమనాన్ని ప్రత్యక్షంగా చూచిన రాజారామమోహనరాయ్ ఆ దురంతాన్ని రూపుమాపడానికి ప్రయత్నించారు. జ్ఞానేంద్రియాల సహాయంతో సంపాదించుకున్న విజ్ఞానమే పరిశీలన. ప్రాథమిక .పరిశోధన సాధనాల్లో పరిశీలన ముఖ్యమైంది. మానవుడు విజ్ఞానాన్వేషణలో ప్రప్రథమంగా పరిశీలన పద్ధతిని అనుసరించాడు. విషయ సామగ్రి సేకరణలో ముఖ్యంగా క్షేత్ర పర్యటనలో ప్రత్యక్ష పరిశీలన పద్ధతి పాటించడం వలన మంచి ఫలితాలను ఎదురుచూడవచ్చు. కొన్నిరకాల విషయ సామగ్రి సేకరణ పరిశీలనవల్ల మాత్రమే సాధ్యమవుతుంది.

## 7.2. అర్థ వివరణ

ఒక ప్రత్యేక దృష్టిని మనసులో ఉంచుకొని ఒక విషయాన్ని నిశితంగా చూడడమే 'పరిశీలన'. సాధారణ దృష్టికి ఇది పూర్తిగా భిన్నమైంది. ఏదైనా ఒక ప్రత్యేక ఉద్దేశంతో పరిశీలన సాగించడమే దీని ప్రధాన లక్ష్యం.

"ఒక అంశాన్ని పూర్తిగానూ నిశితంగానూ చూడటం, చూస్తున్నప్పుడు ఒక ప్రత్యేక ఉద్దేశంతో చూడటం, చూస్తున్నవారు తాము అందులో పూర్తిగా లీనం కాకుండా చూడటం" అని పరిశీలనకు నిర్వచనం చెప్పాడు ఎమ్. హెచ్. గోపాల్.[1] పరిశోధకుడు తానే స్వయంగా ప్రత్యక్ష పద్ధతిలో విషయసామగ్రిని సేకరించడం పరిశీలన క్రిందకే వస్తుంది. పరిశీలన అంటే పంచేంద్రియాలద్వారా తెలుసుకుంటున్న జ్ఞానం. కన్ను, చెవి మొదలైనవి ఉపయోగించి తెలుసుకొనదగిన ప్రజ్ఞావిశేషాలే పరిశీలన.

Concise Oxford Dictionary లో పరిశీలన పదానికి "The observation is accurate watching and nothing of phenomenon as they occur in nature in which regard to cause and effect mutual relations" అని అర్థం చెప్పబడింది.

P.V. Young అనే సామాజిక శాస్త్రవేత్త "The observation is a systematic and deliberate study through the eye of spontaneous occurances at the time they occur"[2] అని పరిశీలనకు నిర్వచనం చెప్పాడు.

మానవుడు ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడుతున్న సాధనం పరిశీలన. శాస్త్ర పరిశోధనల్లో చాలాకాలంనుండి ప్రయోగంలో ఉన్న పద్ధతి ఇది.

## 7.3. పరిశీలన లక్షణాలు
(Characteristics of observation)

### 7.3.1. నిర్మాణాత్మకం
(Systematic)

కంటికి కనిపించిందల్లా కలగూరగంపగా రాశి పోసుకోవడం కాదు పరిశీలన. అది నిర్మాణాత్మకంగా ఉండాలి. పరిశీలన ధ్యేయం ఏమి? ఎంత కాలం సాగుతుంది? దాని నిర్వహణను కొనసాగించే విధానాలు ఏవి? పరిశీలన ప్రయాణంలో ఎన్ని మజిలీలు అవసరం? — మొదలైన నియమాలు క్షుణ్ణంగా తెలిసి వుండాలి.

### 7.3.2. విశిష్టాంశ దర్శనం
(Specific)

పరిశీలనకు సామాన్య అవగాహన మాత్రమే చాలదు. దానితోబాటు ఒక విశిష్టాంశ దర్శనం కావాలి. ఒక సన్నివేశాన్ని తిలకిస్తూ అందులోనే ఒకానొక ప్రత్యేకాంశాన్ని అన్వేషించినప్పుడే అది పరిశీలన అవుతుంది. వైద్యుడు అరణ్యమంతా చూచినప్పటికీ, తనకు కావలసిన తీగ కోసమే వెదుకుతాడు గదా! పరిశీలనలో పరాంశాలకు లొంగని బలీయమైన దీక్ష ఉండాలి.

### 7.3.3. వస్త్వాశ్రయం
(Objective)

పరిశీలన వస్త్వాశ్రయంగా ఉండాలి. పరిశోధకుడు పరిశీలన విషయంలో చిత్తశుద్ధి కలిగివుండడం తప్పనిసరి. ఆతడు రాగద్వేషాలతో, ఆత్మాశ్రయ

భావాలతో (Subjective sentiments) ముందుగానే పొందు పరచుకొన్న అభిమాన దురభిమానాలతో, పరిశీలనకు దిగితే అది పక్షపాతానికి దారితీసే ప్రమాదం ఉంది. వాస్తవాన్ని అతడు కనుక్కోలేడు. కాబట్టి ఆత్మాభిమానాలకు అతీతుడుగా, ఊహాప్రతిపాదన మేరకు సత్యాన్వేషణా జిజ్ఞాసతో, పరాశ్రయ దృక్పథంతో పరిశీలనకు ఉద్యమించాలి.

## 7.3.4. గుణం కాదు గణం
(Not Quality but Quantity)

ఒక విషయాన్ని పరిశీలించినపుడు అది ఎలా జరిగింది? అని అడగకూడదు. ఎన్నిసార్లు జరిగింది? అని అడగాలి. 'ఎలా' అన్నప్పుడు అది ఆత్మాశ్రయ భావాలకు దారితీస్తుంది. కాని 'ఎన్నిసార్లు' అన్నప్పుడు అది వస్త్వాశ్రయ పరిగణనకు దోహదం చేస్తుంది. పరిశీలనకు కావలసింది ఒక విషయం యొక్క గుణము కాదు, గణమే. ఉదా॥ 'ఆ పండుగ ఎలా జరిగింది?' అని అడిగితే, 'బాగా జరిగింద'నో 'బాగోలేద'నో సమాధానం వస్తుంది. అది ఆయా వ్యక్తుల స్వీయ అనుభూతులనుబట్టి ఉంటుంది. కాని 'ఆ పండుగ ఎన్నిసార్లు జరిగింది?" అంటే దానికి సమాధానం ఒకటే గదా!

## 7.3.5. అక్షర రూపం ధరించాలి
(Recorded immediately)

పరిశీలనలో లభించిన విషయాలను వెంట వెంటనే రాసి పెట్టుకోవాలి. ఈ విషయంలో జ్ఞాపకశక్తిమీద ఆధారపడి ఉండకూడదు. మతిమరుపువల్ల పరిశీలన ఫలితం కుంటుపడే ప్రమాదం ఉంది. అలాంటి అసంగతాన్ని అధిగమించడానికి అక్షర రూపమే అక్షయ పాత్రం.

## 7.3.6. కుశలత
(Expert)

లాటిన్‌లో "Experiri" అంటే ప్రయత్నించటం అని అర్థం. దీని నుంచి "Expert" అనే పదం ఆంగ్లంలో వచ్చింది. పరిశీలనకు పూనుకొన్నవాడు నిర్విరామ కృషి చెయ్యాలి. వివిధ దృక్కోణాలనుంచి పరిశోధన విషయాన్ని వీక్షించి, పరీక్షించే పరిజ్ఞానం కలిగివుండాలి. అందులోని పూర్వాపరాలను గ్రహించి, ముందు జాగ్రత్తతో రాబోయే అవకతవకలను అరికట్టాలి. అందులోని సార్థకాన్ని అనర్థకం నుండి, అనుకూల అంశాల్ని అనుకూల అంశాల నుండి, అసలును నకిలీనుండి, అంతస్సారాన్ని బాహ్యంనుండి విశ్లేషించే కుశలత అతనికి ఉండాలి.

### 7.3.7. పరీక్షోన్ముఖం
(Verifiable)

పరిశీలన ఫలితాన్ని నిశితంగా పరీక్షించి దాన్ని నిర్దోషంగా నిర్ధారించాలి. అది ఈ క్రింది పరీక్ష త్రయానికి నిలబడుతుందా అని వివేచించాలి :

1. లభ్యమైన ఫలితం నమ్మతగినదా? (Reliability)
2. ఊహాప్రతిపాదనకు తగినట్లుందా? (Validity)
3. ఉపయోగార్హమైనదిగా ఉందా? (Usability)

ఇదివరకు వెలువడిన ఇతర పరిశోధన ఫలితాలతో, ప్రస్తుత ఫలితాల ప్రామాణ్యతను స్థాపించాలి.

## 7.4. పరిశీలనలో ముఖ్యాంశాలు

పరిశీలనలో ప్రధానంగా మూడు ముఖ్యాంశాలున్నాయి :

### 7.4.1. ఇంద్రియ విజ్ఞానం
(Sense perception)

పంచేంద్రియాలవల్ల ఇది సిద్ధిస్తుంది. విషయాలను తెలుసుకోవడానికి వాస్తవాలను నిర్ధారించుకోవడానికి పంచేంద్రియాల సహాయం పరిశీలకుడికి అవసరం.

### 7.4.2. అవధానం
(A tention)

పరిశోధనాంశానికి సంబంధించిన వివిధ ఆకరాలను తెలుసుకోవడంలో అవధానం ఉండాలి. అలాగే సేకరించిన విషయాలలో, సత్యాసత్యాల నిర్ణయాలలో అవధానం కల్గి ఉండాలి.

### 7.4.3. గ్రహణశక్తి
(Perception)

ప్రజ్ఞా విశేషాలతో పరిశోధన విషయంలో స్పష్టమైన అవగాహన కలిగి ఉండడాన్ని గ్రహణశక్తి అనవచ్చు. ఇది ప్రజ్ఞాశక్తి ఊహాశక్తుల సంకీర్ణం అని గమనించాలి.

## 7.5. పరిశీలన విభాగాలు

వైజ్ఞానికంగా పరిశీలనను ఇట్లా విభజింపవచ్చు. అవి :

### 7.5.1. వైయుక్తికం, అవైయుక్తికం
(Participant and Non - Participant)

### 7.5.2. నియమితం, నియమరహితం
(Controlled and Uncontrolled)

### 7.5.3. రచితం, అరచితం
(Structured and Unstructured)

## 7.6. పరిశీలన విధానం

ఏ విషయంలో అయినా, ఏ క్షేత్ర పర్యటనలో అయినా 'పరిశీలన'లో ఈ క్రింది అంశాలను గమనించాలి.

7.6.1. దేన్ని పరిశీలించాలి?

7.6.2. పరిశీలన ఎలా ప్రారంభించాలి?

7.6.3. పరిశీలనలో ఉపయోగించే పరికరాలు ఏవి?

7.6.4. విషయ సామగ్రిని ఏ విధంగా భద్రపరచాలి?

7.6.5. విషయాలకు ఏ విధంగా అర్థ స్పష్టత ఇవ్వాలి?

7.6.6. సంబంధిత విషయానికి పరిశీలకుడికి గల సంబంధం ఏమిటి?

7.6.7. సంబంధం ఎలా ఏర్పడింది? ఎలా అభివృద్ధి చెందింది?

నిజాయితీతో కూడిన ప్రయత్నం, శారీరక శ్రమ రెండూ ఉన్నప్పుడే పై అంశాలన్నిటికీ సమర్థవంతమైన సమాధానం లభిస్తుంది.

## 7.7. పరిశీలనలో తీసుకోవలసిన జాగ్రత్తలు

7.7.1. పరిశీలించబోయే విషయం, దాని పూర్వాపరాలు, మూలతత్త్వం, విషయ వ్యాప్తి పరిశీలకుడికి తెలిసి ఉండాలి.

7.7.2. జాగ్రత్తగా పరిశీలించి సేకరించిన విషయాలను పదిలపరచాలి. వాటి విలువలను నిర్ధారించాలి.

7.7.3. పరిశీలిస్తున్న విషయాల్లోని చిన్న చిన్న విభాగాలను వాటి ప్రాముఖ్యతను నిర్ణయించాలి. పరిశీలన విధానంలో అవధానం కలిగివుండాలి.

7.7.4. ఏ ఏ సమయాల్లో ఏ ఏ అంశాలను పరిశీలించాలి అని ఖచ్చితంగా నిర్ణయించుకోవాలి. ఆ అంశాలను పరిశీలించడానికి సిద్ధంగా ఉండాలి.

7.7.5. పరిశీలన ఒక వ్యక్తివల్ల జరుగుతున్నదా? లేక సామూహికంగా జరుగుతున్నదా? అని నిర్ధారించుకోవాలి. కొన్ని సందర్భాల్లో సామూహికంగా విషయ సంగ్రహణ కావించడం మంచిది.

7.7.6. పరిశీలనలో సహాయకుల అవసరం వచ్చినపుడు వారికి తగిన శిక్షణ ఇవ్వాలి.

7.7.7. నిజమైన పరిశీలనకు ముందు ఒక పూర్వ పరిశీలన చెయ్యడం మంచిది.

7.7.8. అవసరమైన అన్ని విషయాలను అక్షర రూపంలో పదిల పర్చుకోవాలి. వాటికి notes రాసుకొనే విధానం తెలిసి ఉండాలి. రాస్తున్నప్పుడు సాంకేతిక అక్షరాలను ఉపయోగించి ఆ పిదప నెమ్మదిగా విస్తరించి రాసుకోవచ్చు. భాషా పరిశోధనల్లో tape-recorder ను ఉపయోగించడం మంచిది.

7.7.9. పరిశీలన సమయంలో సమాచారాలందించే వ్యవహర్తలను (informants) ఏ కారణంగానైనా తిట్టడం కాని, అపహాస్యం గాని చెయ్యకూడదు.

7.7.10. క్షేత్ర పర్యటనలో ఉన్నప్పుడు ముఖ్యంగా వ్యవహర్తలతో (informants) ఉన్నప్పుడు తను పరిశీలించే విషయంలో ఎంతో శ్రద్ధను కనపర్చాలి. అన్ని విషయాలను శ్రద్ధగా రాసుకోవాలి. ఆ తర్వాత అనవసర విషయాలను పరిహరించి అవసరమైనవి మాత్రం తీసుకోవచ్చు.

## 7.8. పరిశీలన ప్రయోజనాలు

7.8.1. ఇది చాలా తేలికైన పద్ధతి. అనుసరించడంలో ఎటువంటి ఇబ్బందులు ఉండవు.

7.8.2. పరిశీలించడం అనేది మానవుడికి సహజంగానే అబ్బిన గుణం, కాబట్టి ఈ పద్ధతి పాటించడానికి కొద్ది శిక్షణ ఉంటే చాలు.

7.8.3. తగిన ఊహాప్రతిపాదనను (Hypothesis) రూపొందించుకోవడానికి ఇది తోడ్పడుతుంది.

7.8.4. అంతకుముందు రూపొందించుకున్న ఊహాప్రతిపాదన సరైనదా? కాదా? అని పరీక్షించుకోవడానికి ఇది ఉపకరిస్తుంది.

7.8.5. పరిశోధన ఫలితాలు తృప్తికరంగా వెలువడటానికి తోడ్పడుతుంది.

7.8.6. అన్ని వైజ్ఞానిక పరిశోధనల్లోను ఈ పద్ధతి పాటించడానికి అనుకూలంగా ఉంది.

7.8.7. మిగిలిన పద్ధతుల్లో సేకరించిన విషయ సామగ్రికన్నా పరిశీలన పద్ధతుల్లో సేకరించిన విషయాలు మేలైనవిగాను, నమ్మదగినవిగాను ఉంటాయి.

## 7.9. పరిశీలన పరిమితులు

7.9.1. పరిశీలన క్షేత్రానికి సంబంధించిన అన్ని అంశాలు పరిశీలకుడు తెలుసుకోవడం అసాధ్యం. కాబట్టి పరిశీలన అనేది ఉత్తమమైనదని చెప్పలేము.

7.9.2. పరిశీలకుని స్వీయానుభవాలు, అలవాట్లు పరిశీలనలో తమ ప్రభావాన్ని చూపవచ్చు.

7.9.3. అన్ని సందర్భాలలోను పరిశీలకుడు పాల్గొనబోయే పరిస్థితి ఈ పద్ధతిలో ఉంది.

7.9.4. కొన్ని అనుభూతులను గాని లేదా కొన్ని అంశాలను గాని పరిశీలకుడు ప్రకటించలేకపోవచ్చు.

7.9.5. ప్రత్యేకంగా ఒకవ్యక్తి మాత్రమే పరిశీలనలో పాల్గొనడం వల్ల అతను చెప్పిన విషయాలతో ఆధారపడిన పరిశోధన పూర్తిగా నమ్మదగిన పరిస్థితిలో ఉండకపోవచ్చు.

7.9.6. అధిక వ్యయంతో కూడిన పద్ధతి ఇది.

7.9.7. తన్ను పరిశీలిస్తున్నారన్న స్ఫురణ ఉన్నప్పుడు వ్యవహర్తలు తమ సహజ పద్ధతిని వదలి భిన్నంగా ప్రవర్తిస్తారు. పరిశీలకుడు సేకరించిన విషయాలు వాస్తవానికి దూరంగా ఉంటాయి.

7.9.8. ఈ పద్ధతి అధిక కాల వ్యవధిని తీసుకొంటుంది.

## 7.10. ఉపసంహారం

మొత్తంమీద పరిశీలన నిర్దుష్టంగా, నిష్పక్షపాతంగా, నిశితంగా జరగాలి. సత్యాన్వేషణే ధ్యేయంగా ఉండాలి. పరీక్షలకు నిలబడాలి. పరిశోధకుడు ఈ అంశాలను గుర్తుంచుకొని పరిశీలన జరపవలసి ఉంటుంది.

REFERENCES :


1. M. H. Gopal *An Introduction to research Procedure in Social Sciences* p 174

2. P. V. Young *Scientific Social Surveys and Research* p. 162.

# 8. ప్రశ్నావళి పద్ధతి
## (QUESTIONNAIRE METHOD)

## 8.1. ప్రవేశిక

ఈనాడు క్షేత్ర పరిశోధనల్లో విస్తృతంగా వాడుకలో ఉన్న పద్ధతి ప్రశ్నావళి పద్ధతి. వ్యవహర్తలు ఎక్కడెక్కడో ఉన్నప్పుడు ప్రతి ఒక్కరి దగ్గరికి వెళ్ళి సమాచారం సేకరించడం అసాధ్యమౌతుంది. సామాజిక శాస్త్ర పరిశోధనల్లో పరిశోధకుడు ఎందరో వ్యక్తుల్ని కలిసి వారి అభిప్రాయాలను సేకరించాల్సిన అవసరముంది. తనకున్న పరిమిత కాలంలో పరిశోధకుడు అందరినీ కలుసుకోలేడు. అందుకనే ప్రశ్నావళి పద్ధతి ద్వారా సమాచార సేకరణ కావించడం ఉత్తమమైనదని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

## 8.2. అర్థ వివరణ

సామాజికశాస్త్ర పరిశోధనల్లో వాడుకలో ఉన్న పద్ధతుల్లో ప్రశ్నావళి పద్ధతి ఒకటి. ఈ పద్ధతిలో ప్రశ్నల ఆధారంగా విషయ సామగ్రి సేకరణ జరుగుతుంది. పరిశోధనాంశాలను దృష్టిలో పెట్టుకొని జాగ్రత్తగా తయారు చేయబడిన ప్రశ్నావళి వల్ల పరిశోధకుడు తనకు కావాల్సిన సమాచారం పొందగలడు. ఈ పద్ధతిలో పరిశోధకుడు ప్రత్యక్షంగా ప్రతివ్యవహర్తను సంప్రదించాల్సిన అవసరం లేదు. ప్రశ్నావళి అనేది వివిధ ప్రశ్నలు వరుసగా కలిగిన ఒక మాలిక. వివిధ ప్రాంతాలలో వ్యాపించి, పరిశోధనాంశంతో సంబంధమున్న వ్యవహర్తలకు ప్రశ్నావళిని పంపించి వారి వద్దనుండి లభించిన సమాధానాల ద్వారా విషయ సామగ్రిని సేకరించే శాస్త్రీయ విధానం. ఈ పద్ధతిలో వ్యవహర్తలు తమ కివ్వబడిన ప్రశ్నలకు తగిన సమాధానాలు రాసి వాటిని తిరిగి పరిశోధకునికి పంపిస్తారు. పరిశోధకుడు ప్రత్యక్షంగా క్షేత్ర పర్యటనకు వెళ్ళకుండా వ్యవహర్తలకు ప్రశ్నావళి పత్రాలను పంపి వారివద్ద నుండి లభించిన విషయసామగ్రిని పరిశోధనకు తగిన విధంగా ఉపయోగించుకోవడమే 'ప్రశ్నావళి పద్ధతి' అని చెప్పవచ్చు. 'ప్రశ్నావళి ద్వారా సేకరించిన విషయసామగ్రి విశిష్టమైనది. మరి ఏ విధమైన పద్ధతుల్లోనూ ఇలాంటి విషయ సామగ్రిని సేకరించలేము.

## 8.3. ప్రశ్నావళి పద్ధతిలోని ముఖ్యాంశాలు

8.3.1. పరిశోధకుడి పేరు, పరిశోధనను నిర్వహించే సంస్థ పేరు, పూర్తి చిరునామా మొ॥వి పొందుపర్చాలి.

8.3.2. పరిశోధనాంశ శీర్షికను మొదటి పేజీలోనే తెలియజెయ్యాలి.

8.3.3. విషయ సామగ్రి ఆవశ్యకతను వివరించాలి.

8.3.4. వ్యవహర్తలు అందిస్తున్న సమాచారం రహస్యంగా ఉంచగలమని, ఎటువంటి పరిస్థితుల్లోనూ బహిర్గతం చెయ్యమని నమ్మకం కలిగేలా రాయాలి.

8.3.5. పరిశోధన కార్యక్రమం ఎంతవరకు కొనసాగుతుందన్న విషయాన్ని వ్యవహర్తలు అర్థంచేసుకొనే రీతిలో తెలియజెయ్యాలి.

8.3.6. వ్యవహర్తలు సూచికలు ఇవ్వవలసిన అవసరం కలిగినపుడు వాటిని చేర్చడానికి వీలుగా తగిన ఖాళీలను వదలాలి.

8.3.7. ప్రశ్నావళి ఏ రోజు పూర్తిచెయ్యబడిందో ఆ తేదీ తెలియజెయ్యడానికి వీలుగా తగిన ఖాళీ స్థలాన్ని కేటాయించాలి.

8.3.8. వ్యవహర్తల సంతకం అవసరమైనపుడు దానికి తగిన స్థలం కేటాయించాలి.

8.3.9. ప్రశ్నలకన్నిటికి వరుసగా సంఖ్యలను సూచించాలి.

8.3.10. ప్రశ్నావళి ఒకదానికంటే ఎక్కువ పేజీలున్నప్పుడు ప్రతి పేజీకి నెంబరు సూచించాలి.

## 8.4. ఉత్తమ ప్రశ్నావళి లక్షణాలు

ప్రశ్నావళి రూపొందించడం తేలికైన పని కాదు. ఉత్తమ ప్రశ్నావళి రూపొందించాలంటే సమర్థత, అనుభవం రెండూ ఉండాలి. క్రింద పేర్కొన్న సూచనలను పాటించినపుడు ఉత్తమ ప్రశ్నావళి రూపొందుతుంది.

8.4.1. ప్రశ్నావళిలోని భాష సరళంగా ఉండాలి. ప్రశ్న చదివిన వెంటనే అర్థం కావాలి. ప్రశ్న వేరు వేరు అర్థాలను ఇవ్వకూడదు. ప్రశ్నను చదివినప్పుడు ఒకరికెటువంటి భావం కలుగుందో అందరికీ అదే భావం కలిగే విధంగా ప్రశ్నను రూపొందించాలి.

8.4.2. అలంకారికశైలితో, వర్ణనలతో, విశేషణాలతో ప్రశ్నలు రూపొందించకూడదు.

8.4.3. కఠిన పదాలు, వ్యవహారంలో లేని పదాలు, సాంకేతిక పదాలు మొదలైనవి ప్రశ్నావళిలో ఉండకూడదు.

8.4.4. వ్యవహర్తలు ఒక్కొక్క ప్రశ్నకు కనీసం ఒకటి రెండు వాక్యాలైనా రాసే విధంగా ప్రశ్నలుండాలి. ఒక్కమాటతో సమాధానాలు వచ్చే విధంగా ప్రశ్నలుండకూడదు.

8.4.5. ప్రశ్నలు సంగ్రహంగా, సూటిగా ఉండాలి. పెద్ద పెద్ద వాక్యాలు వ్యవహర్తలకు విసుగు పుట్టిస్తాయి.

8.4.6. ఒక్కొక్క ప్రశ్న ఒక్కొక్క ప్రత్యేక విషయానికై సంబంధించినదై ఉండాలి.

8.4.7. వ్యవహర్తకు పరిశోధనాంశంపై ఆసక్తి కలిగే విధంగా ప్రశ్నలను తయారు చెయ్యాలి.

8.4.8. తేలికైన ప్రశ్నలను, వెంటనే సమాధానం ఇవ్వగలిగే ప్రశ్నలను మొదట చేర్చి కఠినమైన, మేధాశక్తితో ఆలోచించి చెప్పగలిగిన ప్రశ్నలను ఆఖరున చేర్చాలి.

8.4.9. వ్యవహర్తల అంతరంగాలను నొప్పించే విధంగా ప్రశ్నలుండకూడదు.

8.4.10. సమాధానాలు ఎన్నిరోజుల్లో తిరిగి పంపాలో కచ్చితంగా ఉత్తరంలో సూచించడం మంచిది.

8.4.11. లభించిన సమాధానాలు విశ్లేషించడానికి అనుకూలమైన రీతిలో ప్రశ్నలు రూపొందించాలి.

8.4.12. లభించిన సమాధానాల ప్రామాణికతను నిర్ణయించడానికి కొన్ని ప్రశ్నలను పరీక్షించి చూడడం మంచిది.

8.4.13. చిన్న చిన్న సమాధానాలు వచ్చేలాగా ప్రశ్నలను తయారు చేయాలి. సమాధానాలు పెద్దవైనప్పుడు వ్యవహర్తలు వాటిని సమగ్రంగా రాయలేకపోతారు.

8.4.14. ప్రశ్నల స్వభావం, భావ ప్రకటన తీర్మానించటానికి ముందు వ్యవహర్తల గురించి క్షుణ్ణంగా తెలుసుకొని ఉండడం మంచిది.

8.4.15. ప్రశ్నపత్రం ఆకర్షణీయంగా, అందంగా ముద్రింప జేయాలి. చక్కటి అమరిక ఉండాలి, అచ్చు తప్పులుఉండకూడదు.

8.4.16. పరిశోధకుడు వ్యవహర్తలకు ఇచ్చే సూచనలు స్పష్టంగా ఉండాలి. సాంకేతిక పదాలను నిర్వచించాలి. అస్పష్టతకు, సందిగ్ధతకు చోటివ్వకూడదు.

8.4.17. ప్రశ్నలు వరుసగా క్రమ పద్ధతిలో ఉండాలి. సామాన్య విషయాలతో ప్రారంభించి ప్రత్యేక విషయాలకు రావాలి.

8.4.18. రెండు వ్యతిరేక పదాలు ఒకే వ్యాసంలో వచ్చే విధంగా వాక్య నిర్మాణం ఉండకూడదు.

8.4.19. పరిశోధన ప్రాముఖ్యతను ప్రశ్నావళి ప్రారంభంలోనే వ్యవహర్తలకు తెలియజెయ్యాలి. 'ఇది ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకొన్న అంశం' అనే అభిప్రాయం వ్యవహర్తల్లో కలిగించాలి.

8.4.20. ప్రశ్నలకు సమాధానాలు రాబట్టడంలో వ్యవహర్తలకు ఎటువంటి సూచనలుగాని, మెలకువలుగాని, సలహాలుగాని ఇవ్వకూడదు.

8.4.21. ప్రశ్నలు పరిమిత సంఖ్యలో ఉండాలి.

## 8.5. ప్రశ్నావళిని పంపించే పద్ధతి

ప్రశ్నావళిని చూడగానే అది వ్యవహర్తలను ఆకర్షించే విధంగా రూపొందించాలి. వ్యవహర్తల ద్వారా మాత్రమే ఈ అంశానికి తగిన సమాచారం లభించగలదు అనే భావం ప్రతి వ్యవహర్తలోను కలిగించాలి. వ్యవహర్తల వ్యక్తిగత జీవితాలను, ఆంతరంగిక విషయాలను బహిర్గతం చేస్తున్నామనే భావం వారిలో కలిగించకూడదు. ప్రశ్నావళిని పంపించడానికి ముందు క్రింద ఇచ్చిన కొన్ని సూచనలను గుర్తుంచుకోవడం మంచిది.

### 8.5.1. అభ్యర్థన

వ్యవహర్తల సహకారం లేనిదే ప్రశ్నావళి పద్ధతి విజయవంతం కాదు. కాబట్టి పరిశోధకుడు వ్యవహర్తల సహకారాన్ని అభ్యర్థిస్తూ ఒక ఉత్తరాన్ని ప్రశ్నావళితో పాటు పంపించాలి. ఉత్తరం వ్యవహర్త మనసును ఆకట్టుకొనే విధంగా వినయపూర్వకంగా ఉండాలి. అధికారాన్నిగాని, అహంభావాన్నిగాని ప్రదర్శించకూడదు. ఉత్తరం సంగ్రహంగాను, ఆకర్షణీయంగాను ఉండాలి. అనవసర విషయాలతో కూడిన ఉత్తరాన్ని చదవడానికి వ్యవహర్త ఇష్టపడదు.

### 8.5.2. పరిశోధకుని వివరాలు

ప్రశ్నావళితో పాటు తనకు సంబంధించిన వివరాలన్నీ పరిశోధకుడు వ్యవహర్తకు తెలియజెయ్యాలి. తన పేరు, ఉద్యోగం, సంస్థ పేరు, చిరునామా మొదలైనవన్నీ లేఖలో పొందుపర్చాలి. ప్రశ్నావళిని చూడగానే వ్యవహర్తలకు పరిశోధకుడిపై సదభిప్రాయం కలగాలి.

### 8.5.3. పరిశోధన ప్రాముఖ్యత

పరిశోధకుడు తన పరిశోధనాంశ విశేషాలుకూడా వ్యవహర్తకు తెలియజెయ్యాలి. పరిశోధనాంశ ప్రాముఖ్యతను సంగ్రహంగా వివరించాలి. అనవసరమైన విషయాలు చెప్పకూడదు. అలా చెప్పడంవల్ల వ్యవహర్త పొరబాటుగా అర్థం చేసుకొనే ప్రమాదం ఉంది.

### 8.5.4. ప్రమాదాల ఆవశ్యకత

పరిశోధకుడు తన ప్రశ్నలకు తగిన సమాధానాలు త్వరలో లభించ గలవని అనుకోవడం సహజం. అందరి దగ్గరనుండి సమాధానాలు వెంటనే రావడం అరుదుగానే జరుగుతుంది. పరిశోధకుడు వ్యవహర్తల పూర్తి సహ కారాన్ని కోరుతూ వినయపూర్వకంగా వారిని అభ్యర్థించాలి. సమాధానాలు ఇవ్వడంవల్ల సమాజానికి ఎంతో సేవ చేస్తున్నామనే భావన వ్యవహర్తలో కలిగించాలి.

### 8.5.5. వ్యవహర్తలకు సూచనలు

ప్రశ్నలకు సమాధానం ఏ పద్ధతుల్లో ఎలా ఇవ్వాలో వ్యవహర్తలకు ముందుగానే తెలియజెయ్యడం మంచిది. సాంకేతిక పదాలకు వివరణలిస్తూ తగిన సూచనలు, సలహాలు ఇచ్చినప్పుడు వ్యవహర్త పూర్తి సమాచారం ఇవ్వగలడు.

### 8.5.6. ముఖ్య సమాచారాలకు రక్షణ

తాము అందిస్తున్న రహస్య సమాచారం ఇతరులకు తెలిసిపోతుందనే సంశయం కలిగినప్పుడు వ్యవహర్తలు దాన్ని వెలిబుచ్చడానికి సంశయిస్తారు. వాస్తవ స్థితిని బహిర్గతం చెయ్యరు. ముఖ్యంగా వ్యక్తుల అంతరంగ జీవితాలను గురించిన వివరాలు సేకరించేటప్పుడు పరిశోధకుడు వ్యవహర్తలో నమ్మక భావాన్ని కలిగించాలి. వ్యవహర్త ప్రకటిస్తున్న భావాలను ఇతరులకు ఎటువంటి పరిస్థితుల్లోనూ బహిర్గతం చెయ్యనని పరిశోధకుడు వాగ్దానం చెయ్యాలి. అప్పుడే వ్యవహర్త నిర్భయంగా తన మానసిక భావాలను వెలిబుచ్చగలడు.

### 8.5.7. ప్రశ్నావళిని తిరిగి పొందడానికి ఏర్పాట్లు

వ్యవహర్తల నుండి ప్రశ్నావళిని తిరిగి పొందాలంటే పరిశోధకుడు కొన్ని సూచనలు పాటించాలి.

1. వ్యవహర్తలు తమ సమాధానాలు వెనువెంటనే పంపేందుకు వీలుగా పరిశోధకుడు తగిన తపాలా బిళ్ళలు అంటించిన తన చిరునామాతో కూడిన కవరును ప్రశ్నావళితో పాటు పంపించాలి.
2. పరిశోధనాంశంలో ఆసక్తి ఉన్న వ్యవహర్తలకు మాత్రమే ప్రశ్నావళిని పంపించాలి.
3. ప్రశ్నావళి పత్రాన్ని వ్యవహర్తల వద్దనుండి తిరిగి పొందడంలో ఆలస్యం ఏర్పడినప్పుడు వారికి ఉత్తరాలు రాసి చాకచక్యంతో వాటిని రాబట్టుకోవాలి.

## 8.6. ప్రశ్నావళి పద్ధతి ప్రయోజనాలు

సమాచార సేకరణలో ఎన్నో పద్ధతులున్నప్పటికీ ఈనాడు ప్రశ్నావళి పద్ధతి చాలా ప్రాచుర్యాన్నీ, ప్రసిద్ధినీ పొందింది. మిగిలిన పద్ధతులతో పోల్చి చూచి నప్పుడు ప్రశ్నావళి పద్ధతిలో అధిక ప్రయోజనాలున్నట్లు తెలియవస్తుంది.

8.6.1. వ్యవహర్తలు ఎక్కడెక్కడో వేరువేరు ప్రాంతాల్లో నివసిస్తున్నప్పుడు ప్రశ్నావళి పద్ధతి ద్వారా వారి వద్దనుండి సమాచారం పొందవచ్చు.

8.6.2. ఈ పద్ధతి మిగిలిన అన్ని పద్ధతులకన్నా తేలికైనది. ధనవ్యయం. శారీరకశ్రమ తక్కువ.

8.6.3. పరిమిత కాల వ్యవధిలో ఎంతోమంది వ్యక్తులద్వారా సమాచార సేకరణ చెయ్యవచ్చు.

8.6.4. వ్యవహర్తలు కూడ తీరుబాటుగా సమాధానాలు ఇవ్వడానికి ఈ పద్ధతిలో అవకాశముంది. వ్యవహర్తలకి కాలవ్యవధి ఉండడంవల్ల వారు సావకాశంగా ఆలోచించి సమాధానాలు చక్కగ రాయగల్గుతారు.

8.6.5. ఈ పద్ధతిలో సేకరించిన సమాచారం విలువైనది. నమ్మదగినది.

8.6.6. ఈ పద్ధతిలో వ్యవహర్తకు తను ప్రకటిస్తున్న అభిప్రాయాలు రహస్యంగా ఉంచబడతాయన్న నమ్మకం కలుగుతుంది. కాబట్టి అతడు స్వేచ్ఛగా తన అభిప్రాయాలను వెలిబుచ్చగలడు.

8.6.7. పరిశోధకుడు ప్రశ్నావళిని రూపొందించిన తర్వాత మిగిలిన కార్యక్రమాన్ని తన సహాయకుల ద్వారా నిర్వహించవచ్చు.

## 8.7. ప్రశ్నావళి పద్ధతి పరిమితులు

8.7.1. ఈ పద్ధతి ద్వారా సేకరించిన విషయ సామగ్రి ప్రామాణికతను పూర్తిగా విశ్వసించలేము. వ్యక్తులు చెబుతున్న అభిప్రాయాలను సైన్సులో లాగ ప్రయోగాల ద్వారా నిరూపించలేము.

8.7.2. వ్యవహర్తలు పరిశోధకుడితో సహకరించక పోయినప్పుడు పరిశోధకుడి శ్రమ నిష్ప్రయోజనమవుతుంది.

8.7.3. వ్యవహర్తలు ప్రకటిస్తున్న అభిప్రాయాలపై వారి మనోభావాల అభిరుచుల ప్రభావం ఉండడంవల్ల వాటి ప్రామాణికతను సందేహించవలసిన అవసరం ఉంది.

8.7.4. ఈ పద్ధతిని నిరక్షరాస్యులతో, చిన్న పిల్లలతో నిర్వహించలేము.

8.7.5. ఈ పద్ధతిలో వ్యవహర్తల వద్దనుండి సమాధానాలను తప్పకుండ వస్తాయని విశ్వశించలేము.

8.7.6. వ్యవహర్తల అన్ని ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వకుండ అక్కడక్కడ ఖాళీలు వదలడం చేస్తుంటారు.

8.7.7. వ్యవహర్తల లేఖన దోషాలు కూడా ఈ పద్ధతిలో గొప్ప లోపంగా భావించవచ్చు.

8.7.8. ఈ పద్ధతిలో పరిశోధకుడు ప్రత్యక్షంగా పాల్గొనక పోవడం వల్ల పరిశోధన సహాయకులు తమ కర్తవ్యాన్ని విస్మరించే ప్రమాదముంది.

8.7.9. వ్యవహర్తలకి ప్రశ్నలు అస్పష్టంగా తోచినప్పుడు సమాధానాలు సక్రమంగా ఇవ్వరు.

8.7.10. వ్యవహర్తల మనోభావాలను, చేష్టలను, అభిరుచులను పరిశోధకుడు ప్రత్యక్షంగా చూసే అవకాశం ఈ పద్ధతిలో లేదు.

8.7.11. కొన్ని కొన్ని పరిశోధన సమస్యల్లో ప్రశ్నలను రూపొందించడం కష్టసాధ్య మవుతుంది.

## 8.8. ఉపసంహారం

"విషయ సేకరణలో బద్ధకస్తులు అనుసరించే పద్ధతి" అని కొందరు భావిస్తున్నప్పటికీ ఈనాడు అన్ని పరిశోధన రంగాల్లోను ఈ ప్రశ్నావళి పద్ధతిని విస్తృతంగా వినియోగిస్తున్నారు.

# 9. సందర్శన పద్ధతి
(INTERVIEW)

## 9.1. ప్రవేశిక

విషయ సేకరణ విధానాల్లో క్షేత్ర పరిశీలన కీలకస్థానాన్ని వహిస్తుంది. దీన్ని 1. సందర్శన పద్ధతి (Interview), 2. ప్రశ్నావళి పద్ధతి (Questionnaire), 3. పరిశీలన పద్ధతి (Observation) అని మూడు విధాలుగా విభజించవచ్చు. ఈ మూడింటిలో సందర్శన పద్ధతే ప్రప్రథమమైంది; ప్రామాణిక మైంది.

ప్రశ్నావళి పద్ధతిలో పరిశోధకుడు వ్యవహర్త అభిప్రాయాన్ని కొంత వరకే తెలుసుకోగలుగుతాడు. కాని సందర్శన పద్ధతిలో వ్యవహర్తతో ప్రత్యక్షంగా సంభాషించి తనకు కావలసిన సమాచారాన్ని తరచి తరచి అడిగి ఆకళింపు కొంటాడు.

## 9.2. అర్థ వివరణ

Interview అనే పదం లాటిన్‌లో Inter-Vidire (mutual seeing) అనే పదం వచ్చింది. 'Vidire' అంటే చూడడం అన్నమాట. పరిశోధకుడు వ్యవహర్త ఇద్దరూ ఒకచోట సమావేశమై పరస్పర సహకారంతో ఒక విషయాన్ని లోతుగా చూడకలగడమే సందర్శన అనేది. దీన్ని "a kind of verbal technique" అని, an oral questionnaire అని, "an oral verbal technique" అని పండితులు వివిధ రకాలుగా పేర్కొంటున్నారు.

"Interview may be regarded as a systematic method by which a person enters more or less imaginatively in to the life of a comparative stranger"[1] అని P. V. Young దీని గురించి వివరించాడు. "సందర్శన అనేది ఒక క్రమ పద్ధతి. దీని ద్వారా ఒక వ్యక్తి తనకు అంతగా పరిచయం లేని మరో వ్యక్తి జీవన విధానంలోకి తొంగి చూస్తాడు" అని యంగ్ భావం.

Dr. N. Thanulingam సందర్శన గురించి చెప్తూ, "Interview may be defined as a systematic conversation initiated for a specific purpose and focussed on certain planned content areas"[2] అని వివరిస్తున్నాడు. దీన్ని బట్టి 'సందర్శన' అనేది ఒక నిర్దిష్ట విషయాన్ని గూర్చి ఇద్దరిమధ్య జరిగే ద్వేయాత్మక సంభాషణ అని తెలుస్తోంది. ఈ ఇద్దరూ పరస్పరం తమతమ అభిప్రాయాలను వినిమయం చేసుకోవడం, సమూలంగా చర్చించుకోవడం ద్వారా పరిశోధనకి సంబంధించిన నూతన విషయాలు వెల్లడవుతాయి. Interview అంటే ఒక వ్యక్తి Innerview ని తెలుసుకోవడమన్నమాట. నిజానికి ఇది ఒక నైపుణ్యమైన నాజూకు పని.

వ్యవహర్త వాగ్రూపంలో అందిస్తున్న సమాచారాలను మాత్రమే కాక అతని హావ భావాలు, ముఖ విలాసాలు, ముద్రలు, సంజ్ఞలు మొదలైన శారీరక భావ ప్రకటనల మూలంగా తెలియవచ్చే సమాచారాన్ని కూడా పరిశోధకుడు సేకరిస్తాడు. "Medium is the Message" అని Mass media communication[3] శాస్త్రజ్ఞులు చెప్తారు. కాబట్టి మనిషి మాటలేకాక, ఆ మనిషి హావ భావాలు, అతని తీరుతెన్నులు పరిశోధకునికి సమాచారాన్ని అందిస్తుంటాయి. "నోరు మాట్లాడుతుంది; నొసలు వెక్కిరిస్తుంది" అనే నానుడిని ఇక్కడ గుర్తించుకోవడం ఎంతో సమంజసం.

## 9.3. సందర్శన పద్ధతి ఆశయాలు

(Objectives of Interview)

1. వ్యక్తుల ముఖకవళికల్ని ప్రయోగాత్మకంగా అధ్యయనం చేయడం, 2. తెలిసిన వ్యక్తుల దగ్గరనుండి విషయాన్ని రాబట్టడం - ఇవే 'సందర్శన' ముఖ్య ఆశయాలు. దీన్ని విడమర్చి ఈ క్రింది రీతిగా చెప్పవచ్చు.

1. ఊహాప్రతిపాదనను రూపొందించడం.
2. వ్యక్తిగత సంబంధాల ద్వారా అజ్ఞాత విషయాలను గురించిన అంశాలను సేకరించడం.
3. ఆ అజ్ఞాత విషయాల గుణగణాలను సమగ్రంగా తెలుసుకొనడానికి సంబంధిత వివరాలను సేకరించడం.
4. పరిశీలనలో (Observation) అవగతమైన విషయాల అసంపూర్ణతను పూరించడం.
5. వివిధ సమస్యలను గురించిన విషయ సేకరణను విభిన్న సందర్భాల్లో సాగించడం.

# సందర్శన పద్ధతి విభాగాలు[4]



## 9.4. విభాగాలు

సందర్శన పద్ధతి స్వరూప స్వభావాలను దృష్టితో పెట్టుకొని వాటిని రేఖా చిత్రంలో చూపించిన విధంగా విభజించవచ్చు.

### 9.4.1. పరిశోధనాంశం

(According to Subject matter)

#### 9.4.1.1. గణాత్మక సందర్శన

(Quantitative Interview)

జనాభా లెక్కలు లాగా, పరిశోధనాంశానికి సంబంధించిన వివరాల్ని సంఖ్యారూపంలో గణించడం.

#### 9.4.1.2. గుణాత్మక సందర్శన

(Qualitative Interview)

గుణాత్మక సందర్శన ద్వారా లభించిన వివరాలకు వెనుక అంతర్గతంగా ఉన్న హేతువుల్ని వాటి పరిణామాల్ని పరిగణించడం. దానికి Diagnostic Interview అని మరొక పేరూ ఉంది.

#### 9.4.1.3. మిశ్రమ సందర్శన

(Mixed Interview)

పై రెండు పద్ధతులు కలిసి విషయ సేకరణ జరిగినపుడు అది మిశ్రమ సందర్శన అవుతుంది.

### 9.4.2. పరిశోధన ఉద్దేశం

(According to purpose)

ప్రతి పరిశోధన లక్ష్యోన్ముఖంగా సాగుతుంది. ఆ లక్ష్యాన్ని బట్టి సందర్శన పద్ధతినిగూడ వివిధ రకాలుగా విభజించవచ్చు.

#### 9.4.2.1. వైద్యం

వ్యాధి మూల కారణాన్ని తెలుసుకోవడానికి జరిపే సందర్శనం.

#### 9.4.2.2. చికిత్స

రోగ హేతువును తెలుసుకొన్న తర్వాత దాని నివారణార్థం చేసే చికిత్సకు తోడ్పడే సందర్శనం.

#### 9.4.2.3. ఎన్నిక

ఒక ఉద్యోగానికో, శిక్షణకో అర్హత వున్న వ్యక్తిని ఎన్నుకోవడానికి జరిపే సందర్శన.

### 9.4.2.4. ఆసక్తి

సందర్శకునికి ఒక వ్యక్తిని లేక ఒకానొక విషయాన్ని గురించి తెలుసుకోవాలనే ఆసక్తి మనసులో అణగిమణగి ఉంటుంది.

### 9.4.2.5. పరిశోధన

ఒక సమస్య పరిష్కారానికి సంబంధించిన పూర్తి వివరాలను సేకరింపేందుకు అవలంబించిన 'సందర్శన'.

### 9.4.3. నిర్మాణాత్మకం (According to Formalness)

దీన్ని రచనాత్మక సందర్శన (Structured Interview) అరచనాత్మక (Unstructured Interview) అని రెండు విధాలుగా విభజించవచ్చు.

### 9.4.3.1. రచనాత్మక సందర్శన

పరిశోధకుడు తను అడగవలసిన అంశాలను గురించి ముందుగనే ఆలోచించి, జాగ్రత్తగా ప్రశ్నలను రూపొందించి, వ్యవహర్తలతో సమావేశాన్ని జరిపి విషయ సామగ్రి సేకరించడాన్ని 'రచనాత్మక సందర్శన' అంటారు. ఈ పద్ధతిలో పరిశోధకుడు తాను రూపొందించుకొన్న ప్రశ్నావళిలోని ప్రశ్నలను మాత్రం వ్యవహర్తను అడుగుతాడు. ప్రశ్నావళిలో లేని ఇతర ప్రశ్నలను గానీ మరే సమాచారాన్ని గానీ అడగడు. వ్యవహర్తలకు అస్పష్టంగా తోచిన ప్రశ్నలను మాత్రం వివరించి చెబుతాడు. ప్రశ్నలను ఒక్కటొక్కటిగా అడుగుతూ సమాధానాలను జాగ్రత్తగా టేప్ చేసుకొంటాడు. రచయితలు, రాజకీయవేత్తలూ మొదలైన ప్రముఖుల వద్దనుండి సమాచారం సేకరించడానికి ఈ పద్ధతి అనుకూలంగా ఉంటుంది.

ఒక్కోసారి ప్రశ్నావళిని ముందుగానే వ్యవహర్తలకు పంపి వారికి అనుకూలంగా ఉన్న ఒకరోజున వారితో సందర్శన జరపవచ్చు. ముందుగానే ప్రశ్నావళిని పంపడంవల్ల వ్యవహర్తలు ఆ అంశంపై ఒక అవగాహన ఏర్పరచుకొంటారు. పరిశోధకుడికి కావలసిన విషయాలను వెంటవెంటనే తెలియజేయడానికి సిద్ధంగా ఉంటారు.

### 9.4.3.2. అరచనాత్మక సందర్శన

పరిశోధకుడు ముందుగానే ప్రశ్నలను రూపొందించుకోకుండా వ్యవహర్తను కలిసి సందర్శన ప్రారంభించి అప్పటికప్పుడు సందర్భానుసారంగా ప్రశ్నలువేసి సమాచారం సేకరించడాన్ని 'అరచనాత్మక సందర్శన' అంటారు. సాధారణంగా ఇలాంటి సందర్శనలో ఎటువంటి కట్టుబాట్లు నిబంధనలు లేకుండా సంభాషణలు సాగుతాయి. వ్యవహర్త తన జీవితానుభవాలను, ముఖ్య సంఘటనలను,

ఆలోచనలను వివరిస్తున్నపుడు పరిశోధకుడు తన కవసరమైన అంశాలను మాత్రం గుర్తుంచుకొంటాడు.

ఈ పద్ధతిలో పరిశోధకుడికి తన ఇష్టానుసారంగా, స్వేచ్ఛగా ప్రశ్నలు వేసే అవకాశం ఉంది. పరిశోధకుడు వ్యవహర్తకు సంబంధిత విషయంపై స్ఫూర్తిని, ఆసక్తిని కలిగించినప్పుడు ఉత్తేజితుడై రహస్య సమాచారాలను, అంతరంగిక విషయాలను కూడ బహిర్గతం చేస్తాడు. వ్యవహర్త మానసిక స్వభావాన్ని తెలుసుకొని, దాని కనుగుణంగా తన ప్రశ్నలను మార్చుకొనే అవకాశం ఈ పద్ధతి కలిగిస్తుంది.

> "The advantage of unstructured response is to be unprecise; that they permit the unexpected response" Johan Galtung

### 9.4.4. సంఖ్యాత్మకం (According to Number)

దీన్ని వైయక్తిక సందర్శన, సామూహిక సందర్శన అని రెండు విధాలుగా విభజించవచ్చు.

#### 9.4.4.1. వైయక్తిక సందర్శన

ఒక వ్యక్తితో మాత్రమే జరిపే సందర్శన ఇది. ఈ పద్ధతిలో పరిశోధకుడు ప్రతి వ్యవహర్తను ప్రత్యేకంగా కలుసుకొని సంభాషణలు జరుపుతాడు. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో ఇటువంటి వైయక్తిక పద్ధతి అనుసరింపబడు

#### 9.4.4.2. సామూహిక సందర్శన

జానపద విజ్ఞానం, భాషా విజ్ఞానం మొదలైన రంగాల్లో పరిశోధకుడు వ్యక్తులను సామూహికంగా కలుసుకొని వారివద్ద నుండి విషయ సేకరణ చేస్తాడు. ఈ పద్ధతిలో చాలామంది వ్యవహర్తలుంటారు. వ్యవహర్తల సమాధానాల్లో తన కవసరమైన విషయాలను మాత్రం పరిశోధకుడు గ్రహిస్తాడు.

### 9.4.5. కాలవ్యవధి (According to period contact)

దీన్ని స్వల్పకాలిక (Short term), దీర్ఘకాలిక (Long term) సందర్శన అని రెండు విధాలుగా విభజించవచ్చు.

### 9.4.5.1. స్వల్పకాలిక సందర్శన

కొన్ని సాంఘిక సమస్యలకు సంబంధించిన విషయ సేకరణకు ఎక్కువ సమయం పట్టదు. స్వల్ప వ్యవధిలోనే, ఒకే సందర్శనలోనే అయిపోవచ్చు.

### 9.4.5.2. దీర్ఘకాలిక సందర్శన

కొన్ని సమస్యల విషయంలో వాటి పుట్టు పూర్వోత్తరాలు, క్రమ వికాసాలు, పరిణామాలు మొదలైనవి తెలుసుకోవడానికి దీర్ఘకాలం పడుతుంది. వైయక్తిక ప్రవర్తనా పద్ధతులను (Case study) అధ్యయనం చేయడానికి దీర్ఘకాలిక ప్రయత్నం కావాలి.

### 9.4.6. మరికొన్ని రకాలు

లక్ష్యాన్ని బట్టి, విధానాన్ని బట్టి సందర్శనల్లో మరికొన్ని రకాలను పేర్కొనవచ్చు. వాటిని పరామర్శిద్దాం.

### 9.4.6 1. నిర్దిష్టాంశ సందర్శన (Focussed Interview)

వ్యవహర్త ప్రత్యేకానుభవాలను అభివ్యక్తీకరించడమే ఈ సందర్శన పద్ధతిలోని ముఖ్యాంశం. ఒక ప్రత్యేక సినిమాను చూసిన ప్రేక్షకులతో జరిపిన సంభాషణలు, ఒక ప్రత్యేక రేడియో కార్యక్రమాన్ని విన్న శ్రోతలతో జరిపిన సంభాషణలు మొదలైనవాటిని Focus చేసేపద్ధతి ఇది. కొన్ని కొన్ని వారపత్రికలు సినిమా విమర్శలకు ఈ పద్ధతిని అనుసరిస్తూ, ఇటువంటి సందర్శనలను తమ పత్రికల్లో ప్రచురిస్తూ ఉంటారు. పరిశోధకుడు మొదట సినిమాను వ్యవహర్తలకు చూపించి రూపొందించిన కొన్ని ప్రశ్నల ద్వారా వారి మనోభావాలను సేకరిస్తాడు. వ్యవహర్త ఒక నిర్దిష్ట అంశాన్ని గురించి మాత్రమే మాట్లాడే విధంగా ప్రశ్నలు తయారై ఉంటాయి. పొరబాటున వ్యవహర్త వేరొక అంశానికి వెళ్ళినప్పుడు పరిశోధకుడు చాకచక్యంతో వ్యవహర్త దృష్టిని నిర్దిష్టాంశానికి మరల్చాలి.

### 9.4.6.2. పునరావృత సందర్శన (Repetitive Interview)

కొంతమంది వ్యక్తుల మనోభావాలను, చేష్టలను, విభిన్న వృత్తులను అధ్యయనం చేయడమే ఈ సందర్శన ముఖ్యోద్దేశం. ఈ పద్ధతిలో వ్యవహర్తలు ఒక ప్రాంతంలోనే స్థిరనివాసం కలిగినవారై ఉండాలి. అప్పుడే పరిశోధకుడు వారిని ఏ సమయంలోనైనా కలుసుకోవడానికి వీలౌతుంది. ఆర్థికబలముండి అనేక మంది పరిశోధకులతో కూడిన కొన్ని ప్రత్యేక సంస్థలు మాత్రమే నిర్వహించదగిన బృహత్రయత్నమిది.

### 9.4.6.3. ఉద్దేశిత సందర్శన-హఠాత్సందర్శన
(Planned Interview-Spot Interview)

మొదటిది ప్రణాళికాబద్ధమైన సందర్శన. ఇందులో ఎవరిని? ఎప్పుడు? ఎక్కడ? ఏ విధంగా? అని పూర్వమే నిర్ణయించుకొని సందర్శన ప్రారంభించాలి. ఇందులో ముందుగానే సిద్ధం చేసుకొన్న ప్రశ్నలకు మాత్రమే సమాధానాలు పొందడం జరుగుతుంది.

స్థలం, కాలం, వ్యక్తులు మొదలైనవి నిర్ణయించుకోకుండా హఠాత్తుగా సందర్శన ప్రారంభించడాన్ని 'హఠాత్సందర్శన' అంటారు. ఇటువంటి సందర్శనల్లో పరిశోధకుడు వ్యవహర్త అనుకోకుండ ఎదురైనప్పుడు దొరికిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకొంటాడు.

### 9.4.6.4. నిర్దేశాత్మక-నిర్దేశరహిత సందర్శన
(Directed Interview-Non directed Interview)

వైద్యునికి రోగికి మధ్య జరిగే సంభాషణను నియమబద్ధ సందర్శనకు ఉదాహరించవచ్చు. వైద్యుడు కొన్ని ప్రశ్నల ద్వారా రోగి రోగలక్షణాలను తెలుసుకొంటాడు. అదే విధంగా పరిశోధకుడు వ్యవహర్తను కలుసుకొని ప్రశ్నల సహాయంతో తన పరిశోధనా సమస్యకు తగిన పరిష్కారాన్ని అన్వేషిస్తాడు. ఇది ఒక విధంగా కొన్ని నియమాలకు లోబడి సాగుతుంది.

నిర్దేశరహిత సందర్శన నిర్దేశాత్మక సందర్శనకు పూర్తిగా విరుద్ధం. అటు పరిశోధకుడు, ఇటు వ్యవహర్త ఇద్దరూ స్వేచ్ఛగా ఎటువంటి కట్టుబాట్లు లేకుండా సందర్శన జరుపుతారు.

## 9.5. సందర్శకుని గుణగణాలు

వ్యవహర్తతో జరిపే సందర్శన సఫలీకృతం కావడం సందర్శకుని వ్యక్తిత్వం. నైపుణ్యం, చాకచక్యాలమీద ఆధారపడి ఉంటుంది. సందర్శకుడు ప్రధానంగా ఈ క్రింది లక్షణాలను కలిగి ఉండాలి.

9.5.1. సందర్శకుడు క్రమశిక్షణతోను, బాధ్యతాయుతంగానూ ప్రవర్తించాలి. వ్యవహర్తలతో స్నేహపూర్వకంగా సంభాషించాలి.

9.5.2. విషయ సామగ్రి సేకరణలో, సందర్శనలను నిర్వహించడంలో శాస్త్రీయ శిక్షణను పొంది ఉండాలి.

9.5.3. సందర్శనను స్వారస్యంగా నిర్వహించడం, సంతృప్తికరంగా ముగించడం సందర్శకుని ప్రధాన లక్ష్యంగా ఉండాలి.

9.5.4. వ్యవహర్త తన భావాలను స్వేచ్ఛగా ప్రకటించడానికి వీలుగా సుహృద్భావ వాతావరణాన్ని తీసుకురావాలి.

9.5.5. సంఘటనలను గుర్తుకు తెచ్చుకోవడంలో వ్యవహర్తకు తోడ్పడుతూ ఉండాలి.

9.5.6. సంభాషణలో వ్యవహర్తకు ఆసక్తి తగ్గినప్పుడు సందర్శకుడు నేర్పుగా మాట్లాడి అతనిలో స్ఫూర్తినీ, ఉత్సాహాన్నీ కలిగించాలి.

9.5.7. సందర్శకుడు సందర్శనను అర్ధాంతరంగా నిలిపివేయకూడదు. పరస్పర సంభాషణలు ఒక ముగింపుకు వచ్చేదాకా వేచి ఉండడం అవసరం.

9.5.8. సందర్శకుడికి టేప్ రికార్డర్, కెమేరా మొదలైన సాంకేతిక పరికరాలను ఉపయోగించే నేర్పు ఉండాలి.

## 9.6. సందర్శన పద్ధతి విజయవంతం కావడానికి కొన్ని సూచనలు

సందర్శన పద్ధతి విజయవంతం కావాలంటే పరిశోధకుడు క్రింద పేర్కొన బడిన సూచనలు తప్పక పాటించాలి:

9.6.1. వ్యవహర్తను కలుసుకోవడానికి ముందు పరిశోధకుడు తన పరిశోధ నాంశానికి సంబంధించిన కొన్ని వివరాలను క్షుణ్ణంగా తెలుసుకొని ఉండాలి.

9.6.2. పరిశోధకుడు సందర్శనను ప్రారంభించడానికి ముందు సంభాషణ ప్రణాళిక సిద్ధం చేసుకోవాలి.

9.6.3. తగిన వ్యవహర్తను ఎన్నుకొని సరైన సమయంలో అనుకూలమైన స్థలంలో సందర్శన జరపాలి.

9.6.4. తాను సంప్రదించబోయే ముందు వ్యవహర్తల పూర్వాపరాలను, వారి అలవాట్లను మానసిక స్వభావాలను పరిశోధకుడు పూర్తిగా తెలుసుకొని ఉండాలి.

9.6.5. వ్యవహర్తను కలిసిన వెంటనే తన్నుతానే పరిచయం చేసుకొని తన పూర్తి వివరాలను వ్యవహర్తకు పరిశోధకుడు తెలియజెయ్యాలి.

9.6.6. సందర్శన ప్రారంభంలోనే పరిశోధకుడు వ్యవహర్తకు పరిశోధనాంశ ఉద్దేశాలను, లక్ష్యాలను వివరించాలి.

9.6.7. పరిశోధకుడు వేసే ప్రశ్నలు క్రమబద్ధంగానూ, సరళంగానూ ఉండాలి.

9.6.8. రెండు ప్రశ్నలు ఒకేసారి వేయడంగాని, రెండు ప్రశ్నలు కలిపి ఒకే ప్రశ్నగా అడగడంగానీ చేయకూడదు. అటువంటి ప్రశ్నలు వ్యవహర్తకు సందిగ్ధాన్ని కలిగిస్తాయి.

9.6.9. 'అవును' 'లేదు' అనే సమాధానాలు వచ్చే ప్రశ్నలను సాధ్యమైనంత వరకు పరిహరించాలి.

9.6.10. పరిశోధనాంశానికి సంబంధించిన ప్రశ్నలే అడగాలి.

9.6.11. వ్యవహర్తకు ఇబ్బందిని కలిగించే ఆవేశాన్ని రేకెత్తించే ప్రశ్నలను పరిహరించాలి.

9.6.12. సూటిగా అడిగిన ప్రశ్నలకు సమాధానాలు లభించకపోయినప్పుడు వాటిని పరోక్ష పద్ధతిలో అడిగి సమాధానాలను రాబట్టుకోవాలి.

9.6.13. వ్యవహర్త అందిస్తున్న సమాచారాలను అప్పటికప్పుడే టేప్ చేసుకోవడం మంచిది.

9.6.14. ఒక ప్రత్యేక సముదాయాన్ని గురించిగాని, లేదా ఒక సాంస్కృతిక బృందాన్ని గురించిగాని పరిశోధన చేస్తున్నప్పుడు మొదట ఆ సమాజ నాయకులను సంప్రదించి వారి అంగీకారంతో సందర్శన ప్రారంభించడం అవసరం.

9.6.15. వ్యవహర్తలను ఎట్టి పరిస్థితుల్లోనూ నిర్బంధించి సమాచారాలను పొందే ప్రయత్నం చేయకూడదు.

9.6.16. ఏవైనా కొన్ని కారణాలవల్ల కొన్ని ప్రశ్నలకు సమాధానాలివ్వడానికి వ్యవహర్త నిరాకరించినప్పుడు ఆ విధంగా నిరాకరించడానికి గల కారణాలను తెలుసుకోవడానికి ప్రయత్నించాలి.

9.6.17. సందర్శన సమయంలో వ్యవహర్తలు తాము అందిస్తున్న సమాచారాలతో పాటు, ఒక్కొక్కసారి పరిశోధనాంశానికి సంబంధించని విషయాలను కూడ చెబుతుంటారు. అప్పుడు పరిశోధకుడు యుక్తియుక్తంగా వారి దృష్టిని పరిశోధనాంశంవైపు మళ్ళించాలి.

9.6.18. పరిశోధకుడు టేప్‌రికార్డర్ మొదలైన పరికరాలను ఉపయోగించడాన్ని వ్యవహర్త ఇష్టపడకపోతే, వాటిని వాడకూడదు.

9.6.19. వ్యవహర్త చెబుతున్న విషయాలను గుర్తుంచుకోవాలి. అతనంగీకారంతో టేప్ చేసుకోవాలి.

9.6.20. సందర్శన పూర్తయిన వెంటనే పరిశోధకుడు సంభాషణ వివరాలను, ముఖ్యంగా పరిశోధనకు సంబంధించిన వివరాలను సమీక్షిస్తూ ఒక నివేదికను సిద్ధం చెయ్యాలి.

9.6.21. సందర్శన సమయంలో సందర్శకుడు, వ్యవహర్త తప్ప ఇతరులెవ్వరూ పాల్గొనకుండా చూసుకోవాలి.

9.6.22. పరిశోధకుడు **work more talkless** అనే నానుడిని మనసులో ఉంచుకొని వీలయినంత ఎక్కువ సమాచారాన్ని సంగ్రహించాలి.

వ్యవహర్తే ఎక్కువగా మాట్లాడాలి కాని, సందర్శకుడు కాదన్న విషయాన్ని మనసులో ఉంచుకోవాలి.

9.6.23. వ్యవహర్తకి సందర్శకునికి మధ్య కలిగే సంబంధాన్నిబట్టి విషయ సేకరణ జరుగుతుంది. ఉదాహరణకు అత్యాచారానికి బలైన ఒక స్త్రీతో సందర్శన జరపడానికి స్త్రీ సందర్శకురాలే యుక్తంగా ఉంటుంది.

9.6.24. పరిశోధకుడు సందర్శనకు సకాలంలో వెళ్ళాలి.

9.6.25. సందర్శనకు పోయినప్పుడు తదనుగుణంగా వస్త్రధారణ చేసుకోవాలి. పామరులను, పేదసాదలను సందర్శించేటప్పుడు డాంబికంగా వెళ్ళకూడదు.

9.6.26. వ్యవహర్తపట్ల వినయంగా ప్రవర్తించాలి. **"You are a reporter not a Public Prosecutor"** అనేది గుర్తుంచుకోవాలి.

9.6.27. సందర్శన అనేది సమాచారం గ్రహించడానికేగాని, తన అభిప్రాయాలను ప్రకటించడానికి కాదన్న విషయాన్ని పరిశోధకుడు గుర్తుంచుకోవాలి.

## 9.7. సందర్శన పద్ధతి ప్రయోజనాలు

9.7.1. ఈ పద్ధతిలో పరిశోధకుడికి వ్యవహర్తకు సన్నిహిత సంబంధం ఏర్పడడంవల్ల వ్యవహర్త అందించే సమాచారాలు ప్రామాణికమైనవిగా భావించవచ్చు.

9.7.2. ఈ పద్ధతిలో పరిశోధకుడు వ్యవహర్తను నేరుగా కలుసుకోవడం సాధ్యమౌతుంది. దీనివల్ల వ్యవహర్తకు పరిశోధకుడిపై సదభిప్రాయం కలిగి విరివిగా సమాచారాలనందివ్వగలడు.

9.7.3. నిరక్షరాస్యులు, చిన్నపిల్లలు, ఆటవిక ప్రజలు మొదలైన వారి వద్దనుండి సమాచారాన్ని సేకరించాలంటే ఈ పద్ధతి ఒక్కటే సమంజసమైంది.

9.7.4. తాను సేకరించిన విషయ సామగ్రి తనకు సంతృప్తికరంగా లేనప్పుడు పరిశోధకుడు వ్యవహర్తను తరచి తరచి ప్రశ్నించి కావలసిన సమాచారం పొందడానికి ఇందులో అవకాశముంది.

9.7.5. సందర్శన జరుగుతున్నప్పుడు ఎదురుచూడని విధంగా కొన్ని ముఖ్యాంశాలు వెలుగులోనికి రావచ్చు.

9.7.6. పరిశోధకుడు, వ్యవహర్త పరస్పరం సందర్శన జరపడంవల్ల ఒకరి మీద ఒకరికి ఉన్న అనుమానాలు నివృత్తి అవుతాయి.

9.7.7. వ్యవహర్త మాటలతో వ్యక్తం చెయ్యలేని మనోభావాలను అతని శారీరక చేష్టల ద్వారా తెలుసుకోవచ్చు. తన ప్రశ్నలకు వ్యవహర్త ఏ విధంగా ప్రతిస్పందిస్తున్నాడో తెలుసుకొనే అవకాశం ఈ పద్ధతిలో ఉంది.

9.7.8. వ్యవహర్తకు అనుకూలమైన రీతిలో తన భాషను మార్చుకొని అతనితో స్వేచ్ఛగా మాట్లాడగల అవకాశం ఇందులో ఉంది.

9.7.9. వ్యవహర్త ప్రశ్నలను పొరపాటుగా అర్థం చేసుకొనే ప్రమాదం ఇందులో లేదు. పరిశోధకుడు వ్యవహర్తకు కలిగిన సంశయాలను పోగొట్టి సరైన సమాధానాలు పొందవచ్చు.

9.7.10. పరిశోధకుడు భిన్న వ్యవహర్తల భిన్న ప్రవృత్తుల, భిన్న పరిస్థితులకు అనుగుణంగా తన ప్రశ్నలను మార్చుకొని సందర్శనను కొనసాగించ డానికి వీలవుతుంది.

9.7.11. వ్యవహర్తలు కాగితంమీద పెట్టడానికి సంశయించే అంశాలను, అంత రంగిక విశేషాలను ఈ పద్ధతి ద్వారా తెసుకోవచ్చు.

9.7.12. వ్యవహర్త తానడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పలేనప్పుడు అనుబంధ ప్రశ్నల ద్వారా వారికి ఆ విషయం స్ఫురింపజేసి సరైన సమాధానాలు పొందవచ్చు.

9.7.13. తాను సేకరించిన అంశాల నిజానిజాలను నిర్ధారించడానికి కూడ ఈ సందర్శన పద్ధతి తోడ్పడుతుంది.

## 9.8. పరిమితులు

9.8.1. పరిశోధకుడు వివిధ ప్రాంతాలకు వెళ్ళి వ్యవహర్తలను కలుసుకోవలసి ఉన్నందున ఈ పద్ధతి అధిక ధన వ్యయంతో కూడుకొన్నది.

9.8.2. పరిశోధకుడు వ్యవహర్తలను ప్రత్యక్షంగా కలుసుకోవడంవల్ల చాలా సమయం పడుతుంది.

9.8.3. వ్యవహర్త సుముఖంగా లేనప్పుడు, సందర్శనకు సహకరించనప్పుడు పరిశోధకుడి శ్రమ నిష్ప్రయోజనమవుతుంది.

9.8.4. వ్యవహర్త ఆవేశపూరితుడైనప్పుడు అతడందించే సమాచారం ప్రామాణిక మైనదిగా ఉండదు.

9.8.5. పరిశోధకుడు ఎదురుగా ఉన్నప్పుడు వ్యవహర్త తానందిస్తున్న సమాచారం అతనికి ఆసక్తికరంగా ఉండాలనే తలంపుతో లేనిపోని కల్పనలను, వర్ణనలను, అతిశయోక్తులను కలగలిపి ప్రసంగిస్తాడు. ఇవి వాస్తవానికి దూరంగా ఉండే ప్రమాదం ఉంది.

9.8.6. వ్యవహర్తల హావభావాలను, శారీరక చేష్టలను పరిశోధకుడు పొరబాటుగా అర్థం చేసుకొనే ప్రమాదం గూడ ఉంది.

9.8.7. వ్యవహర్త చెప్తున్న అంశాలను గుర్తుంచుకునే నేర్పు పరిశోధకుడికి లేనప్పుడు సందర్శన వ్యర్థమౌతుంది.

9.8.8. పరిశోధకుడికి టేప్ రికార్డర్, కెమేరా మొదలైన సాంకేతిక పరికరాలను ఉపయోగించే నేర్పు లేనప్పుడు సందర్శన నిష్ప్రయోజనమౌతుంది.

9.8.9. సంభాషణలంటే సంకోచమున్న వారితోను, చిన్నపిల్లలతోను, చెవిటి మూగవారితోను, మనః స్థిమితం లేని వారితోను దీన్ని నిర్వహించలేము.

9.8.10. సందర్శనలో లభించే సమాచారాలు వ్యక్తిగత అనుభవాల మీద ఆధారపడి ఉండడంచేత, అవి ఆత్మాశ్రయంగా (Subjective) ఉండే అవకాశం ఉంది.

## 9.9. ఉపసంహారం

పైన పేర్కొన్న పరిమితుల్ని కాదనలేము. కాని సందర్శకుడు నేర్పు, సమయస్ఫూర్తి, స్నేహభావాలతో తెలివిగా సందర్శన కొనసాగించి వాస్తవాలను సేకరించవచ్చు. విషయ సేకరణకు ఈ పద్ధతే అత్యున్నతమైంది. సందర్శన కేవలం ఒక శాస్త్రమే కాదు అది ఒక కళగూడాను.

REFERENCE :


1. P. V. Young, *Research Methodology in Social Sciences* P. 62.
2. T. V. Thanulingam *Scientific Method and Social Research*, P. 223.
3. John Galtung, *Theory and Method of Social Research* Quoted by B. N. Ghosh, *Scientific Method and Social Research*, P. 225.
4. I bid. 224.

# 10. సిద్ధాంత వ్యాస రచన
(THESIS WRITING)

## 10.1. ప్రవేశిక

పరిశోధకుడు తన పరిశోధన ఫలితాలను సిద్ధాంత వ్యాస రూపంలో పండిత లోకానికి అందించడం పరిశోధన కార్యక్రమంలో చివరి భాగం. పరిశోధనాంశానికి సంబంధించిన విషయ సామగ్రిని సేకరించిన పిదప పరిశోధకుడు వాటిని క్రమ పద్ధతిలో వర్గీకరించి విశ్లేషించి నూతన సిద్ధాంతాలను ప్రతిపాదిస్తాడు. పరిశోధకుని ప్రతిభ, సామర్థ్యాలను అతడు వెలువరించే నివేదిక వెల్లడి చేస్తుంది. పరిశోధకుడు కొత్తగా ఆవిష్కరిస్తున్న సిద్ధాంతాలు ఇతరులకు కూడ స్పష్టంగా అర్థమయినపుడే అతని కృషి సార్థకమవుతుంది. విజ్ఞాన ప్రగతి త్వరితగతిన సాగాలంటే పరిశోధకుడు కనుగొన్న నూతనాంశాలు శాస్త్ర ప్రపంచానికి తెలియవలసిన అవసరం ఎంతైనా ఉంది.

పరిశోధన నివేదిక లేదా సిద్ధాంత వ్యాస రచన తయారు చేసే క్రమం ఒకటుంది అని మనం గ్రహించాం. ప్రమాణపూర్వకమైన నివేదిక తయారు కాకముందు కొన్ని దశలను అధిగమించవలసి ఉంటుంది. వాటిని ఒక్కటొక్కటీ పరిశీలిస్తూ వద్దాం.

## 10.2. పరిశోధన నివేదిక - రూప భేదాలు

నివేదికలను మౌఖిక నివేదిక, లిఖిత నివేదిక అని రెండు విధాలుగా విభజించవచ్చు.

### 10.2.1. మౌఖిక నివేదిక
(Oral Report)

నివేదికలు సాధారణంగా లిఖిత రూపంలో సమర్పించబడుతున్నప్పటికీ ఒక్కోసారి మౌఖిక నివేదికలు కూడ అవసరమవుతుంటాయి? కార్యనిర్వాహక అధికారులకు సమర్పించే నివేదికలు, సమావేశాల్లో ప్రసంగించే నివేదికలు వాగ్రూపంలోనే ఉంటాయి. లిఖిత నివేదికలకు ఎంతటి కృషి చేయాల్సి

ఉంటుందో మౌఖిక నివేదికలకు అంతకు మించిన కృషి చేయాల్సి ఉంటుంది. నివేదికలో చెబుతున్న అంశాలు స్పష్టంగానూ, సూటిగానూ ఉండాలి. భాష సరళంగానూ, వినేవారి మనసు కెక్కే విధంగాను ఉండాలి. అందరి ఒప్పుదలకు పాత్రమయ్యేటట్లు ఉండాలి. చెప్పిన అంశాలనే మళ్ళీమళ్ళీ చెబుతుండడం, పరిశోధనకు సంబంధించని విషయాలను చెప్పడం పరిహరించాలి.

## 10.2.2. లిఖిత నివేదిక
(Written report)

లిఖిత రూప నివేదికల్లో చాలా రకాలున్నాయి. నివేదిక ఎవరి నుద్దేశింపబడిందో వారిని దృష్టిలో పెట్టుకొని నివేదిక రచనా పద్ధతి మారుతూ ఉంటుంది.

### 10.2.2.1. సులభ నివేదిక
(Popular Report)

సామాన్య ప్రజలనుద్దేశింపబడిన నివేదిక సరళంగాను, ఆసక్తికరంగాను ఉండాలి. సహ పరిశోధకులకోసం రాసే నివేదికకన్న ఇటువంటి నివేదికలు రాయడం కష్టం. అసాధారణ విషయాలను పేలవం కాకుండ, తేలికగా బోధపడే విధంగా రాయాలి. ఇటువంటి నివేదికల్లో పారిభాషిక పదాలు, శాస్త్ర విషయాలు అధికంగా చోటు చేసుకోకూడదు. గణాంక వివరాలు కూడ మితంగా ఉండాలి. ప్రధానాంశాలను మాత్రం చెబితేచాలు. అంటే విషయ వైవిధ్యం, సారళ్యం అనే గుణాలు తప్పనిసరిగా ఉండాలన్నమాట.

### 10.2.2.2. అధికారి కిచ్చే నివేదిక
(Report for the Administrator)

నిర్వాహక అధికారులకోసం రాయబడిన నివేదిక ఒక ప్రత్యేక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని రాయబడుతుంది. పరిశ్రమ అభివృద్ధిని లక్ష్యంగా పెట్టుకొని వ్యాపార సంస్థలు ఇటువంటి పరిశోధనలను ప్రోత్సహిస్తుంటాయి. వాణిజ్య రంగాల్లో ప్రయోగింపబడే పారిభాషిక పదాలు ఇందులో అధికంగా చోటు చేసుకున్నప్పటికీ మొత్తంమీద శైలి సుబోధకంగా ఉండాలి. అన్నిటికన్న ముఖ్యమైన అంశం నివేదిక సంగ్రహంగా ఉండడం. పరిశోధన పద్ధతులు మొదలైనవి వివరించ నక్కరలేదు. పరిశోధన ఫలితాలను మాత్రం చెబితేచాలు.

### 10.2.2.3. సాంకేతిక నివేదిక
(Technical Report)

పరిశోధకుడు తోటి పరిశోధకుల కోసం తాను పరిశీలించిన విషయాలను శాస్త్రీయ పరిభాష నుపయోగించి వివరించడమే సాంకేతిక నివేదిక అవుతుంది. సాంకేతిక నివేదికలో ప్రధానంగా నాలుగు అంశాలుంటాయి.

1. పరిశోధన సమస్య - దాని స్వభావం (Problem and its nature)
2. పరిశోధన విధానం - శాస్త్రీయ నిర్దుష్టత (The Method and its Scientific accuracy)
3. విషయ సామగ్రి-సాక్ష్యాధారాల ప్రామాణికత (The data and their dependability)
4. విషయ సామగ్రి-కార్యకారణ సంబంధం, హేతుపూర్వక అవబోధనం. (The logical relationship of the date and interpretation)

విశ్వవిద్యాలయాలకు సమర్పించే సిద్ధాంత వ్యాసాలన్నీ సాంకేతిక నివేదికలే.

## 10.3. సిద్ధాంత వ్యాస రూపకల్పన (Thesis Outline)

సిద్ధాంత వ్యాసం రాయడానికి ముందు పరిశోధకుడు దాని గురించి ఒక చక్కని ప్రణాళికను రూపొందించుకోవాలి. ఇది సిద్ధాంత వ్యాస రూపకల్పన అవుతుంది. అంటే సిద్ధాంత వ్యాసం చట్రం అన్నమాట. మానవ శరీరంలో అస్థిపంజరం ఎంత ముఖ్యమైందో ఈ నమూనా ప్రణాళిక కూడా అంత ముఖ్యమైనదే. అధ్యాయాల విభజన, ఒక్కొక్క అధ్యాయంలో శీర్షికలు, ఉపశీర్షికలు, పేరాలు, ఏ అంశం ఎక్కడ చెప్పాలి. ఈ విధంగా సిద్ధాంత వ్యాసానికి సంబంధించిన ప్రతి అంశాన్ని ముందుగానే ఊహించి స్థూలంగా నిర్ణయించుకోవాలి. తరువాత నమూనా ప్రణాళికను దగ్గర పెట్టుకొని సిద్ధాంత వ్యాసం రాయడం ప్రారంభించాలి.

నమూనా ప్రణాళికను తయారు చేయటానికి ఎంతో ఆలోచన, అనుశీలన అవసరం ఉంది. పర్యవేక్షకునితో, అనుభవజ్ఞులతో, సహపరిశోధకులతో చర్చలు సాగిస్తూ వారి సలహాను పాటిస్తూ నమూనా ప్రణాళికను నిర్మించుకోవాలి. నమూనా సమగ్రంగా ఉండాలి. వివరంగా సుబోధకంగా ఉన్నపుడే సిద్ధాంత వ్యాసం రాయడం సులభమవుతుంది.

## 10.4. సిద్ధాంత వ్యాస స్వరూపం (FORMAT OF THE THESIS)

సిద్ధాంత వ్యాసం మూడు భాగాలుగా ఉంటుంది. అవి :

1. పూర్వ భాగం (Prelimanaries)
2. గ్రంథ భాగం (Main body of the thesis)

3. ఆధార విషయ వివరణ (Reference Material)

వీటిని ఒక్కొక్కటి పరిశీలిద్దాం. ప్రతి భాగంలోనూ కొన్ని అంశాలు ఒక క్రమంలో చోటుచేసుకుంటాయి.

## 10.4.1. పూర్వభాగం

1. ముఖపత్రం (Front Page)
2. ధ్రువీకరణ పత్రం (Declaration)
3. కృతజ్ఞతలు (Acknowledgements)
4. ఉపోద్ఘాతం (Preface)
5. విషయ సూచిక (Contents)
6. రేఖాచిత్రాల పట్టిక (List of Tables)
7. సంకేతాల పట్టిక (List of Abbreviations)

## 10.4.2. గ్రంథభాగం

1. ఉపక్రమణిక
2. పరిశోధనాంశ వివరణ
3. పరిశోధనాంశ పద్ధతి
4. సాక్ష్యాధారాలు
5. ఫలితాల ప్రకటన
6. అంతస్సూచనలు
7. ఉపసంహారం

## 10.4.3. ఆధార విషయ వివరణ

1. అనుబంధం
2. ఉపయుక్త గ్రంథ పట్టిక

## 10.4.1. పూర్వభాగం

### 10.4.1.1. ముఖ పత్రం

సిద్ధాంత వ్యాసంలో మొదట పేజీ ముఖపత్రం అవుతుంది. ముఖపత్రాన్ని రంగులతో, చిత్రాలతో అలంకరించకూడదు. సాధారణంగా ఉంటే చాలు. - ముఖ పత్రంలో ఈ క్రింది విషయాలు ఉండాలి :

1. సిద్ధాంత వ్యాస శీర్షిక
2. పరిశోధకుని పేరు, అధ్యయన శాఖ
3. ఏ డిగ్రీ కోసం, ఏ విశ్వవిద్యాలయానికి సమర్పిస్తున్నది

4. సమర్పిస్తున్న తారీఖు. (నెల, సంవత్సరం)

ఈ మధ్య కొన్ని సిద్ధాంత వ్యాసాల్లో పర్యవేక్షకుల పేరు కూడ ముఖ పత్రంలో చోటుచేసుకోవటం కనిపిస్తూ ఉంది.

## 10.4.1.2. ధ్రువీకరణ పత్రం

పరిశోధకుడే స్వయంగా ఈ పరిశోధన కృషిని సాగించాడనీ, ఈ సిద్ధాంత వ్యాసం ఇంతకు పూర్వం డిగ్రీ కోసం ఏ విశ్వవిద్యాలయానికీ సమర్పించబడలేదని పర్యవేక్షకుడు ధ్రువీకరిస్తూ సంతకం చేసిన పత్రాన్ని ధ్రువీకరణ పత్రం అంటారు. అదేవిధంగా పరిశోధకుడు కూడ ధ్రువీకరణ పత్రం ఇవ్వవలసి ఉంటుంది.

## 10.4.1.3. కృతజ్ఞతలు

కృతజ్ఞతలు రాయడంలో మరీ అతివినయం చూపకూడదు. పర్యవేక్షకుల గురించి, అధ్యాపకుల గురించి అతిగా పొగుడుతూ రాయడంకన్న మితంగా చెబితే చాలు. కుటుంబసభ్యులు, స్నేహితులు మొదలైనవారి పట్టిక ఎంత సంక్షిప్తంగా ఉంటే అంత మంచిది.

## 10.4.1.4. ఉపోద్ఘాతం

ఈ భాగం వీలయినంత వరకు సంగ్రహంగా ఉండాలి. పరిశోధనాంశం ఎన్నుకోవడానికి గల కారణాలు, దాని ప్రాముఖ్యత, పరిశోధన ఉద్దేశం, పరిశోధనలో అనుసరించిన విధానాలు, ఫలితాలు, ఇంకా ఈ దిశలో పరిశోధన కొనసాగించటానికి ఉన్న అవకాశాలు మొదలైనవి సంక్షిప్తంగా ఒక పేజీలో వచ్చేటట్లుగా చెబితే చాలు.

## 10.4.1.5. విషయసూచిక

సిద్ధాంత గ్రంథంలోని ప్రధాన అధ్యాయాల శీర్షికలు వరుసగా పేర్కొనడమే విషయ సూచిక అవుతుంది. ఒక్కొక్క అధ్యాయంలోని ముఖ్యమైన విభాగాలను కూడ విషయ సూచికలో చేర్చడం మంచిది. ఆయా శీర్షికలకు ఎదురుగా ఆయా పుటల సంఖ్యలను కూడ ఇవ్వాలి. శీర్షికలకు పెద్ద అక్షరాలను, ఉప శీర్షికలకు చిన్న అక్షరాలను రాయాలి. మొత్తానికి విషయ సూచిక సిద్ధాంత వ్యాసంలోని ముఖ్యాంశాలను స్థూలంగా తెలియజేయాలి.

## 10.4.1.6. రేఖాచిత్రాల పట్టిక (List of Tables)

సిద్ధాంత వ్యాసంలో పేర్కొనబడిన పట్టికలను, రేఖాచిత్రాలను వరుసగా పుటలసంఖ్య క్రమానుసారంగా తెలియజేయాలి.

### 10.4.1.7. సంకేతాల పట్టిక (Abbreviations)

సిద్ధాంత గ్రంథంలో పరిశోధకుడు తాను వాడిన సంకేతాలను పేర్కొని వాటి పూర్తి వివరాలను పాఠకులకు తెలియజేయాలి.

ఈ పూర్వభాగంలోని పుటలను రోమను అంకెలలో సూచించాలి.

### 10.4.2. గ్రంథ భాగం

సిద్ధాంత వ్యాసంలో ముఖ్యమైన భాగం ఇదే. పరిశోధనాంశానికి తగినట్లు ఈ భాగాన్ని కొన్ని అధ్యాయాలుగా విభజించుకోవాలి. ప్రతి అధ్యాయానికి శీర్షికలు, ఉప శీర్షికలు ఇచ్చుకుంటూ వెళ్ళాలి. సిద్ధాంత వ్యాసంలో ఈ క్రింది అంశాలను తప్పనిసరిగా పేర్కొనాలి :

### 10.4.2.1. ఉపక్రమణిక (Introduction)

ఈ సిద్ధాంత వ్యాసంలో ఒకరు ఏమేమి ఎదురు చూడవచ్చు అనేది సిద్ధాంత వ్యాసం ప్రారంభంలోనే పరిశోధకుడు చెప్పివేయడం మంచిది. సమస్య స్వభావాన్ని, పరిశోధన పరిధినీ, ఫలితాల సారాంశాన్నీ, పరిశోధన పద్ధతులనూ ముందు మాటల్లోనే తెలియజేయాలి. పరిశోధనాంశ పూర్వాపరాలను, దాని స్వభావాన్ని వివరించడంతోపాటు పరిశోధనలో ఎదుర్కొన్న అడ్డంకులను, సాధక బాధకాలను పరిశోధకుడు పేర్కొనవలసి ఉంటుంది. పరిశోధనాంశం నేపథ్యం వివరించటం, పరిశోధనకు ఒక రంగాన్ని రకరకాల సంబంధిత ఉపపత్తులతో, భావనలతో, శాస్త్రీయకాధారాలతో సిద్ధం చేయటం ఈ అధ్యాయంలో సాధారణంగా చేసేపని. మొత్తానికి ఈ విధమైన ఉపోద్ఘాతం పాఠకుల మార్గాన్ని సుగమం చేయడమే కాకుండా సిద్ధాంత వ్యాసం దేన్ని ఉద్దేశించింది అనేది విహంగ వీక్షణంలాగ తెలియ జేస్తుంది.

### 10.4.2.2. పరిశోధనాంశ వివరణ (Statement of the Problem)

పరిశోధనాంశ వివరణ అనేది పరిశోధన శీర్షికను గురించిన వివరణ అని చెప్పవచ్చు. సిద్ధాంత వ్యాసం మొదట్లోనే పరిశోధనాంశాన్ని గురించి వివరించడం మంచిది. సిద్ధాంత వ్యాసం ఏ అంశాన్ని గురించి రాయబడుతుందో పరిశోధకుడు స్పష్టంగా తెలియజేయాలి. ఒక పరిశోధన సమస్యలో విభిన్నాంశాలు ఉండవచ్చు వాటిలో ఏ అంశాన్ని, ఏ విభాగాన్ని ఇది పరిశీలిస్తున్నది అని కచ్చితంగా ఒక చట్రాన్ని ఏర్పరచుకోవాలి.

పరిశోధనాంశాన్ని వివరించేటప్పుడు పరిశోధకుడు పరిశోధన పరిధిని కూడ పేర్కొనాలి. దీనికి సంబంధించిన పరిశోధనలు ఏవైనా పూర్వం జరిగి ఉన్నప్పుడు వాటిని సంక్షిప్తంగా పేర్కొనాలి. ఆ పరిశోధనలు ఎంతవరకు పురోగమించాయి. తను ఎక్కడ నుండి కొనసాగిస్తున్నాడు అనేది తెలియ జేయాలి.

పరిశోధన అనేది భగవంతునిలాగ ఆద్యంతాలు లేనిది. మధ్యలో జొరబడుతున్న మనం ఇతరులకు కృతజ్ఞులమై వున్నామనే విషయాన్ని మరచి పోకూడదు. కొందరు ఇతరులు చెప్పిన అంశాలను ఎట్లా ఉన్నవి అట్లాగే గ్రహించినప్పటికీ, ఏదో తాము మాత్రమే ప్రపంచంలో లేని విషయాలను కనిపెట్టినట్లు స్వాతిశయాన్ని ప్రదర్శిస్తూ ఉంటారు. ఒక్కొక్క పరిశోధనలోనూ మనం ఎందరో మహానుభావుల నిరంతర నిర్విరామ కృషి ఫలితాలను ఉపయో గించుకుంటూ వారు వదలిపెట్టిన చోటునుండి పరిశోధనలు కొనసాగిస్తున్నాము. పరిశోధన అనేది రిలే పరుగుపందెం వంటిది. అందులో ముందు పరుగెత్తి వచ్చిన వాళ్ళనూ, వెనుక పరుగెత్తడానికి సిద్ధంగా ఉన్న వాళ్ళనూ మనం మరిచిపోకూడదు.

కాబట్టి పరిశోధకుడు ఇతరుల పరిశోధనలను ఉదహరించాలి. అవసర మైనపుడు వాటిని సంక్షిప్తంగా పేర్కొనాలి. మొదట్లోనే పూర్వ పరిశోధకుల కృషిని సంక్షిప్తంగా చెప్పడంవలన తరువాతి అధ్యాయాల్లో పరిశోధకుడి స్వీయ పరిశ్రమ, అతని పరిశోధన ఫలితాలు పాఠకులకు తెలియవస్తాయి. పరిశోధనాంశాన్ని గురించిన ఈ వివరణ సిద్ధాంత వ్యాసానికి ఒక చక్కని నాంది భాగంగా రూపొందాలి.

### 10.4.2.3. పరిశోధన పద్ధతి (Methodology)

పరిశోధనలో తాను అనుసరించిన పద్ధతులను తెలియజేయడం పరిశోధకుడు ఎటువంటి పరిస్థితిలోనూ మరిచిపోకూడదు. అందరికీ తెలిసిన పద్ధతులనే తాను పాటించినపుడు దాని గురించిన వివరణ సంక్షిప్తంగా ఉంటేచాలు. తాను అనుస రించిన పద్ధతి ఇంతకు ముందు ఎవరూ అనుసరించనిదై ఉండి, పరిశోధన ప్రపంచానికే కొత్తదైనపుడు దాని గురించి విస్తరించి రాయడం అవసరం. అలాంటప్పుడు నూతన పద్ధతులను పాటించడం వలన ఎదురైన చిక్కులను వాటికి పరిష్కారాలను సూచించడం మంచిది.

ఈ సందర్భంలోనే పరిశోధకుడు పరిశోధన ప్రణాళికలను, విషయ సామగ్రి సేకరణ పద్ధతులను వివరించవలసి ఉంటుంది.

### 10.4.2.4. సాక్ష్యాధారాలు
(Facts)

సాక్ష్యాధారాల వలన వాస్తవాలు తెలియవస్తాయి. సాక్ష్యాధారాలనే వాస్తవాలని కూడ చెప్పవచ్చు. పరిశోధన ఫలితాలు వీటిమీదనే ఆధారపడి ఉంటాయి. పరిశోధకుడు తను చెబుతున్న ప్రతి అంశానికి సాక్ష్యాధారాలు చూపించాలి. వీలైనచోట్ల గణాంక వివరాలను (Statistical Tables) రేఖా చిత్రాలను (charts) ఇవ్వడం మంచిది.

సాక్ష్యాధారాలను అవసరమైతే తప్ప ఇతరమైన వాటిని పరిహరించాలి. పఠన సౌలభ్యానికి ఆటంకం కలగకుండ జాగ్రత్త వహించాలి. మరీ అవసర మైన వాటిని అనుబంధంలో ఇవ్వడం మంచిది. అంతేకాని అనవసర పాండిత్య ప్రదర్శనా చాపల్యం పనికిరాదు.

### 10.4.2.5. ఫలితాల ప్రకటన

పరిశోధనలో పరిశోధకుడు కనుగొన్న నూతనాంశాలే పరిశోధన ఫలితాలని చెప్పవచ్చు. పరిశోధకుడు రూపొందించుకొన్న ఊహాప్రతిపాదనకు అనుకూలంగానో లేక ప్రతికూలంగానో పరిశోధన ఫలితాలు ఉంటాయి. పరిశోధనలో పరిశోధన ఫలితాలు ఏవి అని కాదు ముఖ్యం. ఆ ఫలితాలు రావడానికిగల పరిస్థితులు ఏమిటో వాటిని మాత్రమే జాగ్రత్తగా గమనించాలి.

ఫలితాలను స్పష్టంగానూ, అందరికీ అర్థమయ్యే రీతిలో ప్రకటించడం చాలా ముఖ్యం. పరిశోధకుడు తాను కనుగొన్న ఒక్కొక్క నూతనాంశానికి సముచిత ప్రాధాన్యమివ్వాలి. ఏ అంశాన్ని ఎక్కడ వెలువరించాలో బాగా తెలిసి ఉండాలి. అంతేగాని ముందు వెనుకలుగా తారుమారు చేయకూడదు. ముఖ్యమైన ఫలితాలను ముందు పేర్కొని తదితరాంశాలను తరువాత వెలువరించడం మంచిది.

పరిశోధకుడు తాను సేకరించిన సాక్ష్యాధారాల వలన కనుగొన్న నూతనాంశాలను పూర్వ పరిశోధకులు వెలువరించిన అంశాలతో పోల్చి వివరించి చెప్పాలి. పరిశోధన ఫలితాలు ఇతర పరిశోధనలతో ఎంతవరకు సరిపోలుతూ ఉంది ? ఎంతవరకు వ్యతిరేకిస్తూ ఉంది ? ఈ భేదం ఎందువలన ఏర్పడింది ? పరిణామాంశాలు ఏమిటి ? మొదలైనవి ఈనాటి యువ పరిశోధకులు నిష్కర్షగా చెప్పాలి.

ఎక్కువ భాగం పరిశోధనలు ఒక ముగింపుకు రాకపోవడం అనేది సహజంగానే జరుగుతూ ఉంటుంది. ఒక్కొసారి ఫలితాలు సందేహాస్పద మైనవిగా ఉంటాయి. అటువంటప్పుడు పరిశోధకుడు దానికి గల పరిమితులను నిష్కర్షగా చెప్పివేయాలి. సందేహాలను, సమాధానం దొరకని ప్రశ్నలను పేర్కొ నాలి. తాను రూపొందించుకొన్న ఊహాప్రతిపాదనకు తన పరిశోధన ఫలితాలు

వ్యతిరేకంగా ఉన్నప్పటికీ పరిశోధకుడు వాటిని స్పష్టంగా పేర్కొనాలి. అలా వ్యతిరేకంగా ఉండటానికిగల కారణాలను కూడ తెలియజేయాలి. ఎందుకంటే పరిశోధన ఎడతెగని ఒక స్రవంతి లాంటిది. తాను వదలిన అంశాన్ని ఇతరులు కొనసాగించే విధంగా పరిశోధన సమస్యను వదలి వెళ్ళడమే మంచిది.

ఫలితాంశాలు రూఢిలో ఉన్న అంశాలతో విభేదిస్తున్నప్పటికీ, తన ఇష్టాలకు వ్యతిరేకమైనప్పటికీ వాటిని వెలువరించడానికి పరిశోధకుడు సంశయించకూడదు. అంతేగాకుండ వాస్తవాలను తన ఇష్టాయిష్టాలకు తగినట్లు, మార్చి చెప్పకూడదు. వాస్తవాలను వాస్తవాలుగా ప్రకటించాలి. ఈ వాస్తవాల నుండి గ్రహించిన నూతనాంశాలు ఆ వాస్తవాలకు తగినట్లుగా రూపొందుతాయి. కాని తన ఇష్టానికి తగినట్లు కాదు.

## 10.4.2.6. అంతస్సూచనలు (Implications)

నూతానాంశాలను ప్రకటించిన వెనువెంటనే పరిశోధకుడు దానికి సంబంధించిన, దానితో ముడిపడిన అంతస్సూచనలను కూడ వివరించి పరిశోధన ముందుకు సాగడానికి మార్గం చూపించాలి. పరిశోధన అంతటితో ఆగిపోకుండా కొనసాగించడమే ఈ శీర్షిక ముఖ్యోద్దేశం.

పరిశోధకుడు తన పరిశోధన సమస్యకు ఏ విధంగా పరిష్కారాన్ని కనుగొన్నదీ తెలియజేయాలి. పరిష్కారం దొరకని సమస్యలను, పరిష్కారం కావలసిన సమస్యలను కూడ ఎత్తిచూపాలి. ఆ సమస్యల పరిష్కారంకోసం ఏ విధమైన పరిశోధన చేయాల్సి ఉంటుందో తెలియజేయాలి.

## 10.4.2.7. ఉపసంహారం (Conclusions)

పరిశోధన సారాంశాన్ని సంగ్రహంగా తెలియజేయడమే ఈ శీర్షిక ముఖ్యోద్దేశం. ముందు ముందు కొనసాగించవలసిన పరిశోధనలను ఈ అధ్యాయంలో వివరంగా తెలియజేయడం మంచిది. ముందు అధ్యాయాల్లో చెప్పిన విషయాల సారాంశాన్ని మాత్రమే చెప్పాలిగాని, కొత్త విషయాలను చెప్పే ప్రయత్నం చేయకూడదు.

## 10.4.3. ఆధార విషయ వివరణ (Reference Material)

ఇది సిద్ధాంత వ్యాసంలో చివరి భాగం. ఇందులో అనుబంధం, ఉపయుక్త గ్రంథ పట్టికా, రెండూ చేరుతాయి.

### 10.4.3.1. అనుబంధాలు
(Appendices)

సిద్ధాంత వ్యాసంలో గ్రంథభాగం పూర్తయిన వెంటనే అనుబంధాలను చేర్చవలసి ఉంటుంది. గణాంక వివరాలు, పట్టికలు, చిత్రాలు, మేపులు, ఛాయాచిత్రాలు, ప్రశ్నావళులు, వ్యవహర్తలతో జరిపిన సంభాషణలు మొదలైనవన్నీ అనుబంధం - 1, అనుబంధం - 2 అంటూ విడివిడిగా పేర్కొనవలసి ఉంటుంది. సిద్ధాంత వ్యాసంలోని పుట సంఖ్యలనే అనుబంధాలకు కూడ కొనసాగించాలి.

### 10.4.3.2. ఉపయుక్త గ్రంథ సూచి
(Bibliography)

సిద్ధాంత వ్యాసంలో అనుబంధాలు తరువాత ఉపయుక్తగ్రంథ పట్టికను ఇవ్వవలసి ఉంటుంది. మొదటి పుట మధ్య భాగంలో 'ఉపయుక్త గ్రంథ సూచి' అనే శీర్షికను పెద్ద అక్షరాలలో రాయాలి. పరిశోధనలో తనకు సహకరించిన గ్రంథాలన్నింటినీ పరిశోధకుడు తప్పనిసరిగా పేర్కొనాలి. ఆరోపాలను అకరాదిగా అమర్చుకొని వరుసగా రాయాలి.

ఉపయుక్త గ్రంథ పట్టికను ఇచ్చేటప్పుడు రచయిత పేరు, పుస్తకం పేరు, ప్రచురణ సంస్థ, ఊరు, తేదీ, - ఇలా ఒక క్రమాన్ని అనుసరిస్తూ రాయాలి. వీటిని గురించి తరువాతి అధ్యాయాల్లో వివరంగా తెలుసుకుంటారు. ఈ పట్టిక సిద్ధాంత వ్యాసంలో ఒక భాగమే కాబట్టి దీని పుటల సంఖ్య అరబిక్ అంకెలతో ముందు దానితో చేర్చివేయాలి.

## 10.5. ఉత్తమ సిద్ధాంత వ్యాస రచనకు కొన్ని మెలకువలు

సిద్ధాంత వ్యాసం సక్రమంగా రూపొందినపుడే పరిశోధకుని కృషి సార్థకమవుతుంది. కాబట్టి పరిశోధకుడు నివేదికలో ఎటువంటి లోపాలు రాకుండ జాగ్రత్త వహించాలి. నివేదిక రచనా సందర్భంలో పరిశోధకుడు ఈ క్రింది సూచనలను పాటించడం మంచిది.

### 10.5.1. నోట్సు మీద సాధికారికత
(Control over notes)

పరిశోధకుడు తాను చదివిన పుస్తకాల నుండి అవసరమైన సాక్ష్యాధారాలను, ముఖ్యమైన అంశాలను కార్డులమీద రాసుకొని భద్రపరుచుకోవాలి. సరైన సాక్ష్యాధారాలను చూపిస్తూ రాసినపుడే అది పరిశోధక వ్యాసమై శాస్త్ర సమ్మతమవుతుంది.

సాక్ష్యాధారాలు లేనపుడు అది ఒక సాధారణ వ్యాసమవుతుంది కాని పరిశోధక వ్యాసంగా పరిగణింపబడదు.

పరిశోధకుడు తాను సేకరించిన సమాచారాన్ని ఒకటికి నాలుగుసార్లు బాగా చదవాలి. ఏ అంశం ప్రధానమో ఏది అప్రధానమో నేర్పుగా వింగడించుకోవాలి. ఏ సమాచారం ఎక్కడుందో జాగ్రత్తగా గుర్తుంచుకోవాలి. తాను సేకరించిన సమాచారాన్ని ఆయా సందర్భాల్లో ఉపయోగించుకునే నైపుణ్యం కలిగి ఉండాలి.

## 10.5.2. ఆలోచన ప్రాధాన్యత
(Role of thought)

పరిశోధన అనేది కర్మాగారాల్లో యంత్రసహాయంతో నిర్మించే వస్తువు కాదు. పరిశోధకుని మేధాశక్తితో, బుద్ధికుశలతతో కొనసాగించవలసిన కార్యక్రమమిది. కాబట్టి పరిశోధన ఒక్కొక్క దశలోనూ ఆలోచన ఎంతో ప్రాధాన్యం వహిస్తుంది.

పరిశోధకులు తమ పర్యవేక్షకుల మీదనో, స్నేహితుల మీదనో ఆధారపడి తమ అమూల్యకాలాన్ని వ్యర్థం చేసుకోకుండ తమ మెదడుకు పని కల్పించాలి. ఆలోచన అనేది ఒక క్రమంలో సాగేట్లు చూడాలి. మెదడును అందుకనుగుణంగా సిద్ధం చేస్తూ రావాలి. అప్పుడే ఒక విషయం మీద సుదీర్ఘమైన సునిశితమైన ఆలోచన చేయటం మెదడుకు పట్టుబడుతుంది. దేనికైనా సాధన ముఖ్యమని అందుకే అనటం. తనంతట తానుగా ఆలోచించలేని వ్యక్తి పరిశోధన చేయలేడు. ఆలోచనల్లో మౌలికత లేనప్పుడు పరిశోధన ఇతరుల ఆలోచనల ముక్కల మీద తయారుచేసిన అతుకుల బొంతగా తయారవుతుంది. నివేదికలోని కృత్రిమత్వం పైకే కనిపిస్తుంటుంది.

సుదీర్ఘ ఆలోచన, నిరంతరాన్వేషణ, నిశిత పరిశీలన ఫలితంగా పరిశోధకుడు తన సమస్యలకు పరిష్కారాన్ని తెలుసుకోగలుగుతాడు. పరిశోధనాంశాన్ని ఎన్నుకొన్న రోజు నుండే దాని గురించి చింతించడం ప్రారంభించాలి. సర్వకాల సర్వావస్థల్లోనూ పరిశోధనాంశాన్ని గురించి ఆలోచిస్తూ ఉండాలి. విషయ సామగ్రి సేకరణ, ప్రణాళిక, సిద్ధాంత వ్యాస స్వరూపం ఈ విధంగా ఒక్కొక్క దశలోనూ తన కృషిని పర్యాలోచిస్తూ ముందుకు సాగాలి. సిద్ధాంత వ్యాసం రాసేటపుడు ఆలోచించుకోవచ్చునని బద్ధకించ కూడదు.

## 10.5.3. సంతృప్తికరమైన రూపకల్పన
(Formation of a satisfactory outline)

సిద్ధాంత వ్యాస స్వరూపం, దాని విలువ పరిశోధకుడు తాను జాగ్రత్తగా

ఆలోచించి రూపొందించుకొన్న నమూనా ప్రణాళిక మీదనే ఆధారపడి ఉంటుంది. కాబట్టి పరిశోధకుడు వివిధ పరిశోధక వ్యాసాలను జాగ్రత్తగా పరిశీలించి తన పరిశోధనాంశానికి తగినట్లు ఒక ప్రణాళికను తయారు చేసుకోవాలి. పర్యవేక్షకులతో ఒకటి రెండుసార్లు చర్చలు జరిపి ప్రణాళికను తీర్చి దిద్దుకోవాలి.

నమూనా ప్రణాళికను రూపొందించుకొన్న తరువాత పరిశోధకుడు సిద్ధాంత వ్యాసం తొలి చిత్తుప్రతి రాయడం ప్రారంభించాలి. ఇదే తొలి రచనాదశ అంటారు. భావ వ్యక్తీకరణలో అస్పష్టత, శైలిలో సంక్లిష్టత లేకుండ రచన సాగించాలి. చెప్పదలచుకొన్న అంశాలను స్పష్టంగా సరళంగా చెప్పాలి. అలా లేనపుడు పరిశోధకుని శ్రమ వ్యర్థమవుతుంది. కాబట్టి పరిశోధకుడు ఈ క్రింది అంశాలను గుర్తుంచుకొని రచన సాగించాలి :

1. పాఠకులను దృష్టిలో పెట్టుకొనడం
2. రాయతలచుకొన్న సమస్య - అధ్యాయాల లేక శీర్షికల గురించిన పర్యాలోచన
3. తాను సేకరించిన విషయ సామగ్రి ఆధారంగా కనుగొన్న వాస్తవాలపై పరిశోధకునికి గల సాధికారికత
4. పరిశోధకుని భాషా పాండిత్యం
5. సాక్ష్యాధారాల స్వరూపం, సమగ్రత.

## 10.6. మూడు రచనా దశలు
(Three Drafts)

పరిశోధకుడు మూడు దశల్లో అంటే ముమ్మార్లు రాసి సిద్ధాంత గ్రంథాన్ని చక్కగా రూపొందించాలి. ఒక్కొక్క దశలోనూ తాను రాసిన విషయాలను సరిదిద్దుకుంటూ సిద్ధాంత వ్యాసానికి పరిపూర్ణత తీసుకురావాలి.

### 10.6.1. మొదటి దశ
(First Draft)

ఈ దశలో పరిశోధకుడు పరిశోధనాంశానికి సంబంధించిన అన్ని విషయాలను సిద్ధాంత వ్యాసంలో పొందుపరచడానికి ప్రయత్నించాలి. ఏది ముందు చెప్పాలి, ఏది వెనక చెప్పాలి అనే విషయాన్ని జాగ్రత్తగా ఆలోచించి నిర్ణయించుకోవాలి. వాస్తవాలను నిరూపించే సాక్ష్యాధారాలను ఆయా అధ్యాయాల్లో, ఉచిత సమయంతో బహిర్గతపరచాలి. ఒక భావం తరువాత మరొక భావం వచ్చేటట్లు విషయాలను వివరించాలి. కార్యకారణ సంబంధముండేటట్లు ఆయా అంశాలను క్రమబద్ధంగా అమర్చాలి. వివరించవలసిన వాటిని వివరించాలి. సంగ్రహించవలసిన వాటిని

సంగ్రహించాలి. తాను చెబుతున్న నూతనాంశాలను తగిన ఉపపత్తులతో ధ్రువీక రించాలి. వివిధాంశాలలో ఒక ఏకీభావాన్ని తీసుకు రావడానికి ప్రయత్నించాలి. మొదటి పర్యాయం రాస్తున్నపుడు విషయానికే ప్రాముఖ్యత ఇవ్వాలి. భాషకు, శైలికి రెండవ స్థానం ఇవ్వాలి.

10.6.1.1. రచనా దశల్లో ఈ మొదటి దశ మిగిలిన రెండు దశలకన్న ముఖ్య మైంది. దీనివలన మూడు ప్రయోజనాలున్నాయి:

1. నీటిలో దూకినపుడు మాత్రమే ఈత నేర్చుకోవడానికి సాధ్యమవుతుంది. తెల్ల కాయితాలను ముందు వేసుకొని తరువాత రాయొచ్చు, తరువాత రాయొచ్చు అంటూ కాలాన్ని నెట్టివేస్తుంటారు కొందరు. సభా కంపం లాగానే తెల్ల కాయితాలు చూడగానే (Blank Paper fright) కలిగే భయమిది. రాయడం మొదలు పెడితేగాని ఈ భయం తొలగిపోదు. ఇదే కృత్యాద్యవస్థ.
2. ప్రతి పరిశోధకుడు మొదట్లో అలా రాయొచ్చు, ఇలా రాయొచ్చు అంటూ కల్పనాలోకంలో విహరిస్తుంటాడు. సిద్ధాంత వ్యాసం రాయడం చాలా తేలిక అనే అభిప్రాయం వీరిది. రాయడం ప్రారంభిస్తేగాని అది ఎంత కఠినమనేది వారికి తెలిసిరాదు.
3. సాక్ష్యాధారాలను ఒక క్రమ పద్ధతిలో అమర్చుకోవడానికి, అస్పష్టంగా ఉన్న అంశాలను బోధపరుచుకోవడానికి, నమూనా ప్రణాళికలో రూపొందించుకొన్న విధంగా సిద్ధాంత వ్యాసానికి ఒక ఆకారం తీసుకు రావడానికి ఈ మొదటి దశ సహాయపడుతుంది. ఈ దశలో పరిశోధ కుడు తాను ఇష్టపడిన అన్ని అంశాలను పేర్కొనడం చేయాలి. రెండో దశలో అనవసరమైన వాటిని పరిహరించవచ్చు.

10.6.1.2 పరిశోధకుడు సిద్ధాంత వ్యాసం తొలి చిత్తు ప్రతి రాస్తున్నపుడు ఈ క్రింది సూచనలు దృష్టిలో ఉంచుకోవాలి:

1. ఒక్కొక్క శీర్షికకు, ఉపశీర్షికకు సంబంధించిన అంశాలను వరుసగా పేర్కొంటూ రావాలి. దీనికి వేర్వేరు కాయితాలను ఉపయోగించడం మంచిది. విషయసామగ్రి సమగ్రంగానూ, రూపొందించుకొన్న నమూనా ప్రణాళిక సరైనదిగానూ ఉన్నపుడే ఇది సాధ్యమవుతుంది.
2. చెప్పదలచుకొన్న అంశాలను విస్తరించి, వివరించి రాయాలి. నూత నాంశాలు తోచినపుడు ఉచిత స్థానాల్లో వాటిని పొందుపరచాలి.
3. ఒక్కొక్క అధ్యాయంలో ఏ అంశాన్ని చెప్పదలచుకున్నామో ఆ అంశాన్ని మాత్రమే స్పష్టంగా వెలువరించాలి.

4. తాను సేకరించిన సమాచారాన్ని మళ్ళీ మళ్ళీ చదివి ముఖ్యమైన అంశా లను మరచిపోకుండా జాగ్రత్త వహించాలి.

5. కొన్ని విశ్వవిద్యాలయాల్లో సిద్ధాంత వ్యాసం 250 పుటలకు మించ రాదనే నిబంధన ఉంది. సిద్ధాంత వ్యాస ప్రణాళికను రూపొందిస్తున్న ప్పుడే పరిశోధకుడు ఈ అంశాన్ని గుర్తుంచుకోవడం మంచిది.

పైన పేర్కొన్న సూచనల్ని పాటిస్తూ రాయడం వల్ల సిద్ధాంత వ్యాసం సమగ్రంగా రూపొందవచ్చు. కాని అదే శుద్ధ ప్రతి (Final report) అని చెప్ప డానికి లేదు. మళ్ళీ మళ్ళీ సరిదిద్దవలసిన అవసరం ఎంతైనా ఉంది. కాని ఆ పనిని కొంతవరకు వాయిదా వేయడం మంచిది. ఎందుకంటే కొంతకాలం గడిచిన తరువాత పరిశోధకుడిలో నూతన దృక్పథం (Fresh mind) ఏర్పడవచ్చు. ఆలోచనల్లో పరిణతి రావడానికి కూడ అవకాశముంది. ఈ దశలో భాషను గురించి, శైలిని గురించి అధికంగా శ్రద్ధ వహించక పోయినప్పటికీ రచన సరళంగా సుబోధకంగా ఉండేలా జాగ్రత్త వహించాలి.

పరిశోధకుడు తన ఇష్టాయిష్టాలను వ్యక్తం చేయడం, ఆవేశానికి లోను కావడం, తన గురించి గొప్పగా చెప్పుకోవడం మొదలైనవి పూర్తిగా పరిహరించాలి. 'నేను కనుగొన్నాను', 'ఇది నా సిద్ధాంతం', 'ఇది నా పరిశోధన ఫలితం' మొద లైన ఆత్మస్తుతి పూర్వక వాక్యాలను ప్రయోగించ కూడదు. 'ఈ సాక్ష్యాధారాల వలన ఈ విషయాలు తెలియవస్తున్నాయి' అని వినయంగా చెప్పాలి. పరిశోధకుని శైలి వస్త్వాశ్రయం (objective)గా ఉండాలి గాని ఆత్మాశ్రయం (Subjective)గా ఉండకూడదు.

సిద్ధాంత వ్యాస రచన ప్రారంభించడానికి మునుపే కొందరు 'మున్నుడి' రాయడం చేస్తుంటారు. సిద్ధాంత వ్యాసంలో మున్నుడి ముందు భాగంలో ఉన్నప్పటికీ అది రాయవలసినది మాత్రం ఆఖరులో.

పాఠకులు 'ఉపసంహారం' భాగాన్ని మిక్కిలి శ్రద్ధగా చదువుతారు కాబట్టి 'ఉపసంహారం' రయడానికి ఆధారభూతమైన మధ్యభాగాన్ని జాగ్రత్తగా రాయవలసి ఉంటుంది.

### 10.6.2. రెండవ దశ (Second Draft)

మొదటిదశలో రాసిన సిద్ధాంత వ్యాస చిత్తు ప్రతిని సరిదిద్దుకుంటూ పరిశోధకుడు మళ్ళీ రాయాలి. ఈ రెండవ దశలో భాషకు, శైలికి ప్రాధాన్యత ఇవ్వాల్సి ఉంటుంది. చదివేవారికి సరళంగానూ, స్పష్టంగానూ, ఆసక్తికరంగానూ ఉండే విధంగా సిద్ధాంత రచన సాగాలి. మళ్ళీమళ్ళీ రాస్తూ తన రచనా సామర్థ్యాన్ని

పెంపొందించుకోవాలి. వ్యాకరణ దోషాలు, అక్షర దోషాలు లేకుండా చూసుకోవాలి. శైలి (style), పదప్రయోగం (Diction) మొదలైన విషయాల్లో ఎంతో జాగ్రత్త వహించాలి. విరామ చిహ్నాలను ఉపయోగించటం బాగా తెలిసి ఉండాలి. వర్ణనలతో, అలంకారాలతో చెప్పదలచుకొన్న అంశాన్ని తప్పుదారి పట్టించకుండ జాగ్రత్త వహించాలి. సాధ్యమైనంత వరకు సరళంగా, స్పష్టంగా చెప్పడానికి ప్రయత్నించాలి.

### 10.6.2.1. పరిశోధకుడు పాటించవలసిన కొన్ని విధులు

1. తానే సొంతంగా తన సొంత బాణీలో రాయాలి.
2. సిద్ధాంత వ్యాసం అందరికీ సుబోధకంగా ఉండే విధంగా రచన సాగించాలి. ఒక పరిశోధకుడికి మాత్రం అది బోధపడితే చాలదు. పాఠకులకు కూడా అర్థం కావడమే ప్రధానం.
3. ముఖ్యమైన అంశాలకు ప్రాధాన్యత ఇస్తూ వాటిని స్పష్టంగా నొక్కి చెప్పాలి.
4. సంగ్రహ విషయాలను విస్తరించి రాస్తున్నపుడు పదాలను మితంగా, జాగ్రత్తగా ప్రయోగించాలి. అందుకని చెప్పదలచుకొన్న విషయాలను కలగాపులగం చేయకూడదు. సంగ్రహించి రాస్తూ అదే సమయంలో అది చదివేవారికి అర్థమయ్యేలా శ్రద్ధ వహించాలి.
5. కఠిన పదాలను, సంక్లిష్ట వాక్య నిర్మాణాలను పరిహరించాలి. సిద్ధాంత వ్యాసంలోని వాక్యాలు చిన్న చిన్నవిగా ఉండడం మంచిది.
6. తాను ఏం చెప్పదలచుకున్నాడో పరిశోధకుడు మొదట్లో స్పష్టంగా నిర్ణయించుకోవాలి. తాను చెప్పదలచుకొన్న అంశంమీద తనకు చక్కని పరిజ్ఞానమున్నపుడే భాష తడబాటు లేకుండ చక్కగా సాగుతుంది.
7. పదాలను ప్రయోగించడంలో ఎంతో జాగ్రత్త వహించాలి. పదాలు ఒకదానిని పోలి మరొకటి ఉన్నప్పటికీ అర్థంలో కొంత తేడా ఉంటుందన్న విషయం విస్మరించకూడదు. పడికట్టు పదాలను, సందిగ్ధంగా, సందేహాస్పదంగా ఉన్న పదాలను అర్థం తెలియకుండా ఇష్టం వచ్చినచోట ప్రయోగించకూడదు.
8. తాను రాసినవాటిని మళ్ళీ మళ్ళీ చదవాలి. ఒక పెన్సిలు తీసుకొని తప్పుల్ని సరిదిద్దుకోవాలి. వాక్యనిర్మాణం లోపాలను సవరించుకోవాలి. శైలి కుంటుపడకుండా సాఫీగా సాగేటట్లు చూడాలి.
9. పట్టికలు, రేఖాచిత్రాలు, గ్రాఫులు మొదలైనవి ఉపయోగించి క్లిష్ట విషయాలను సైతం పాఠకులకు బోధపరచడానికి ప్రయత్నించాలి.

10. విషయానికి ఎంత ప్రాధాన్యం ఇస్తామో అంతటి ప్రాధాన్యం భాషకు కూడ ఇవ్వవలసి వుంటుందన్న అంశాన్ని పరిశోధకుడు గుర్తుంచుకోవాలి. సిద్ధాంత వ్యాసానికి విలువను, విశిష్టతను చేకూరుస్తుంది భాష.

### 10.6.2.2. పరిహరించవలసిన కొన్ని లోపాలు

1. అలంకారాలతో, వర్ణనలతో రాసే పద్ధతికి స్వస్తి చెప్పాలి.
2. విషయాలను ఆధారపూర్వకంగా చెప్పాలి. అలాగని ప్రతి చిన్న విషయానికి సాక్ష్యాధారాలను, వాద వివాదాలను పేర్కొనడంవల్ల పాఠకులకు దిక్కు తోచని పరిస్థితి ఏర్పడుతుంది.
3. చెప్పిందే చెప్పడం, సంబంధంలేని విషయాలను చెప్పడం, కార్యకరణ సంబంధం లేకుండ ఏవేవో చెప్పడం, అస్పష్టంగా ఏదో రాసుకుంటూ వెళ్ళడం చేయకూడదు.
4. వ్యావహారికమో, లేక గ్రాంథికమో ఏదో ఒక శైలినే ఉపయోగించాలి. రెంటిని కలగాపులగం చేయకూడదు. విశ్వవిద్యాలయాల నిబంధన ప్రకారం వ్యావహారికమో, గ్రాంథికమో ఏదో ఒకటి ఎన్నుకోవాలి. ఇప్పుడు దాదాపు అన్ని విశ్వవిద్యాలయాలు శిష్టవ్యావహారికంలో సిద్ధాంతవ్యాసరచన చేయటాన్ని అంగీకరిస్తున్నాయి.
5. ఏ కొందరినో దృష్టిలో పెట్టుకొని రాసే పద్ధతి మానుకోవాలి. అలా లేనపుడు అది పాక్షికతకు దారితీస్తుంది. సత్యావిష్కరణే సిద్ధాంత వ్యాస ధ్యేయం. కాని ఏ కొందరినో విమర్శించడమో, స్తుతించడమో కాదు.

### 10.6.2.3. ప్రామాణికతను నిర్ధారించే కొన్ని ప్రశ్నలు

రెండవ చిత్తుప్రతి (Second Draft) రాయడం పూర్తయిన తరువాత, దాని ప్రామాణికతను నిర్ధారించుకోవడానికి పరిశోధకుడు ఈ క్రింది ప్రశ్నలను తనకు తానే వేసుకొని సమాధానాలను తెలుసుకోవడానికి ప్రయత్నించాలి.

1. సిద్ధాంత వ్యాసం శీర్షిక పరిశోధనాంశాన్ని కచ్చితంగా సూచిస్తూ ఉందా?
2. ఒక్కొక్క అధ్యాయం, శీర్షిక, ఉప శీర్షికలు పరిశోధనాంశానికి అనుగుణంగా విభజించడం జరిగిందా?
3. సిద్ధాంత వ్యాసం అధ్యాయాల శీర్షికలు, ఉప శీర్షికలు ఒకదానికొకటి కార్యకరణ సంబంధం కలిగి ఉన్నాయా?

4. ఒక్కొక్క శీర్షిక ఒక్కొక్క అంశాన్ని మాత్రమే వ్యక్తం చేస్తోందా?

5. తగినన్ని సాక్ష్యాధారాల సేకరణ జరిగిందా?

6. సేకరించిన విషయ సామగ్రి విశ్లేషణ ఆధునిక శాస్త్ర పద్ధతుల్లో జరిగిందా?

7. మొదట రూపొందించుకొన్న ఊహాప్రతిపాదన తగినరీతిలో పరీక్షలకు, ప్రయోగాలకు గురి చేయబడిందా?

8. సమస్యలు సంతృప్తికరంగా పరిష్కృతమయ్యాయా?

9. కనుగొన్న నూతనాంశాలు, ఉపసంహారంలో చెప్పబడిన విషయాలు ఇవన్నీ, వాస్తవాలను ఆధారంగా చేసుకొని చెప్పబడినవే కదా?

10. ఆలోచనల్లో పరిణతి వచ్చేటంతవరకు విషయాలను గురించిన అన్వేషణ కృషి జరిగిందా?

11. పరిశోధన ఫలితాలు పాఠకులు నమ్మదగిన రీతిలో ఉన్నాయా? సిద్ధాంత వ్యాసంలో ఈ భాగం ముఖ్యమైనదిగా పరిగణింపవచ్చా?

12. సిద్ధాంత వ్యాసం ప్రారంభంలో ఉన్న మున్నుడి, చివరలో ఉన్న ఉపసంహారం రెండూ ఒకదానికొకటి సరిపోలుతూ ఉన్నాయా?

13. శైలి సరళంగా ,ఆసక్తికరంగా ఉందా?

14. పాఠకులను దృష్టిలో పెట్టుకొని రాసినట్లు తెలియవస్తోందా?

15. సిద్ధాంత వ్యాసం ఎంతవరకు పరిపూర్ణత తీసుకురావడానికి సాధ్యమవుతుందో అంతవరకు చక్కగా వచ్చే విధంగా ప్రయత్నం జరిగిందా?

16. పరిశోధకుడు సిద్ధాంత వ్యాసాన్ని తనకు తానే స్వయంగా పరిశీలించుకొన్నప్పుడు అది అతనికి సంతృప్తికరంగా ఉందా?

## 10.6 3. మూడవదశ

(Third Draft)

సిద్ధాంత వ్యాస రచనా దశల్లో ఇది చివరిదని చెప్పవచ్చు. ఆఖరున ఏవైనా మార్పులు చేయడానికి, పొరబాట్లను సరిదిద్దుకోవడానికి ఇక్కడ అవకాశముంది. పరిశోధకుడు ప్రతి పుటనూ జాగ్రత్తగా చదువుకుంటూ వెళ్ళాలి. పొడవైన వాక్యాలను చిన్న చిన్న వాక్యాలుగా విడగొట్టి రాయాలి. వాక్య నిర్మాణంలో ఉన్న అస్పష్టతను తొలగించాలి. కఠిన పదాల స్థానంలో తేలికైన పదాలను చేర్చాలి.

ఆయా సందర్భాలకు తగినట్లు విరామ చిహ్నాలను ఉపయోగించామా? లేదా? అక్షర దోషాలు ఏవైనా ఉన్నాయా? అని జాగ్రత్తగా పరిశీలించాలి. చిన్న చిన్న పొరపాట్లే కదా అని నిర్లక్ష్యం చేయకూడదు. ఇవి సిద్ధాంత గ్రంథం విలువను తగ్గిస్తాయి. పరిశోధకుడు మళ్ళీ మళ్ళీ చదువుతూ సిద్ధాంత వ్యాసానికి తుది మెరుగులు ఇస్తూ అందంగా తీర్చిదిద్దాలి.

## 10.7. ఉపసంహారం

'సాధనమున పనులు సమకూరు ధరలోన' అన్నట్లు ఏ పనైనా సాధన చేస్తేగాని పరిపూర్ణత చేకూరదనేది లోక సత్యం. రచన సరళంగా, స్పష్టంగా, సుబోధకంగా ఉండాలంటే రాతలో కూడ అభ్యాసముండాలి. అంటే మన ఆలోచనలను సరైన రూపంలో సక్రమంగా పాఠకులకు భాషద్వారా అందజేసే నైపుణ్యం అనొచ్చు. దీన్నే వ్యక్తీకరణ నేర్పు (Communication skill) అంటాం. అర్థం చేసుకోవడం వేరు. భాషద్వారా అందించడం వేరు. ఈ రెంటికి సమన్వయం ఉంటేనే రచన ఉత్తమ భావమాధ్యమంగా తయారవుతుంది. అందుకనే సాధన ముఖ్యం అన్నది. సిద్ధాంత వ్యాసాన్ని మూడు దశల్లో తిరగ రాయడం వల్ల మనం సాధించే ఉత్తమ ప్రయోజనం కూడ అదే.

# 11. ఆధార విషయ వివరణ
(REFERENCE MATERIAL)

## 11.1. ప్రవేశిక

సిద్ధాంత వ్యాసానికి ప్రామాణికతను, విలువను తీసుకువచ్చేవి సాక్ష్యాధారాలు. పరిశోధకుడు తాను చెబుతున్న ప్రతి అంశానికి సాక్ష్యాధారాలను చూపించినపుడే అది శాస్త్రీయ పరిశోధన అవుతుంది. పాఠకులు ఏ సమాచారం ఎక్కడుందో మరింత వివరంగా తెలుసుకోవడానికి ఉపయుక్త గ్రంథ పట్టిక, సూచికలు, ఉల్లేఖాలు, ఉదాహృతాలు మొదలైనవి సాక్ష్యాధారాలుగా ఉపయోగపడుతాయి. వీటిని ఎక్కడ రాయాలి, ఎలా రాయాలి మొదలైన విషయాలను ఈ అధ్యాయంలో పరిశీలిద్దాం.

ముందుగా ఈ ఆధార విషయాలను పేర్కొనడం వల్ల ప్రయోజనాలను సమీక్షిద్దాం. తరవాత ఆధార విషయ విభాగాలు అయిదింటిని ఒక్కొక్కటినే వివరంగా తెలుసుకుందాం.

## 11.2. ప్రయోజనాలు

సిద్ధాంత గ్రంథంలో సాక్ష్యాధారాలను పేర్కొనడంవల్ల చాలా ప్రయోజనాలున్నాయి.

1. పరిశోధకుడు తాను చెబుతున్న విషయాలను, ఇస్తున్న వాస్తవాలను ప్రామాణికమైనవిగా నిరూపించడానికి ఇవి తోడ్పడుతాయి.
2. కొందరు పరిశోధకులు ఇతరుల అభిప్రాయాలను తమ అభిప్రాయాలుగా ప్రకటిస్తుంటారు. ఇది చాలా తప్పు. ఇతరుల అభిప్రాయాలను స్వీకరించినపుడు వాటిని సవివరంగా స్పష్టంగా పేర్కొనడం పరిశోధకుల కర్తవ్యం. ఇతరుల అభిప్రాయాలను వారి అభిప్రాయాలుగానే చెప్పడంవల్ల పరిశోధకుని నిజాయితీ తెలియవస్తుంది.
3. సాక్ష్యాధారాల వలన పరిశోధకుడు తన అభిప్రాయాలను నిరూపించవచ్చు. నూతన సిద్ధాంతాలను ప్రతిపాదించవచ్చు. అలాగే ఇతరుల అభిప్రాయాలను, పూర్వ సిద్ధాంతాలను తోసిపుచ్చడానికి కూడ ఇవి తోడ్పడతాయి.

4. పరిశోధనకు సంబంధించిన విషయాలను మరింత వివరంగా తెలుసుకోవాలనే ఆసక్తిని పాఠకుల్లో రేకెత్తిస్తాయి.
5. పరిశోధకుడు చెబుతున్న విషయాల్ని సరిపోల్చి పరీక్షించి తెలుసుకోవడానికి ఇవి తోడ్పడుతాయి.
6. సూచికలు, అనుబంధాలు, ఉల్లేఖాలు మొదలైన వాటి ద్వారా పరిశోధకుడు మరింత అధనపు సమాచారం ఇవ్వడానికి వీలవుతున్నది.

# 11.3. సూచికలు
(NOTES)

ఆధార విషయ వివరణలో 5 విభాగాలున్నాయని ముందే అనుకున్నాం. అందులో మొదటిది సూచికలు. వీటికి అధస్సూచికలు, పాదసూచికలు, జ్ఞాపికలు, అధోజ్ఞాపికలు అనే పేర్లు కూడ ఉన్నాయి. సిద్ధాంత వ్యాసంలో మొదటి నుంచి చివరివరకు సూచికలు ఒక ముఖ్యమైన అంశంగా భావింపబడుతోంది. వ్యాసంలో సూచికలను చేర్చినపుడే అది పరిశోధక వ్యాసం అని అందరిచేతా అంగీకరింపబడు తుంది. సాక్ష్యాధారాల సేకరణ క్షుణ్ణంగా జరిగిందన్న విషయం సూచికల వలన తెలుసుకోవచ్చు. కాబట్టి పరిశోధకుడు పరిశోధన ప్రారంభం నుండే సూచికలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించి వాటిని సిద్ధాంత వ్యాసంలో సందర్భాను సారంగా పొందుపర్చాలి.

సూచికల వలన వ్యాసానికి విలువ పెచ్చుతుంది, అందం వస్తుందనే భ్రమతో కొందరు లెక్కకు మించిన సూచికలు చేరుస్తుంటారు. "వ్యాసం అర పేజీ, సూచికలు ఒకటిన్నర పేజీ" అనే రీతిలో 'పరిశోధక వ్యాసాలు' తయారు చేస్తుం టారు కొందరు. పరిశోధకుడు ఈ అంశాలను గుర్తుంచుకొని అవసరమైనవి మాత్రమే పేర్కొనాలి.

## 11.3.1. ప్రయోజనాలు

1. పాఠకుడు ఒక అంశాన్ని గురించి మరింత వివరంగా తెలుసుకోవాలను కున్నప్పుడు, తత్సంబంధిత గ్రంథాలను అన్వేషించి వాటిని పఠించడానికి ఈ సూచికలు తోడ్పడుతాయి.
2. సిద్ధాంత వ్యాసంలో చేర్చదగినంత ప్రాముఖ్యం లేకపోయినప్పటికీ తత్సం బంధిత విషయాలను పేర్కొనడానికి సూచికలు ఉపకరిస్తాయి.
3. పూర్వ పరిశోధకుల కృషిని, వారి పరిశోధన ఫలితాలను వాడుకున్నపుడు వారికి కృతజ్ఞతలు చెప్పడానికి సూచికలు ఉపయోగపడతాయి. ఇవి పరి శోధకుని నిజాయితీని వ్యక్తం చేయడమేకాక సిద్ధాంత వ్యాసానికి ప్రామాణి కతను కూడ తీసుకువస్తాయి.

4. ఇది గ్రంథ భాగాన్ని తెలుసుకోనడానికి సహాయపడుతుంది. కాని గ్రంథ భాగంలో చేర్చదగినంత ముఖ్యం కాదు - అని భావించినపుడు ఆ విషయా లను సూచికల్లో చెప్పడం వలన సిద్ధాంత వ్యాసం కుంటుపడకుండా ఏక ధారగా సాగుతుంది.

5. ఒక విషయానికి సంబంధించి భిన్నాభిప్రాయాలున్నపుడు వాటిని సిద్ధాంత గ్రంథంలో సుదీర్ఘంగా చర్చించకుండా సూచికల్లో ఆ విషయాల సారాం శాన్ని ఇవ్వవచ్చు.

6. ఇతరుల అభిప్రాయాల నుండి తన స్వంత అభిప్రాయాలను వేరుచేసి చూపించడానికి సూచికలు తోడ్పడుతాయి.

7. సిద్ధాంత వ్యాసంలో మరొక భాగాన్ని చూడమని చెప్పడానికి (cross reference), సంబంధిత ఇతర గ్రంథాలను సూచించడానికి వీటిని ఉప యోగించవచ్చు.

8. ఒక ఉల్లేఖనంగాని, లేక ఉదాహృత వాక్యంగాని అది ఎక్కడ నుండి గ్రహింపబడిందో సూచికల వలన తెలియజేయవచ్చు.

9. ఏదైనా ఒక అనువాద భాగాన్ని సిద్ధాంత వ్యాసంలో పేర్కొన్నప్పుడు దాని మూలాన్ని సూచికల్లో ఇవ్వవచ్చు.

10. ఏదైనా ఒక విషయానికి సంబంధించి జరిగిన పరిశోధనలను, సూచికల్లో వివరించవచ్చు. పరిశోధకుని పాండిత్య ప్రకర్ష, ఆ అంశంమీద అతనికి గల సాధికారత సూచికల వలన తెలియవస్తుంది.

11. గణాంక వివరాల పట్టికలూ ఇతర రేఖాచిత్రాలకు సంబంధించిన వివరాలూ; అవి ఎక్కడనుండి గ్రహింపబడ్డాయో సూచికల్లో తెలియ జేయవచ్చు.

12. కొన్ని పదాలనుగాని లేక కొన్ని విషయాలనుగాని వివరించాల్సినపుడు నోట్సు రూపంలో సూచికల్లో చెప్పవచ్చు.

## 11.3.2. సూచికల్లో చేర్చదగిన విషయాలు

ఏది అసలు గ్రంథంలో చెప్పాలి, ఏది సూచికల్లో చేర్చాలి అన్నదాన్ని గురించి పరిశోధకుడు బాగా ఆలోచించి నిర్ణయించుకోవాలి.

1. అందరికీ తెలిసిన వాస్తవ విషయాలకు సాక్ష్యాధారాలను చెప్పవలసిన అవసరం లేదు. 'సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు', 'కవిత్రయం మహా భారతం రచించారు' – ఈ విధంగా అందరికీ తెలిసిన విషయాలకు సాక్ష్యాధారాలు అనవసరం.

2. ఒక గ్రంథానికి ఎన్నో ముద్రణలు వెలువడినపుడు వాటిలో పండితులచేత పరిష్కరింపబడి, అచ్చుతప్పుల్లేని మంచి ముద్రణను మాత్రమే సూచికల్లో పేర్కొనాలి.

3. ఒక విషయాన్ని చాలామంది పేర్కొని ఉన్నపుడు వారిలో మొట్టమొదటి సారిగా ఆ విషయాన్ని ఎవరు చెప్పారో వారిని మాత్రమే సూచికల్లో పేర్కొనాలి.

4. దృష్టాంతరాలు అధికంగా ఉన్నపుడు ఆ భాగాలను సూచికల్లో కాక అనుబంధంలో పేర్కొనడం మంచిది.

5. ప్రకటింపబడిన గ్రంథాలను మాత్రమే సూచికల్లో చేర్చడం మంచిది. అవసరమైనపుడు అముద్రిత గ్రంథాలను కూడ పేర్కొనవచ్చు.

6. సిద్ధాంత గ్రంథంలో చెప్పిన విషయాలనే తిరిగి సూచికల్లో చెప్పడం మంచిది కాదు.

7. సిద్ధాంత గ్రంథాల్లో అనువాదాలను మాత్రమే ఇవ్వాలి. మూలాన్ని సూచికల్లో చెప్పవచ్చును.

## 11.3.3. సూచికలను ఎక్కడ రాయాలి?

1. ఆయా పుటల క్రింది భాగంలో సూచికలను రాయవచ్చు. వీటిని అధస్సూచికలు (Foot notes) అంటారు.

2. ఒక్కొక్క అధ్యాయం చివరలో అధ్యాయానికి సంబంధించిన సూచికలను వరుసగా సంఖ్యలు ఇచ్చుకుంటూ రాయవచ్చు.

3. సిద్ధాంత వ్యాసం చివర అన్ని అధ్యాయాల్లో ఉన్న సూచికలను వరుసగా రాయవచ్చు.

సూచికలను 1, 2, 3 సంఖ్యల ద్వారా సూచించడం మంచిది. సిద్ధాంత గ్రంథంలో ఆయా స్థలాలలో సూచికలకు సంబంధించిన గుర్తులను (1, 2, 3 వంటి సంఖ్యలను) మామూలు అక్షరాల వరుసకు కొంత పైభాగంలో రాయాలి. సూచికలలో ఈ సంఖ్యలను వరుసగా రాయాలి. పుట క్రింద సూచికలను రాయడానికి కావలసినంత స్థలం వదలాలి. ఒకవేళ సూచికలను అధ్యాయం చివరగాని, సిద్ధాంత గ్రంథం చివరగాని ఇచ్చినట్లయితే ప్రధాన శీర్షికగా 'సూచికలు' అని మధ్యలో రాయాలి.

## 11.3.4. సూచికలు ఎలా రాయాలి?

సూచికలో గ్రంథానికి సంబంధించి ఈ క్రింది విషయాలను పొందుపరచాలి.

1. రచయిత పేరు
2. పుస్తకం పేరు
3. ప్రచురణ కర్త
4. ప్రచురణ స్థలం
5. ప్రచురించిన సంవత్సరం
6. ప్రసక్త విషయం ఉండే పుట.

సూచికలో గ్రంథకర్త పేరు ఆ గ్రంథం ముఖపత్రంలో ఉన్న విధంగానే రాయాలి. రచయితల పేర్లను మార్చి రాయకూడదు. మొదట ఇంటి పేరు తరువాత అసలు పేరు రాయాలి. బిరుదులు, డిగ్రీలు (పద్మశ్రీ, కళాప్రపూర్ణ, డాక్టరు, ప్రొఫెసరు) మొదలైనవి పూర్తిగా పరిహరించాలి. పుస్తకాల పేర్లను కూడ ఉన్నది ఉన్నట్లుగానే రాయాలి.

సూచికలో పేర్కొన్న గ్రంథాలన్నీ ఉపయుక్త గ్రంథ సూచికలో ఉంటాయి. కాబట్టి విషయాలను సమగ్రంగా తెలుసుకోవాలనుకున్నవారు ఉపయుక్త గ్రంథ పట్టిక చూసుకోవచ్చు.

## 11.3.5. సూచికలను రాసే పద్ధతులు

1. ఒకే రచయిత రాసిన పుస్తకం.
   ఇంటిపేరు, పేరు, **పుస్తకం పేరు**, ప్రచురణ సంస్థ, ప్రచురణ స్థలం, ప్రచురణ కాలం, పుట సంఖ్య.
2. ఇద్దరు ముగ్గురు రాసిన పుస్తకం.
   రచయితల పేర్లు, (పుస్తకంలో ఉన్న క్రమంలో), **పుస్తకం పేరు**, ప్రచురణ సంస్థ, ప్రచురణ స్థలం, ప్రచురణ కాలం, పుట సంఖ్య.
3. సంపాదకత్వం వహించిన పుస్తకం.
   సంపాదకుని పేరు (సం) **పుస్తకం పేరు**, ప్రచురణ కాలం, పుట సంఖ్య.
4. పత్రికలో ఒక వ్యాసం
   వ్యాసకర్త పేరు, **వ్యాసం పేరు**, పత్రిక పేరు, ప్రచురణ స్థలం, ప్రచురణ కాలం, పుట సంఖ్య.

## 11.3.6. సంకేతాక్షరాలు

ఒక గ్రంథాన్ని మళ్ళీ మళ్ళీ పేర్కొనవలసి వచ్చినపుడు ముందు చెప్పిన వివరాలన్నీ మళ్ళీ ఏకరువు పెట్టకుండా కొన్ని సంకేతాక్షరాల ద్వారా సూచించవచ్చు.

1. అదే. ఒక పుస్తకాన్ని పేర్కొన్న తరువాత వెంటనే అదే పుస్తకాన్ని
ibid సూచించాల్సినపుడు 'అదే' అని వాడవచ్చు. పుట సంఖ్యలో తేడా ఉంటే మాత్రం చూస్తే చాలు. ఆంగ్లంలో ibidem (in the same place or work) సూచించడానికి ibid. అని వాడుతుంటారు. తెలుగులో 'అదే' అనే సంకేతాన్ని వాడవచ్చు.

2. పూర్వోక్తం. ఒక పుస్తకంలో ఒక పుటను సూచించి మళ్ళీ అదే పుస్తకం
(Loco-cit) అదే పుటను వెంటవెంటనే కాకుండా మరికొన్ని అధస్సూచికల తరువాత పేర్కొనవలసివస్తే 'పూర్వోక్తం' అని రాయవచ్చు. పుట సంఖ్య వెయ్యనక్కరలేదు. ఆంగ్లంలో (Loco-cit) అనే సంకేతానికి (Loco citato in the same place cited) అనే అర్థముంది. తెలుగులో 'పూర్వోక్తం' అని సూచించవచ్చు.

3. పూర్వోక్తం. ఒక పుస్తకంలోని ఒక పుటను సూచించిన పిదప మరికొన్ని
పు. అధస్సూచికల తరువాత అదే పుస్తకంలోని వేరొక పుటను
(op-cit) పేర్కొనవలసి వచ్చినపుడు 'పూర్వోక్తం. పు.' అని రాయవచ్చు. opera citato అంటే "in the work cited quoted" అని అర్థం.

4. అదే. అంటే 'అదే పుస్తకం-పూర్వోక్తం' అని అర్థం. దీనికి ఆంగ్లంలో
పూర్వోక్తం. above అనే అర్థముంది.

(Supra) తనురాస్తున్న పుస్తకంలో నుంచే మొదట పేర్కొన్న విషయాలనే దృష్టాంతంగా మళ్ళీ చెప్పవలసి వచ్చినపుడు 'అదే పూర్వోక్తం' అని రాయవచ్చు.

5. అదే. తను రాస్తున్న పుస్తకంలో రాబోయే అధ్యాయాల్లో చెప్పబోతున్న
ఉత్తరోక్తం. విషయాలను ముందుగానే దృష్టాంతంగా సూచించాల్సినపుడు
(infca) 'అదే ఉత్తరోక్తం' అని రాయవచ్చు. దీనికి ఆంగ్లంలో below అనే అర్థముంది.

6. తే. లే. అంటే తేదీ లేదు (no date) అని అర్థం. ప్రచురింపబడిన సంవత్సరం తెలియనపుడు తే. లే. అని రాయవచ్చు.

7. వి. తె. అంటే 'వివరాలు తెలియదు' అని అర్థం. ప్రచురణ స్థలం మొదలైన వివరాలు తెలియనపుడు సంక్షిప్తంగా వి. తె. అని రాయవచ్చు.

8. (మూలం) ఉదాహృత వాక్యాలలో ఏవైనా తప్పులున్నప్పుడు వాటిని సరిదిద్దే అధికారం మనకు లేదు. మూలంలో ఇలాగే ఉంది అని చెప్పడానికి కుండలీకరణాలలో మూలం అని ఇలా (మూలం) రాయాలి.

9. సం. సంపాదకుడు.

10. అను. అనువాదకుడు.

11. మొ. మొదలైనవారు. గ్రంథకర్తలు ఇద్దరికంటె ఎక్కువ మంది ఉన్నప్పుడు వారిలో మొదటి పేరు తరువాత మొదలైనవారు అనే అర్థంలో సంక్షిప్తంగా మొ. అని రాయవచ్చు.

12. పు. పుట.

13. అ. సి. గ్రం. అముద్రిత సిద్ధాంత గ్రంథం.

14. సంక. సంకలనం/సంకలన కర్త.

15. పరి. పరిష్కరణ/పరిష్కర్త.

16. ము. ముద్రణ.

17. సంపు. సంపుటి.

18. మూ. మూలం.

19. చూ చూడు.

20. పో. చూ. (c.f.) పోల్చిచూడు.

పైన పేర్కొన్న సంకేతాలే కాకుండా పరిశోధకుడు తన పరిశోధనాంశానికి తగినట్లు సందర్భోచితంగా మరికొన్ని సంకేతాలను రూపొందించుకోవచ్చు. కాని తాను ప్రయోగించిన సంకేతాలన్నింటికీ పరిశోధకుడు వివరణలు ఇవ్వడం మాత్రం మరిచిపోకూడదు. సంకేతాక్షరాల వివరణలు సిద్ధాంత వ్యాసం ప్రారంభంలోనే పేర్కొనడం మంచిది.

## 11.3.7. తీసుకోవలసిన జాగ్రత్తలు

1. సూచికలు రాయడంలో ఒక పద్ధతిని అవలంబించినపుడు చివరకు అదే పద్ధతిని పాటించాలి.
2. సూచికల్లో ఇచ్చిన గ్రంథకర్తల పేర్లు, సంవత్సరాదులు, పుటలు అన్నీ ఒకటికి రెండుసార్లు జాగ్రత్తగా సరిచూసుకోవాలి.
3. సూచికల్లో చెప్పబడుతున్న విషయం ఎక్కువగా ఉన్నప్పుడు ఆ భాగాలను అనుబంధంలో చేర్చడం మంచిది.

4. సూచికల్లో ఇస్తున్న వివరాలు సంక్షిప్తంగా ఉండడం అవసరం.
5. సూచికలకు ఇస్తున్న గుర్తులు సిద్ధాంత వ్యాస భాగంలో ఉన్న గుర్తులకు సరిపోతున్నాయా అని గమనించాలి.

# 11. . ఉల్లేఖాలు
(References)

పరిశోధకుడు పరిశోధనాంశంగా ఏదైనా ఒక పురాణమో, కావ్యమో ఎంచుకున్నప్పుడు ఆయా పుస్తకాలను తన సిద్ధాంత గ్రంథంలో పదే పదే ఉల్లేఖించవలసిన అవసరం ఏర్పడుతుంది. అలాంటి ఉల్లేఖాలను (references) అధ్యాయసూచికల్లో వరుసగా ఇచ్చుకుంటూపోతే పుటలో సగభాగం ఇవే ఆక్రమిస్తాయి. ఇలాంటి వాటిని 'హార్వర్డు ఉల్లేఖన విధానం' (Harward system of referencing) ద్వారా సూచించవచ్చు.

పరిశోధకుడు ఒక కావ్యంలోని పద్యాలను ఉల్లేఖించాల్సినపుడు పద్యాల తరువాత బ్రాకెట్లో సంక్షిప్త కావ్యం పేరు, పర్వం పేరు, ఆశ్వాసం సంఖ్య, పద్యం సంఖ్య ఇస్తే చాలు.

(భార. ఆది 3. 144.) అంటే భారతం, ఆదిపర్వం, తృతీయాశ్వాసం, 144వ పద్యం అని అర్థం.

(మను. 2. 36.) అంటే మనుచరిత్ర, ద్వితీయాశ్వాసం, 36వ పద్యం అని అర్థం.

కొన్ని సందర్భాల్లో రచయిత పేరు, గ్రంథం ప్రచురణ సంవత్సరం, పుట సంఖ్య మాత్రం ఇస్తే చాలు.

రచయిత ఒకే సంవత్సరంలో రెండు మూడు పుస్తకాలను ప్రచురించి ఉన్నపుడు వాటిని 1985 అ, 1985 ఆ, 1985 ఇ అని వరుసగా సూచించవచ్చు. ఆ పుస్తకానికి సంబంధించిన పూర్వ వివరాలు ఆ గ్రంథ సూచికలో ఇవ్వబడి ఉంటాయి. కాబట్టి పాఠకులు ఉపయుక్త గ్రంథ సూచిక చూసి మిగిలిన వివరాలు తెలుసుకోవచ్చు.

# 11.5. ఉపయుక్త గ్రంథ సూచి
(Bibliography)

## 11.5.1. ప్రవేశిక

సిద్ధాంత వ్యాసంలోని ముఖ్యమైన భాగాల్లో ఉపయుక్త గ్రంథసూచి కూడా ఒకటి. పరిశోధనలో తనకు తోడ్పడిన ముద్రిత, అముద్రిత గ్రంథాలన్నింటినీ పట్టిక రూపంలో ఇవ్వడం పరిశోధకుని కర్తవ్యం. సిద్ధాంత

గ్రంథంలో చెప్పిన విషయాలను పరీక్షించి తెలుసుకోవడానికి ఈ ఉపయుక్త గ్రంథసూచి తోడ్పడుతుంది. పరిశోధన సమస్యను ఎన్నుకొన్న రోజు నుండే పరిశోధకుడు ఉపయుక్త గ్రంథసూచిని తయారు చేయడం ప్రారంభించాలి. (చూ. 6.)

## 11.5.2. ఉపయుక్త గ్రంథ సూచికను ఎక్కడ రాయాలి, ఎలా రాయాలి?

ఉపయుక్త గ్రంథసూచిక సిద్ధాంత వ్యాసం చివరలో ఉంటుంది. కొందరు దీనిని సిద్ధాంత గ్రంథం ప్రారంభంలోనే చేరుస్తుంటారు. ఉపయుక్త గ్రంథ సూచిక కొత్తపుటతో ప్రారంభించి పుటల సంఖ్యను అలాగే కొనసాగించాలి. సిద్ధాంత వ్యాసం పు. 240 తో ముగిసిందనుకుంటే ఉపయుక్త గ్రంథసూచిని పు. 241 తో ప్రారంభించాలి. ఉపయుక్త గ్రంథసూచి శీర్షికను చక్కగా పుట మధ్యలో వచ్చేలాగ రాయాలి.

ఆరోపాలను మొదట కార్డుల్లో రాసుకొని తరువాత వాటిని అకారాది వరుసలో అమర్చుకోవాలి. ఉపయుక్త గ్రంథసూచికలో ఆరోపాలన్నీ అకారాది వరుసలో ఉండేలా జాగ్రత్త వహించాలి. మొదట ఆరోపాన్ని ఎడమ నుండి వరుసగా రాసుకుంటూ రావాలి. ఆరోపం మొదటి పంక్తిలో పూర్తికాకుండా రెండవ లైనుకు కూడ సాగినపుడు ఆ పంక్తిని అయిదు ఖాళీల (spaces) వదలి ప్రారంభించాలి. అలాగే మూడవ పంక్తికూడ. కొత్త ఆరోపాన్ని మాత్రం మార్జిన్ మొదటి నుండి ప్రారంభించాలి.

ఉపయుక్త గ్రంథ సూచికలో ప్రతి ఆరోపమూ మూడు ప్రధాన విభాగాలను కలిగి ఉంటుంది. అవి : (1) రచయిత పేరు, (2) పుస్తకం పేరు, (3) ప్రచురణ వివరాలు. సాధారణంగా ప్రతి ఆరోపంలోనూ ఈ క్రింది అంశాలు వరుసగా ఉంటాయి. ప్రతి అంశం తరువాత ఒక బిందువు రెండు ఖాళీలు ఉంటాయి.

1. రచయిత పేరు
2. పుస్తకం పేరు
3. సంపాదకుడు/అనువాదకుడు/సంకలనకర్త
4. ముద్రణ
5. సంచికల సంఖ్య
6. ప్రచురణ స్థలం, ప్రచురణ కర్త, ప్రచురణ కాలం
7. పుటల సంఖ్య
8. ఇతర వివరాలు

ఉపయుక్త గ్రంథ సూచి రాయడంలో ఎన్నో పద్ధతులున్నాయి. M. L. A. Style Sheet లో సూచించిన విధానమే ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా పరిశోధకులందరూ అనుసరిస్తున్నారు. ఇక్కడ కూడ ఆ పద్ధతుల్నే వివరించటం జరిగింది.

మొదట అసలు పేరు రాసి తరువాత ఇంటిపేరు రాయాలి. అసలు పేరు తరువాత కామా, ఇంటిపేరు తర్వాత బిందువు ఉంచాలి. బిరుదులు, డిగ్రీలు ఏవీ రాయకూడదు. రెండు ఖాళీలు వదలి పుస్తకం పేరు ముఖపత్రంలో ఎలాగుందో అలాగే రాయాలి. పుస్తకం పేరును ఇటాలిక్స్‌లో గాని లేక పేరు కింద గీతగాని గీయవచ్చు. పుస్తకం పేరు తరువాత ఒక బిందువు రెండు ఖాళీలు వదలి పుస్తకం ఎక్కడ ప్రచురింపబడిందో తెలియ జేయాలి. ఊరిపేరు చివర కోలన్ ఆ తరువాత ప్రచురణ కర్త పేరు రాయాలి. పేరు తరువాత కామా ఉంచి ప్రచురించబడిన సంవత్సరం రాయాలి. ప్రతి ఆరోపం చివర బిందువు ఉంచాలి. ఇంతకు ముందేఅన్నట్టుగా ఈ పద్ధతితో ప్రారంభించిన తర్వాత ప్రతి పుస్తకానికీ ఇదేవిధమైన గుర్తులతో కొనసాగించాలి.

1. ఒకే రచయిత రాసిన పుస్తకం :

పేరు, ఇంటిపేరు, పుస్తకం పేరు. ప్రచురణ స్థలం : ప్రచురణ సంస్థ, ప్రచురణ కాలం.

2. ఒకే రచయితవే రెండు మూడు పుస్తకాలున్నపుడు :

మొదటి ఆరోపంలో మాత్రం పై విధంగానే రాయాలి: రెండవ ఆరోపంలో రచయిత పేరున్న జాగాలో మూడు పొట్టి గీతలు (HYPHENS) కామా ఉంచి రెండు ఖాళీలు వదలాలి. తరువాత పుస్తకం పేరు తదితర వివరాలను పైన చెప్పిన విధంగానే రాయాలి.

పేరు, ఇంటి పేరు, పుస్తకం పేరు, ప్రచురణ స్థలం : ప్రచురణ సంస్థ, ప్రచురణ కాలం.

....పుస్తకం పేరు, ప్రచురణ స్థలం : ప్రచురణ సంస్థ, ప్రచురణ కాలం.

....పుస్తకం పేరు, ప్రచురణ వివరాలు.

3. సంపాదకుడు :

మొదట సంపాదకుడి పేరు పైన చెప్పిన విధంగానే రాయాలి. పేరు తరువాత కామా ఉంచి ఒక ఖాళీ వదలి సంకేతాక్షరాలలో సంపాదకుడు అని రాయాల.

సంపాదకుడి పేరు, (సం.) పుస్తకం పేరు, ప్రచురణ స్థలం : ప్రచురణ సంస్థ, ప్రచురణ కాలం.

4. ఒకే పుస్తకానికి ఇద్దరు ముగ్గురు గ్రంథకర్తలయినపుడు :
మొదటి రచయిత పేరుతో మాత్రం మొదట అసలు పేరు రాసి తరువాత ఇంటి పేరు రాయాలి. కామా ఉంచి మిగిలిన రచయితల పేర్లను పుస్తకంలో ఉన్నట్లుగానే రాయాలి.

5. ప్రభుత్వ ప్రచురణలు లేక సంస్థల ప్రచురణలు :
సంస్థ పేరు, పుస్తకం పేరు. ప్రచురణ స్థలం : ప్రచురణ కాలం.

6. రచయిత పేరు లేనపుడు :
ఆరోపం పుస్తకం పేరుతోనే ప్రారంభించాలి.

7. పత్రికలో ఒక వ్యాసం :
రచయిత పేరు. 'వ్యాస శీర్షిక'. **పత్రిక పేరు.** సంపుటాల వివరాలు. ప్రచురణ కాలం : పుటల సంఖ్య.

8. అనువాదం :
మూల రచయిత పేరు, మూల గ్రంథం పేరు వరుసగా రాసిన తరువాత అనువాదకుడి పేరు, అనువాదం చేయబడిన పుస్తకం పేరు రాయాలి. అనువాదకుడి పేరు పక్కన సంగ్రహాక్షరాలలో అను. అని రాయాలి.

9. అముద్రిత సిద్ధాంత వ్యాసం :
రచయిత పేరు. **సిద్ధాంత వ్యాస శీర్షిక.** ఏ డిగ్రీ కోసం. ఆ.సి.గ్రం. విశ్వవిద్యాలయం పేరు, సంవత్సరం.

## 11.5.3. తీసుకోవలసిన జాగ్రత్తలు

1. పరిశోధకుడు విభిన్న భాషలనుండి పుస్తకాలను ఉల్లేఖించినపుడు ఒక్కొక్క భాషకు ఒక ప్రత్యేక ఉపయుక్త గ్రంథసూచి తయారు చేయాలి. అన్నిటిని కలగాపులగంచేసి ఇవ్వకూడదు :
2. విరామ చిహ్నాలను జాగ్రత్తగా ఉపయోగించాలి.
3. ఇంటిపేరును అసలు పేరును గుర్తించడంలో అనుభవం సంపాదించాలి.
4. సూచికలో హార్వర్డు విధానాన్ని అవలంబించి ఉంటే ఉపయుక్త గ్రంథ సూచి దానికి తగినట్లు రాయాలి.
5. ఆరోపాలన్నీ అకారాది వరుసలో ఉండేటట్లు జాగ్రత్త వహించాలి.
6. సంప్రదించిన అన్ని గ్రంథాలను ఉపయుక్త గ్రంథసూచిలో చేర్చాలి.

## 11.6. ఉదాహృతాలు
(Quotations)

### 11.6.1. ప్రవేశిక

పరిశోధకుడు తాను చెబుతున్న విషయాలు ప్రామాణికమైనవిగా నిరూపించడానికి ఇతరుల రచనలను ఉదాహరించవలసి ఉంటుంది. కాబట్టి విషయ సేకరణ చేసేటప్పుడు పరిశోధకుడు వివిధ గ్రంథాలనుంచి ముఖ్యమైన అంశాలను ఉన్నదున్నట్లుగా రాసుకోవాలి. గ్రంథకర్త చెప్పిన వాక్యాలనే విరామ చిహ్నాలతో సహా వ్యత్యాసం లేకుండా సిద్ధాంత గ్రంథంలో ఉపయోగించుకున్నపుడు అవి ఉదాహృత వాక్యాలవుతాయి.

### 11.6.2. ఉపయోగాలు

1. పరిశోధకుడు వెలిబుచ్చిన అభిప్రాయాలను బలపరచడానికి వాస్తవాలను నిరూపించడానికి ఇవి తోడ్పడుతాయి.
2. ఉదాహృత వాక్యాల వలన సిద్ధాంత గ్రంథానికి ప్రామాణికత చేకూరుతుంది.
3. వివిధ గ్రంథాలనుండి ఉదాహృత వాక్యాలను పేర్కొనడంవల్ల విషయ సేకరణలో పరిశోధకుని కృషి వ్యక్తమవుతుంది.

### 11.6.3. ఉదాహృత వాక్యాలను వాడవలసిన సందర్భాలు

1. ఒక రచయిత అభిప్రాయాలను తెలియజేయాలనుకొన్నపుడు ఆ రచయిత వాక్యాలలోనే దానిని చెప్పడం మంచిది.
2. గ్రంథకర్త మాండలిక శైలిలో రచన సాగించినపుడు పరిశోధకుడు దానిని అలాగే ఉచ్చరించడం మంచిది.
3. మూల రచయిత చెప్పినంత అందంగా తాను చెప్పలేననుకున్నప్పుడు ఉదాహృత వాక్యాలలో చెప్పాలి.
4. ఏదైనా ఒక అభిప్రాయాన్ని మనం సమర్థిస్తున్నపుడుగాని వ్యతిరేకిస్తున్నపుడుగాని లేక విశదీకరిస్తున్నపుడుగాని ఆ మూలాభిప్రాయాన్ని యధాతథంగా ఇవ్వడం మంచిది.
5. ఏదైనా ఒక అంశాన్ని గురించి వాద వివాదాలున్నపుడు వాటిని చర్చించడానికీ, తన అభిప్రాయాలను స్పష్టం చేయడానికీ ఉదాహృత వాక్యాలు తోడ్పడుతాయి.
6. ప్రభుత్వ నివేదికలను, న్యాయస్థాన తీర్పులను, అధికార ప్రకటనలను యథాతథంగా పేర్కొనడం మంచిది.

7. వ్యాకరణ, అలంకార, ఆధునిక విజ్ఞాన శాస్త్రాది విషయాలను వివరించేటప్పుడు ప్రామాణిక నిర్వచనాలను, లక్షణాలను ఉదాహృత వాక్యాలలోనే చెప్పాలి.

### 11.6.4. ఉదాహృత వాక్యాలను సూచించే పద్ధతులు

1. ఉదాహృత వాక్యాలను జంట ఉల్లేఖన చిహ్నాల (Double quotation Mark) ద్వారా సూచించాలి.

2. రెండు మూడు వరుసలకు మించని ఉదాహృత వాక్యాలను ఒకే పేరాలో రాయవచ్చు. ఉదాహృత వాక్యాల తరువాత గ్రంథకర్తకు, గ్రంథానికి సంబంధించిన వివరాలను సంక్షిప్తంగా తెలియజేయవచ్చు. లేక 1, 2, 3 సంఖ్యలు ఇచ్చి వివరాలను సూచికలో చెప్పవచ్చు.

3. ఒక్కొక్కసారి ఉదాహృత వాక్యాలతోనే ఉదాహృత వాక్యాలు చేర్చబడి ఉంటాయి. అప్పుడు మరల ఇస్తున్న వాక్యాల్ని జంట ఉల్లేఖన చిహ్నాలలో సూచించాలి.

4. ఉదాహృత వాక్యాలలో అవసరమైనవి మాత్రం గ్రహించి మిగిలిన భాగాన్ని వదలివేయవచ్చు. మూల రచయిత అభిప్రాయాలకు భంగం కలగకుండ ముఖ్యమైన అంశాలను మాత్రం తీసుకోవాలి. ఆదిలోగాని, మధ్యలోగాని, అంతంలోగాని అంటే ఎక్కడ వదలివేయవలసివస్తే ఆ భాగంలో మూడు చుక్కలు (...) ఉంచాలి. దీన్నే ఆంగ్లంలో Ellipsis అంటారు.

5. ఉదాహృత వాక్యాలు నాలుగు వరుసలకన్న పెద్దవైతే ఆ భాగాన్ని సింగిల్ స్పేస్‌లో టైపు చేయించి ప్రత్యేక పేరాగ్రాఫ్‌గా రాయాలి. ఉదాహృత చిహ్నాలను ఉపయోగించనవసరంలేదు. ఉదాహృత వాక్యం ప్రారంభించ డానికి ముందున్న వాక్యం చివర కోలన్ (:) గుర్తు ఉంచాలి. సిద్ధాంత వ్యాసంలో మామూలుగా విషయం రాసిన దగ్గర్నుంచి కాక మరో మూడు అంతరాలను వదలి ఉదాహృత భాగాన్ని టైపు చేయించాలి.

6. ఉదాహృత వాక్యాలను ఎటువంటి పరిస్థితుల్లోనూ దిద్ది రాయకూడదు. ఉదాహృత భాగంలో ఏవైనా తప్పులున్నప్పుడు ఆ భాగంలో మూలం అని కుండలీకరణాలలో [మూలం] రాయవచ్చు. అంటే మూలంలో ఇలాగే ఉందనీ, గ్రంథకర్త ఇలాగే చెప్పాడనీ అర్థం. తప్పు గ్రంథకర్తది కాని పరిశోధకుడిది కాదు అని తెలుస్తుంది.

7. పూర్తి పద్యం గాని, పద్యాలను గాని ఉదాహరించేటప్పుడు ఉదాహృత చిహ్నాలు అక్కర లేదు. పద్యం ఉదాహరించే ముందు కోలన్ (:) గుర్తు మాత్రం ఉంచాలి. పద్యాన్ని ఒక వరస (Single space) అంతరంలో టైపు చేయించాలి.

8. పద్యంలో ఒక పాదమో లేక కొన్ని పాదాలో ఉదాహరించదలచుకుంటే ఆ భాగాన్ని ఉదాహృత చిహ్నాలలో ఉంచాలి.

9. ఉదాహృత వాక్యాల మధ్యలో పాఠకుల వివరణ కోసం ఏదైనా చేర్చవలసి వస్తే ఆ భాగాన్ని నిలువు కుండలీకరణాల్లో [ ] ఉంచాలి.

10. ఇతర భాషలనుండి కొన్ని భాగాలను అలాగే ఉదాహృతాలుగా ఇవ్వ కూడదు. వాటి అనువాదాలను మాత్రం ఇవ్వాలి. మూలాన్ని సూచికలో ఇవ్వవచ్చు.

11. ప్రసిద్ధమైన, అందరికీ బాగా పరిచయమైన ఉదాహృతాలకు సూచికలు అవసరం లేదు.

12. గ్రంథకర్త చెప్పిన విషయాలను సంగ్రహంగా సిద్ధాంత గ్రంథంలో చెప్పవచ్చు. ఆ వాక్యాలకు ఉదాహృత చిహ్నాలు ఇవ్వవలసిన అవసరం లేదు. కాని సూచికలో రచయితకు, గ్రంథానికి సంబంధించిన వివరాలను తప్పనిసరిగా ఇవ్వాలి.

## 11.6.5. గమనించాల్సిన కొన్ని విషయాలు

1. ఉదాహృత వాక్యాలను అవసరమైనంతవరకే మితంగా ఉపయోగించాలి. పేజీలకు పేజీలు ఉదాహృత వాక్యాలను ఇవ్వడంవల్ల పాఠకులకు విసుగుపుడుతుంది. పరిశోధకుడు చెబుతున్న అంశాన్ని విస్మరించడమో లేక పొరబాటుగా అర్థం చేసుకోవడమో జరుగుతుంది. ఉదాహృతాలు ఆహారంలో ఉప్పులాగ మితంగా ఉండాలి. ఎక్కువైతే తిరస్కరింపబడే ప్రమాదం ఉంది.

2. ఉదాహృత భాగాలను పరిశోధకుడు ఒకటికి రెండుసార్లు బాగా ఆలోచించి ఎంచుకోవాలి. తాను చెబుతున్న విషయాలకు సంబంధించినవి మాత్రమే ఉదాహృతాలుగా గ్రహించాలి. అనవసరమైన భాగాలను పరిహరించాలి.

3. గ్రంథకర్త చెప్పిన విషయాలను ఎటువంటి పరిస్థితుల్లోనూ తారుమారు చేసి చెప్పకూడదు. ఉన్న విషయాలను ఉన్నట్లుగానే చెప్పాలి.

4. విరామ చిహ్నాలను ఉపయోగించడంలో మెలకువగా ఉండాలి.

5. ఇతరుల అభిప్రాయాలు గ్రహించినా వాటి వివరాలను సూచికల్లో తెలియజేయాలి. వారికి కృతజ్ఞతలు తెలియజేయడం పరిశోధకుడి కర్తవ్యం.

## 11.7. అనుబంధాలు

(Appendices)

అనుబంధాలను ఇవ్వటంవల్ల కొన్ని ప్రయోజనాలున్నాయి. వాటిని సందర్భోచితంగా ఉపయోగించాలి. వాటిని ఒక్కొక్క అంశంగా పరిశీలిద్దాం :

### 11.7.1. ప్రయోజనాలు

1. సిద్ధాంత వ్యాసంలో చెప్పబడిన అంశాలను పరీక్షించి తెలుసుకోవడానికి ఇవి ఉపకరిస్తాయి.
2. ముందు తరాల వారికి ఉపయోగపడే అరుదైన సాక్ష్యాధారాలు కాబట్టి వీటిని జాగ్రత్తగా సిద్ధాంత గ్రంథంలో చేర్చాలి.

### 11.7.2. ఎక్కడ చెప్పాలి?

సిద్ధాంత గ్రంథంలో ప్రధాన భాగం అయిన తరువాత అనుబంధాలను చేర్చాలి. ఉపయుక్త గ్రంథ సూచికకు ముందుగానే దీనిని చెప్పడం సమంజసంగా ఉంటుంది.

అనుబంధాలు ఒకటి కంటె ఎక్కువ ఉన్నప్పుడు వాటికి 1, 2, 3 అంటూ సంఖ్యలు ఇవ్వాలి. అనుబంధంలోకి విషయాన్ని సూచించే శీర్షిక పెట్టడమూ చేయవచ్చు. అనుబంధాలలో సిద్ధాంత వ్యాసంలోని పుట సంఖ్యలనే కొనసాగించాలి.

### 11.7.3. చేర్చదగిన విషయాలు

1. పరిశోధనకు సంబంధించిన సాక్ష్యాధారాలను సిద్ధాంత గ్రంథంలోనే ఇవ్వవచ్చు. కాని నిడివి అధికంగా ఉంటే రెండు మూడు పుటలకు విస్తరించిన విషయాలను ప్రత్యేకంగా అనుబంధంలో ఇవ్వడమే మంచిది.
2. తాను అనుసరించిన పరిశోధన ప్రణాళిక నూతనమైనపుడు పరిశోధకుడు దానిని గురించి వివరంగా అనుబంధంలో చెప్పవచ్చు.
3. గణాంక వివరాలను, పట్టికలను, రేఖా చిత్రాలను, మేపులను అనుబంధంలో ఇవ్వవచ్చు.
4. విషయ సేకరణలో రూపొందించుకొన్న ప్రశ్నావళిని, సందర్శన పద్ధతిలో వ్యవహర్తలతో జరిపిన సంభాషణల వివరాలను కూడ అనుబంధంలో చేర్చవచ్చు.

5. క్షేత్ర పరిశోధనల్లో పరిశోధకుడు సేకరించిన విషయ సామగ్రి ప్రధాన ఆకర (Supporting Data) మవుతుంది. దీన్ని ఆధారంగా చేసుకునే పరిశోధకుడు పరిశోధన సాగిస్తాడు. ముఖ్యంగా భాషా విజ్ఞానం, జానపద విజ్ఞానం మొదలైన పరిశోధనల్లో పరిశోధకుడు సేకరించిన అంశాలు విలువైనవిగా, అపూర్వమైనవిగా పరిగణింపబడుతుంటాయి. వీటిని అనుబంధంలో చేర్చడం మంచిది.
6. ఎక్కడా లభ్యంకాని అరుదైన దస్తావేజులు, ఉత్తరాలు, ఫోటోలు, ప్రభుత్వ నివేదికలు మొదలైన వాటి ఫోటోస్టాట్ కాపీలు అనుబంధంలో చేర్చవచ్చు.
7. సిద్ధాంత గ్రంథంలోని కొన్ని భాగాలను వివరంగా చర్చించాలనుకుంటే వాటిని అనుబంధంలో చేర్చవచ్చు.

### 11.7.4. తీసుకోవలసిన జాగ్రత్తలు

1. పరిశోధనాంశానికి సంబంధించిన విషయాలకు మాత్రమే అనుబంధంలో చెప్పాలి.
2. అనుబంధంలో చెప్పే విషయాలకు కూడ ఒక మితాన్ని పాటించాలి.
3. ఉదాహృత భాగాలను ఇచ్చేటప్పుడు ఎంతో జాగ్రత్త వహించాలి. ముఖ్యంగా గణాంక వివరాలు, పట్టికల విషయంలో ఒకటికి రెండుసార్లు మూలంతో సరిపోల్చి చూడాలి.
4. సిద్ధాంత వ్యాసంలో ఆయా అనుబంధాలకు సంబంధించిన చోట 'చూడు అనుబంధం' అని రాయాలి.
5. విషయ వైవిధ్యమున్నపుడు అనుబంధాలకు ఒకటి రెండు మూడు అంటూ సంఖ్యలు ఇచ్చి ఒక్కొక్క విషయాన్ని ప్రత్యేకంగా ఒక్కొక్క అనుబంధంలో చెప్పాలి.

## 11.8. ఉపసంహారం

నేడు విరివిగా వెలువడుతోన్న సిద్ధాంత వ్యాసాలను పరిశీలిస్తే అధికశాతం వ్యాసాల్లో ఉపయుక్త గ్రంథసూచి, అనుబంధాలు మొదలయిన భాగాల్లో ఒక క్రమం, ఏకరూపత పాటించటం లేదనే తెలుస్తూంది. ఇప్పటి వరకు మనం చర్చించిన సిద్ధాంత వ్యాసభాగాల్లో ఒకటి ముఖ్యం, ఇంకొకటి అముఖ్యం అని ఏమీ లేదు. గ్రంథసూచి అయినా, అనుబంధమైనా మొత్తం వ్యాసానికి ఆధారభూతమైనవే. సిద్ధాంత వ్యాసానికి ప్రామాణికతను, సంపూర్ణతను చేకూర్చేవే. పరిశోధన అంటేనే ఒక నిర్దిష్ట క్రమంలో ఒక సమస్యను గురించిన ఆలోచన, సత్యనిరూపణ, పరిష్కార ఆవిష్కరణ కాబట్టి ఈ క్రమం అనేది ప్రతి అంశంలోనూ వ్యక్తం కావాలి. అప్పుడే సిద్ధాంత వ్యాసం ఒక సమగ్రమైన నిర్దిష్టమైన సత్యశోధన అవుతుంది.

# చివరగా...

ఇంతవరకు పరిశీలించిన అధ్యాయాల నుండి మనం గ్రహించిందేమిటి? పరిశోధనకు ఒక క్రమం, రూపం, విధానం ఉందనీ, అది లేనప్పుడు పరిశోధకుడు అడవిలో దారితప్పిన వేటగాడిలా వ్యర్థ ఆయాసానికి లోనవుతాడనీ, అనుకున్న ఫలితాలను సాధించలేడనీ తెలుసుకున్నాం.

పరిశోధన అంటే ఏమిటి? పరిశోధకుడంటే ఎవరు? పరిశోధన సమస్య ఎలా ఉండాలి? పరిశోధన ప్రణాళిక స్వరూపం ఎలా నిర్ణయించాలి? ఊహాప్రతిపాదన అంటే ఏమిటి? పరిశోధన సామగ్రి సేకరణ, విశ్లేషణ ఎలా చేయాలి? పరిశీలన అనే భావన కున్న లోతైన అర్థం ఏమిటి? ప్రశ్నావళి, సందర్శన పద్ధతి ఎలా ఉపయోగపడతాయి? సిద్ధాంత వ్యాస రచన ఎలా చేయాలి? ఆధార విషయాలను ఎలా పేర్కొనాలి? - ఇలా ఇన్ని ప్రశ్నలు వేసుకుని అందుకు సమాధానాలు చెప్పుకునే ప్రయత్నం చేశాం ఈ పుస్తకంలో.

సక్రమంగా, సజావుగా, సూటిగా ప్రశ్నించటం కూడా ఒక నైపుణ్యమే. మనం వేసుకున్న పై ప్రశ్నల్లోనూ ఒక క్రమం ఉంది. ఎందుకంటే వాటి సమాధానాలు (అధ్యాయాలుగా మనం చదువుకున్నవి) పరిశీలిస్తే ఒక పరిణామ క్రమం కనిపిస్తుంది. ఈ క్రమం సిద్ధాంత వ్యాస రచనకు దారితీసే మౌలికమైన కొన్ని విషయాలను ఒక పద్ధతిలో చెబుతూ సిద్ధాంత వ్యాస రచన అంటే ఏమిటో దాన్ని ఎలా నిర్మించవచ్చో మనకు బోధపరుస్తుంది.

**'Method in Madness'** అనే ఒక సామెత వింటూనే ఉంటాం. అంటే ఎంతటి పిచ్చితనంలోనూ ఒక క్రమం ఉందని, క్రమ పద్ధతికి జీవన సరళిలో అత్యంత ప్రాధాన్యం ఉంది. మరి సామాజిక అంశాలను సాపేక్షంగా తరచి నూత్న సత్యాలను ఆవిష్కరించటానికి ఉపయోగపడే పరిశోధనలో క్రమం అన్నది తప్పనిసరి.

పరిశోధన లక్ష్యం, విధానం పరస్పర ఆపేక్షితాలు, పూరకాలు సామాజిక శాస్త్రాల్లో, భాషా సాహిత్యాల్లో పరిశోధన విధానం ప్రాముఖ్యాన్ని ఇప్పుడిప్పుడే విశ్వవిద్యాలయాలు గుర్తిస్తున్నాయి. తెలుగు పరిశోధన స్థాయిని మనం గమనిస్తే పరిశోధన విధానాన్ని పరిశోధకుల్లో చాలామంది చిత్తశుద్ధితో పట్టించుకోలేదనే

విషయం వ్యక్తమవుతుంది. ఇంతవరకూ పరిశోధన విధానం మీద తెలుగులో కేవలం రెండు పుస్తకాలు వెలువడ్డం ఇందుకు ప్రబలసాక్ష్యం. పరిశోధన విధానం గురించిన ప్రాథమిక పరిజ్ఞానంతో పరిశోధన చేయటం ప్రారంభిస్తే చాలదు. పరిశోధనాంశానికి అనువైన పరిశోధన విధానాన్ని ఎన్నుకునే, రూపొందించుకునే సామర్థ్యం పరిశోధకుడికి ఉండాలి. అందుకు పరిశోధన విధానాల్లో రకాలూ, ప్రత్యేకతలూ అధ్యయనం చేయాలి. అప్పుడే అది సాధ్యమవుతుంది.

ఈ పుస్తక పరిమితి కేవలం స్థూలంగా పరిశోధన విధానాల్ని పరిచయం చేయటం వరకే. అంటే ప్రశ్నావళి ద్వారానో, సందర్శన పద్ధతి ద్వారానో, మరెన్నో పద్ధతుల ద్వారానో, లేదూ వీటిలో ఏ కొన్నింటి ద్వారానో, ఎలా చేయవలసిందీ నిర్ణయించుకోవల్సిందీ పరిశోధకులే. పర్యవేక్షకుల అనుభవాన్ని ఆసరా చేసుకుని పరిశోధన లక్ష్యాన్ని బాగా అవగతం చేసుకుని, ఊహాప్రతిపాదన ఆధారంగా విధానాన్ని ఎంపిక చేసుకోవాలి.

ఎన్నుకునే విధానం పరిశోధనాంశంలో ఒక్క భాగాన్ని మాత్రం బహిర్గతం చేయవచ్చు. అంటే ఇది సాపేక్షం అన్నమాట. కొన్ని సందర్భాల్లో కొన్ని విధానాలు సరిగ్గా సరిపోతాయి. విధానాల్లో మార్పు ఫలితాల్లో మార్పుకు కూడా దారితీయవచ్చు. ఫలితాలను (ఊహాప్రతిపాదన ఆధారంగా) ఊహించి దాని కను గుణంగా విధానాన్ని నిర్ణయించుకోవడమా? లేదా పరిశోధనాంశం పరిధిని విషయ సామగ్రిని దృష్టిలో ఉంచుకొని విధానాన్ని నిర్ణయించడమా? ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు కొన్ని రకాల పరిశోధన సిద్ధాంతాలను వాటి ఆమూలాగ్ర క్రమ పరిణతిని పరిశీలించినపుడే తోస్తాయి. కొన్ని పరిశోధన అంశాలు కొన్ని పరిశోధన విధానాల ద్వారానే పరిశోధించటానికి అనువుగా ఉంటాయి. ప్రత్యేక విలక్షణ అంశాలు ప్రత్యేక విధానాలను అపేక్షిస్తాయి. ఇవి కొత్త పరిశోధన విధానాల రూప కల్పనకు దారితీస్తాయి. ఈ పరిణామక్రమం అనంతం.

ఇంతవరకూ ఈ పుస్తకంలో చర్చించిన ప్రతి అంశం మీదా ప్రత్యేకమైన ఆలోచన, పరిశీలన ఎంతో జరిగింది. వివిధ విజ్ఞాన శాఖలకు సంబంధించి అన్వయపూర్వకమైన పరిశీలనా జరిగింది. ఎటొచ్చీ ఆ పరిశోధన విషయాలన్నీ తెలుగువారికి అందుబాటులో లేవు. పరిశోధన పర్యవేక్షణలో తలపండిన విద్యైక జీవులు ఎప్పుడో చేపట్టి ఉండాల్సిన ప్రయత్నం ఇది. పరిశోధన విధానం ప్రాముఖ్యం గుర్తించక పోవటంవల్లో, మనకలవాటైన అలసత్వంవల్లో ఈ రంగంమీద దృష్టి పెద్దగా కేంద్రీకరించలేదు. పరిశోధన విధానంమీద సాధారణ పరిచయం కల్పించ టానికి ఉద్దేశించిన ఈ రచన ఆ దిశలో సాగించాల్సిన బృహత్ప్రయత్నానికి ప్రేరణ కాగలదనే విశ్వాసం. పరిశోధన కుహరంలో అడుగిడే యువ సాహసికులకు ఈ రచన చిరు కరదీపిక కాగలిగితే సార్థకమైనట్లే.

# ఉపయుక్త గ్రంథ సూచి

ఆంగ్లం:


Almack John. C. *Research and Thesis wi iting* Boston : Houghton Mifflin Company, 1952.

Anderson, Jonathan & Berry Durston, H. Millicent Poole. *Thesis and Assignment writing*, New Delhi : Willey Eastern Limited, 1977.

Bajpaj, S.R. *Methods of Social Survey and Research.* Kanpur : Kitab Ghar, 1960.

Best, John W. *Research in Education*, New Delhi : 4th Ed. Prentice, Hall of India Private Limited, 1982.

Cochraw, W.G, and Cox, G.M. *Experimental Designs*, Newyork : 1950.

Ghosh, B. N. *Scientific Methods and social Research.* New Delhi : 3rd Ed. Sterling Publishers Private Limited, 1985.

Gibaldi, Joseph and Achtert, Walter S MLA *Hand Book for writers of Research papers.* New Delhi : Wiley Limited, 1989.

Goode, William J. and paul K. Hatt. *Methods in Social Research*, Newyork : MC Graw - Hill Book Co. 1952.

Gopal, M. H. *An Introduction to Research Procedure in Social Sciences*, Bombay : Asia Publishing House, 1964.

Gopal, M. H. *Research Reporting in Social Sciences*, Dharwar : Karnataka University, 1965.

Joseph, Antony Adexis, *Methodology for Research*, Bangalore : Theological Publications in India, 1986.

Kothari, C. R. *Research Methodology - Methods and Techniques.* 2nd reprint. New Delhi : Wiley Eastern Limited, 1987.

Kulbir Singh Sidhu. *Methodology Research in Education*, New Delhi : Sterling Publishers Private Limited, 1987.

Parsons C. J. *Thesis and Project Work.* London : Ceorge Allen and Unwin Limited, 1973.

Sarma : B.A.V. Ed. *Research Methods in Social Sciences*, New Delhi : 2nd reprint, Sterling Publishers Private Limited, 1985

Shafer, Robert Jones Ed. *A guide to Historical Method* Illinois : The Dorsey Press, Home Wood, 1969.

Sonachalam. K. S *Research Methodology in Social Sciences*, Allahabad : Chaitanya Publishing House, 1979.

Wilkinson, T. S. Bhandarkar, P. L. *Methodology and Techniques of Soc al Research*, Bombay : Himalaya Publishing House, 1977.

Young, Pauline, V. *Scientific Social Surveys and Research 3rd Ind an reprint*, New Delhi : Prentice Hall of India Private Limited, 1975.

తెలుగు :

అప్పారావు, జి. & సూర్యనారాయణ, కె. **పరిశోధన పద్ధతులు.** మద్రాసు : ప్రగతిశీల సాహిత్యం, 1985.

ప్రభాకరరావు, ముదివేడు. "పరిశోధన - ప్రామాణిక నిర్వచనం". **తెలుగు పరిశోధన** (1989) : 56-69.

మోహన్, జి. యస్. "సందర్శన పద్ధతి". **తెలుగు పరిశోధన-5** (ఏప్రిల్ 1989) : 16-24.

వసంతకుమార్, వాసిలి. 'పరిశోధన–అర్థవివరణ.' **తెలుగు పరిశోధన-1** (1988) : 9-16.

—'రీసర్చ్ ప్రపోజల్,' **తెలుగు పరిశోధన - 2.** (1988) : 12-15.

—'విషయ సేకరణ,' **తెలుగు పరిశోధన - 3.** (1988) : 85-87.

—'పాద పీఠికలు,' **తెలుగు పరిశోధన - 4.** (1988) : 123-125.

సుందరం, ఆర్వీయస్. **పరిశోధన పద్ధతులు.** హైదరాబాదు : యువభారతి, 1990.

తమిళం :

చిదంబర నాదన్, వి. **ఆయ్వియల్ ముఱైగళ్.** నాగర్ కోవిల్ : సుబా పదిప్పగమ్, 1987.

పెరియ కరుప్పన్ & ఇలక్కుమనన్, **ఆయ్వియల్ అరిముగం.** మదురై : మీనాక్షి పుత్తగ నిలయం, 1986.

ముత్తుషణ్ముగన్ & వెంకట్రామన్, **ఇలక్కియ అరాయ్చ్చి నెరిముఱైగళ్.** మదురై : ముత్తు పదిప్పగమ్, 1990.

కన్నడం

కులకర్ణి, పి. వి. శరణ్బ, సదాశివ. **సంశోధన విధాన.** మదురై : ప్రభస ఓడుగడ, 1989.

# పారిభాషిక పదాలు

అకారాది వరుస — Alphabetical order
అధ్యాయాలు — Chapters
అనుబంధాలు — Appendices
అనుభవపూర్వక — Empirical
అనువాదకుడు — Translator
అంతరాలు/ఖాళీలు — Spaces
అంతస్సూచనలు — Implications
అన్వేషణ — Investigation
అపరిష్కృత సమస్య — Unsolved problem
అముద్రిత సిద్ధాంత వ్యాసం — Unpublished Thesis
అరచనాత్మక సందర్శన — Unstructured Interview
అరచితం — Unstructured
అర్థ విపరిణామం — Semantics
అవధానం — Attention
అవైయక్తికం — Non-participant
ఆకరాలు — Sources
ఆత్మాశ్రయం — Subjective
ఆధార విషయం — Reference material
ఆరోపాలు — Entries
ఆలోచన ప్రాధాన్యత — Role of thought
ఆశయాలు — Objectives
ఆసక్తి — Curiosity
ఇంటిపేరు — Surname
ఇంద్రియ విజ్ఞానం — Sense perception
ఉచ్చారణ విధానం — Pronounciation
ఉదాహృతాలు — Quotations
ఉద్దేశిత సందర్శన — Planned Interview

ఉప క్రమణిక – Introduction
ఉపయుక్త గ్రంథసూచి – Bibliography
ఉప శీర్షికలు – Sub headings
ఉప సంహారం – Conclusions
ఉపోద్ఘాతం – Preface
ఉల్లేఖన చిహ్నాలు – Quotation marks
ఉల్లేఖాలు – References
ఊహాప్రతిపాదన – Hypothesis
కచ్చితమైన – Accurate
కార్య కారణ సంబంధం – Cause and effect relationship
కాల పరిమితి – Time schedule
కుండలీకరణం – Brackets
కృతజ్ఞతలు – Acknowledgements
క్షేత్ర పర్యటన – Field work
గణాత్మక సందర్శన – Quantitative Interview
గుణాత్మక సందర్శన – Qualitative Interview
గ్రంథకర్త – Author
గ్రంథ భాగం – Main body of the thesis
గ్రహణశక్తి – Perception
జంట ఉల్లేఖన చిహ్నాలు – Double Quotation marks
జానపద విజ్ఞానం – Folklore
జిల్లా చరిత్రలు – District Gazetteers
తర్కం – Logic
తృతీయ ఆకరాలు – Tertiary sources
ద్వితీయ ఆకరాలు – Secondary sources
ధృవీకరణ – Verification
ధృవీకరణ పత్రం – Declaration
నియమ రహితం – Uncontrolled
నియమితం – Controlled
నిర్దిష్టాంశ సందర్శన – Focussed Interview
నిర్దేశ రహిత సందర్శన – Non-directed Interview

నిర్దేశాత్మక సందర్శన – Directed Interview
నిర్మాణాత్మకం – Systematic
నిర్వనం – Definition
నివేదిక – Report
నైపుణ్యం – Expertise
పక్షపాత దృష్టి – Bias
పట్టికలు – Charts
పద కోశాలు – Concordance
పరిమితులు – Limitations
పరివర్తనాంశాలు – Variables
పరిశీలన – Observation
పరిశోధకుడు – Researcher
పరిశోధన – Research
పరిశోధన ఆశయాలు – Objectives of the Study
పరిశోధన క్రమం – Research Process
పరిశోధన ప్రణాళిక – Research design
పరిశోధన వ్యాప్తి – Scope of Investigation
పరిశోధన సమస్య – Research problem
పరిశోధన సామగ్రి సేకరణ – Collection of Source material and data
పరిశోధనాంశ ఆకరాలు – Sources of problems
పరిశోధనాంశ వివరణ – Statement of the problem
పరిశోధనాంశ శీర్షిక – Title of the Research problem
పరీక్షోన్ముఖం – Verifiable
పాదసూచికలు/అధోజ్ఞాపికలు – Foot notes
పునఃపరిశీలన – Reworking/recasting
పునరావృత సందర్శన – Repetitive Interview
పునరుక్తం – Repetition
పూర్వ పరిశోధనలు – Previous studies
పూర్వ భాగం – Preliminaries
పోలిక పదాలు – Cognate words

ప్రకటనాత్మక ఊహాప్రతిపాదన – Declarative form Hypothesis
ప్రచురణ – Publication
ప్రచురణ కర్త – Publisher
ప్రచురణ కాలం – Publication date
ప్రచురణ సంస్థ – Publishing House
ప్రచురణ స్థలం – Place of Publication
ప్రధాన అధ్యాయాలు – Main Chapters
ప్రధాన ఆకరాలు – Primary Sources
ప్రయోగశాల – Laboratory
ప్రయోగాత్మక – Experimental
ప్రయోగాత్మక పరిశోధన – Experimental Research
ప్రయోగాలు – Experiments
ప్రయోజన లక్ష్యం – Utilitarian purpose
ప్రశ్నాత్మక ఊహాప్రతిపాదన – Question form Hypothesis
ప్రశ్నావళి – Questionnaire
ప్రశ్నావళి పద్ధతి – Questionnaire Method
ఫలితాల పట్టిక – Tabulations of Results
ఫలితాలు – Results
భవిష్యదంశసూచక ఊహాప్రతిపాదన – Prediction form Hypothesis
భావార్థం – Paraphrase
భాషా విజ్ఞానం – Linguistics
మాండలికం – Dialect
మిశ్రమ సందర్శన – Mixed Interview
ముఖ పత్రం – Front/Title Page
ముద్రణ – Edition
ముద్రిత – Published
మూఢ విశ్వాసం – dogma
మూలం – Original
మూల్య నిర్ధారణ – Evaluation

మౌఖిక నివేదిక – Oral Report
మౌలికత – Originality
రచనాత్మక సందర్శన – Structured Interview
రచితం – Structured
రూపొందించుకునే విధానం – Method of Formulation
రేఖా చిత్రాల పట్టిక – List of Tables
లక్షణాలు – Characteristics
లిఖిత నివేదిక – Written Report
వస్తుగత/వస్త్వాశ్రయ – Objective
వాస్తవాలు – Facts
విజ్ఞాన సర్వస్వాలు – Encyclopaedias
విరామ చిహ్నాలు – Punctuation Marks
విశిష్టాంశ దర్శనం – Specific
విశ్లేషణ – Analysis
విశ్లేషణాత్మక పరిశోధన – Analytical Research
విషయ సామగ్రి విశ్లేషణ – Data Analysis
విషయసూచిక – Contents
విషయ సేకరణ – Data Collection
వైజ్ఞానిక పద్ధతి – Scientific Method
వైజ్ఞానిక పరిశోధన – Scientific Research
వైయక్తికం – Participant
వైయక్తిక సందర్శన – Individual Interview
వ్యక్తిగత అభిరుచి – Personal interest
వ్యక్తీకరణ నేర్పు – Communication Skill
వ్యవహర్తలు – Informants
వ్యాసకర్త – Essay writer
వ్యాసం – Essay
వ్యుత్పత్తి – Etymology
శాస్త్రీయ నిర్దుష్టత – Scientific accuracy
శీర్షికలు – Headings
శూన్య ఊహా ప్రతిపాదన – Null Hypothesis

శైలి – Style
సంకలన కర్త – Compiler
సంకేతాల పట్టిక – List of Abbreviations
సంకేత చిహ్నాలు – Abbreviations
సందర్శన పద్ధతి – Interview
సంపాదకుడు – Editor
సంపుటం – Volume
సంప్రదింపు గ్రంథాలు – Reference Books
సమన్వయీకరణ – Interpretation
సవిమర్శక ఉపయుక్త గ్రంథసూచి – Critical Bibliography
సాంకేతిక నివేదిక – Technical Report
సాంకేతిక పదాలు – Technical Terms
సామాజిక అవసరాలు – Social needs
సామూహిక సందర్శన – Group Interview
సామ్యం – Analogy
సారాంశం – Summary
సిద్ధాంతవ్యాసం – Thesis
సిద్ధాంత వ్యాస రచన – Thesis writing
సిద్ధాంత వ్యాస రూప కల్పన – Thesis out line
సిద్ధాంత వ్యాస సంగ్రహం – Synopsis
సిద్ధాంత వ్యాస స్వరూపం – Format of the thesis
సులభ నివేదిక – Popular Report
సూచిక – Index
సూచికలు/జ్ఞాపికలు – Notes
హఠాత్సందర్శన – Spot Interview

